


పూర్వం బ్రహ్మపుత్రానదీ తీరపు అరణ్యాల్లోని ఒక గ్రామంలో, కాళీవర్మ అనే క్షత్రియయువకుడు వుండేవాడు. అతడి తండ్రి మహాయోధుడు. చంద్రశిలానగరపు రాజు కొలువులో సైనికోద్యోగిగా వుంటూ, ఒక యుద్ధంలో మరణించాడు. అప్పటికి కాళీవర్మ పదేళ్ళ వయసువాడు. అతడి తల్లి, భర్తపోయిన దిగులుతో త్వరలోనే చనిపోగా, బలభద్రుడనే విశ్వాసపాత్రుడైన నౌకరు, అతణ్ణి పెంచి పెద్ద చేసి, అన్ని క్షత్రియవిద్యలూ నేర్పాడు.

కాళీవర్మకు ఇరవైఏళ్ళ వయసు నిండగానే, బలభద్రుడు అతడితో, "కాళీ, యిక నువ్వీ కుగ్రామం వదిలి, రాజధానీ నగరానికి పోయి, అక్కడ రాజుగారి కొలువులో ఏదైనా ఉద్యోగం సంపాయించుకోవటం మంచిది," అన్నాడు.

కాళీవర్మకూ కొన్నాళ్ళుగా యిలాంటి ఆలోచనే మనసులో మెదులుతున్నది. కాని, తమ ప్రాంతాలను పాలించే రాజు జితకేతుడంటే అతడికేమాత్రం గౌరవం లేదు. రాజు పల్లె ప్రజల నుంచి పన్నులు వసూలు చేయడంలో సమర్థుడేకాని, వాళ్ళను వన్యమృగాల నుంచీ, బందిపోటుదొంగల నుంచీ కాపాడటంలో సమర్థుడు కాదు.

కాళీవర్మ యీ మాటే బలభద్రుడుతో చెప్పి, "ఆ చంద్రశిలానగరాన్ని పాలించే రాజు జితకేతు అసమర్థుడు, పిరికివాడు. అలాంటివాడి కొలువులో సైనికుడుగా



చేరి పొట్టపోసుకోవటంకన్న మరి అవమానం వుండదు,'' అన్నాడు.

ముసలి బలభద్రుడు కాసేపు ఆలోచించి, ''రాజుల పరిపాలనా దక్షత చాలావరకు వాళ్ళ ఆస్థానంలో ఉద్యోగులుగా వుండే వాళ్ళ మీద ఆధారపడి వుంటుంది. ఈ జితకేతు తండ్రి మహా పరాక్రమశాలి. నీ తండ్రిలాంటి ప్రతాపవంతులూ, బుద్ధిశాలులూ అతడి కొలువులో వుండేవారు. ఆ రాజు మరణానంతరం యీ జితకేతు సింహాసనం ఎక్కాడు. నా అనుమానం అతడి చుట్టూ కుక్షింభరులూ, ముఖప్రీతి కబుర్లాడేవారూ చేరివుంటారని,'' అన్నాడు.

''అంతేకావచ్చు! అలాంటి రాజును నేనొక్కణ్ణే ఉద్ధరించగలనా? ఈ గ్రామంలోనే ఉన్న పొలం దున్నుకుని బతుకుతాను,'' అన్నాడు కాళీవర్మ.

''ఆ పని నీ లాంటి క్షత్రియయువకుడు చేయవలసిందికాదు. పైగా నీ తండ్రి మరణించేముందు, తన తుదికోర్కెగా నాకు చెప్పిపోయిందేమిటో తెలుసా?'' అంటూ బలభద్రుడు ఇంటిలోపలికి దారి తీసి, అక్కడ ఏనాడూ తెరవని గది తలుపులతాళం తీసి, కాళీవర్మను తన వెంట లోపలికి తీసుకుపోయాడు.

ఆ గదిలో కాళీవర్మ తండ్రి ఉపయోగించిన రకరకాల ఆయుధాలూ, కవచం, దాని పక్కన బంగారు పిడిగల కత్తీ వున్నాయి. బలభద్రుడు కత్తిని కాళీవర్మ నడుముకు బిగించి, కవచాన్ని తొడిగి, ''ఆహా, యివి నీకు అతికినట్టు సరిపోయాయి! క్షత్రియయోధుడుగా జన్మసాఫల్యం చేసుకోమని నీ తండ్రి ఆజ్ఞ; తరవాత నీ యిష్టం,'' అన్నాడు.

తండ్రి తన కోసం వదిలిపోయిన కవచం, కత్తీ ధరించగానే కాళీవర్మ శరీరం పొంగిపోయింది. అతడు ఒరలో నుంచి కత్తిని లాగి, దాని పదును పరీక్షించి చూసి, దాని తళతళమనే మెరుపుకు అచ్చెరువుపడిపోతూ, ''భద్రా, తండ్రిగారి

ఆజ్ఞను శిరసావహిస్తాను! నా భవిష్యత్తును తీర్చిదిద్దవలసింది మొక్కపోయిన నాగటికర్రుకాదు; పదునైన యీ వాడి కత్తి,'' అన్నాడు.

ఆ మాటలకు బలభద్రుడు చాలా సంతోషించాడు. ఆ మర్నాడే కాళీవర్మ చంద్రశిలానగరానికి ప్రయాణమయేందుకు అన్నీ సిద్ధం చేశాడు. కాళీవర్మ కవచం చరించి, కత్తిని నడుముకు బిగించుకుని, దారి ఖర్చులకుగాను నూరు బంగారుమాడలు తీసుకుని, గుర్రాన్నెక్కి బయలుదేరాడు. రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించిన తరవాత, ఆరు నెలల్లో తిరిగి ఒకసారి తప్పక గ్రామానికి వస్తానని బలభద్రుడికి, అతడు మాట యిచ్చాడు.

అరణ్య మార్గాల వెంట కాళీవర్మ ప్రయాణం, మిట్టమధ్యాహ్నం వరకూ ఎలాంటి ఒడిదుడుకులూ లేకుండా సాగింది. అతడు వెంట తెచ్చుకున్న రొట్టెలు తిని, ఏ చెట్టు కిందనైనా కొంచెం సేపు విశ్రాంతి తీసుకుందామనుకుని, నీళ్ల కోసం ఎక్కడైనా కొండవాగు కనబడుతుందేమో అని, మార్గం నుంచి గుర్రాన్ని పక్కకు తిప్పి కొంత దూరం పోయేంతలో, ఒక చెట్టు మీది నుంచి అతడికి పెద్దగా మూలుగు వినిపించింది.



కాళీవర్మ ఆశ్చర్యపోతూ తల ఎత్తి చెట్టు కొమ్మల్లోకి చూశాడు. కొమ్మల్లోంచి మానవాకారం ఒకటి చిన్నగా కేక పెట్టి, దభీమంటూ జారి, నేల మీద పడింది. కాళీవర్మ చప్పున గుర్రం దిగి ఆ మనిషి దగ్గిరకు పోయాడు. అతడు బాగా వయసు మళ్ళినవాడు. పై నుంచి పడినందువల్ల అతడు గాయపడిన సూచన లేమీలేవు. ముసలివాడు లేచి నిలబడబోయి, నడుం పట్టుకుని పెద్దగా మూలిగి, తిరిగి నేల మీద చతికిలబడ్డాడు.

కాళీవర్మ అతణ్ణి సమీపించి, ''ఏం, తాతా, యీ వయసులో నువ్వు చెట్టు ఎక్కటం ఏమిటి? జిహ్వాచాపల్యం కొద్దీ



తేనెతుట్టె కొట్టబోయావా?'' అని అడిగాడు.

ముసలివాడు, కాళీవర్మ కేసి ఒకటి రెండు క్షణాలు పరీక్షగా చూసి, ''నాయనా, నువ్వేదో రాజుగారి భటుడిలావున్నావు. అవునా? సాధారణంగా పంటల తరుణంలో పన్నులు వసూలు చేసేందుకు తప్ప, మీరు యీ ప్రాంతాల మరేనాడూ కనబడరు గదా!'' అన్నాడు.

''నేను రాజభటుణ్ణికాదు; ఆఉద్యోగం కోసం నగరానికి పోతున్నవాణ్ణి. నే నడిగిన దానికి జవాబు చెప్పావుకాదే! తేనెతుట్టె ఎక్కడ? కాళ్లూ, చేతులూ విరక్క పోవటం నీ అదృష్టం,'' అన్నాడు కాళీవర్మ.

ముసలివాడు మౌనంగా లేచి నిలబడి, నాలుగైదడుగులు నడిచి, తృప్తిగా తలాడిస్తూ, ''నువ్వన్నట్టు అదృష్టవంతుణ్ణే. అలా కాకపోతే, యీసారి బందిపోటు దొంగలు గ్రామం మీద పడినప్పుడు, ఇంటనే వుండిపోయి, వాళ్ళవల్ల నానా హింసలూ పడవలసివచ్చేది.'' అన్నాడు.

ముసలివాడు యిలా అన్న తరవాత కాళీవర్మకు సంగతి కొంతవరకు అర్థమైంది. ముసలివాడు బందిపోటుదొంగల నుంచి పారిపోయి వచ్చి, చెట్టు మీద దాక్కుని, అక్కడ పట్టుజారి కింద పడ్డాడన్న మాట!

''తాతా, యీ ప్రాంతాల బందిపోటు దొంగల బెడద జాస్తి అని నేనూ విన్నాను. కాని, వాళ్ళు పట్టపగలే గ్రామాలమీదపడి దోచుకుపోతారని వినలేదు. మీ వాళ్లంతా ఏమయారు?'' అని అడిగాడు కాళీవర్మ.

''బందిపోట్లు రావటం చూస్తూనే అంతా తలొకదిక్కుకూ పారిపోయారు. వాళ్ళు గ్రామం వదలగానే ఒకళ్ళొకళ్ళు ఇళ్ళకు తిరిగి వస్తారు. ఇది మాకు మామూలే,'' అన్నాడు ముసలివాడు.

''ఈ బందిపోట్ల సంగతి రాజుగారికి తెలియపరచక పోయారా? ఆయన భటులను పంపి, వాళ్ళను వేటాడించేవాడు,'' అన్నాడు కాళీవర్మ. రాజు

సంగతి తెలిసి వుండి, ముసలివాడు ఏం జవాబిస్తాడో చూద్దామని.

తాత దిగులుగా ముఖం పెట్టి, "కబు రంపకుండానే రాజుగారి భటులు వచ్చి, మా పంటల్లో సగం ఎత్తుకుపోతారు. మిగిలిన సగం యీ చుట్టుపక్కల కొండల్లో వుండే బందిపోట్లు దోచుకుపోతారు. రాజుగారికి యీ సంగతి తెలియందికాదు," అన్నాడు.

అంతలో చెట్లచాటు నుంచి నలుగురు బందిపోటు దొంగలు ముందుకు వస్తూ, "ఆహా, ముసలివాడు మహబాగా చెప్పాడు. ఇక ముందు ముందు పండిన పంటల్లో రాజుగారి భాగం కూడా మేమే పుచ్చుకోబోతున్నాం," అంటూ కత్తులెత్తి, కాళీవర్మతో, "కవచం, కత్తి, గుర్రం— నీ వాలకం చూస్తూంటే, వెంట నాలుగు డబ్బులు మోసుకొస్తున్న వాడివిలాగే కనిపిస్తున్నావు. ఏదీ, ఆ డబ్బు సంచీ నేలమీద పెట్టి, నాలుగడుగులు వెనక్కు నడువు," అన్నారు.

కాళీవర్మ, దొంగల కేసి ఒకసారి తీవ్రంగా చూసి, గుర్రం దగ్గిరకుపోయి, దాని జీను నుంచి వేళ్ళాడుతున్న చిన్న రొట్టెల మూటను తెచ్చి, నేల మీద పడవేసి, రెండడుగులు వెనక్కు నడిచాడు. దొంగల్లో ఒకడు ఆశగా ముందుకు వచ్చి, వంగి మూటను ఎత్తబోయేంతలో కాళీవర్మ చర్రున కత్తి దూసి, వాడి మెడను ఒక్కదెబ్బతో తెగవేసి, చప్పున





ముందుకు దూకి, మరిద్దరు దొంగలను కత్తితో గుండెల్లో పొడిచాడు.

నాలుగో దొంగ ప్రాణభీతితో పెద్దగా అరిచి పారిపోబోయేంతలో, కాళీవర్మ పరుగు పరుగునపోయి వాడి జుట్టు పట్టుకుని, నడుం మీద గట్టిగా ఒక తన్ను తన్ని, వాడు కూలబడగానే, బర బరా ముసలివాడి దగ్గిరకు యీడ్చుకు వచ్చాడు.

హఠాత్తుగా తన కళ్ళ ఎదుట ముగ్గురు దొంగలు హతం కావటం, నాలుగవవాడు కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ, చావు కేకలు ప్రారభించటం చూసి, ముసలివాడు వణికిపోతూ, "నాయనా, ఏమి నీ సాహసం! మా గ్రామంలో నీ కన్న బలం గల యువకు లెంతమంది లేరు! వాళ్ళే నాడైనా తెగించి, యీ బందిపోట్ల నెదుర్కొని, ఒక్కగానొక్కణ్ణయినా చంపగలిగారా ?" అన్నాడు.

"ఆ పని మీవాళ్ళచేత నేను చేయించిగాని, రాజధానికి పోను. ఆకలి సంగతి తరవాత ; ఈ రొట్టెలమూట పట్టుకుని, నువు ముందుండి మీ గ్రామానికి దారి తియ్యి. ఈ బందిపోటునూ, గుర్రాన్నీ నేను వెనకగా తీసుకువస్తాను," అన్నాడు కాళీవర్మ.

ముసలివాడూ, కాళీవర్మా ఆక్కణ్ణించి బయలుదేరబోయేంతలో, కొందరు గ్రామస్థులు అక్కడికి రొప్పుతూ, రోస్తూ వచ్చి, "తాతా, ఏమైంది? ఆ చావుకేకలు పెట్టిందెవరు?" అని అడిగారు.

కాళీవర్మ వాళ్ళకేసి అసహ్యపడుతూ చూసి, "మీలో గుడ్డివాళ్ళెవరూ వున్నట్టు లేదు. జరిగిందేమిటో కనబడటం లేదా? గ్రామాలమీద పడి దోచుకునే బందిపోటు దొంగలను కలిసికట్టుగా ఎదిరించటం పోయి పిరికి పందల్లా అరణ్యంలోకి పారిపోయే మీరు ఏమన్న మనుషులు ?" అన్నాడు.

ఆ మాటలకు అందరూ తలలు వంచుకున్నారు. ముసలివాడు, వాళ్ళకు జరి

గిందేమిటో చెప్పి, "ఒరే, మన గ్రామం లోనే కాదు, చుట్టుపక్కల వున్న గ్రామా ల్లోని నా బోటి ముసల ముతక జనాన్ని వదిలేసి, మిగిలినవాళ్ళు, యీ కుర్ర వాడిని పెద్దగా చేసుకుని, కొండల్లోని బందిపోట్లను దుంపనాశనం చేయండి. పట్టపగలే కొంపా గోడూ వదలి, అర ణ్యంలో ఎంతకాలమని తల దాచు కుంటాం? మనం మనుషులమా లేక లేళ్ళూ, కుందేళ్ళలాంటి హీనజాతి జంతు వులమా?" అన్నాడు కోపంతో నిలువెల్లా వణికిపోతూ.



కాళీవర్మ ఆ మాటలకు తృప్తిగా తలా డించి, "నే చెప్పాలనుకున్నది, మీ గ్రామ వృద్ధుడే చెప్పాడు. ఈ దొరికిన దొంగ ద్వారా, కొండల్లోని తతిమ్మా బందిపోట్ల స్థావరాలు తెలుకోవటం ఏమంత కష్టం కాదు. మీలో కత్తి, ఈటె పట్టగలవాళ్ళు, నా వెంటరండి. ఒక్క వారం రోజుల్లో బందిపోట్లనందర్నీ సర్వనాశనం చేసి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

గ్రామస్థులు కాళీవర్మను సగౌరవంగా తమ గ్రామానికి తీసుకుపోయి విందు భోజనం పెట్టారు. ఆ సాయంకాలమే కొందరు యువకులు దూర గ్రామాలకు పోయి, మరి కొందరు యువకుల్ని తీసుకు వచ్చారు. కాళీవర్మ, వాళ్ళకు బందిపోట్లను ధైర్యంగా ఎలా ఎదుర్కో వాలో చెప్పాడు.

దొరికిన బందిపోటు దొంగ అంతగా హింసపడకుండానే, కొండల్లోని ఏగుహలో, లోయలో ఎంతెంత మంది బందిపోట్లు వున్నారో, అక్కడికి వెళ్ళేందుకు వున్న రహస్య మార్గాలేమిటో కాళీవర్మకు చెప్పేశాడు.

కాళీవర్మ, గ్రామయువకుల్ని వెంట బెట్టుకుపోయి, హఠాత్తుగా దాడులు చేసి, చాలామంది బందిపోట్లను చంపాడు. చావగా మిగిలినవాళ్ళు రాజ్య సరిహద్దులు దాటి, కొండల కావలనున్న అరణ్యాల్లోకి పారిపోయారు.

బందిపోట్ల వేట ముగిసిపోగానే కాళీవర్మ తిరిగి రాజాధానీ నగరానికి బయలుదేరాడు. పదిహేను రోజుల ప్రయాణం తరవాత అతడు అరణ్యం దాటి, చంద్రశిలా నగర పరిసరాలను చేరబోతూండగా, ఒకనాటి సూర్యోదయం వేళ, హఠాత్తుగా పదిమంది అశ్వికులు వచ్చి అతణ్ణి చుట్టు ముట్టారు. కాళీవర్మకు, ఒర నుంచి కత్తిదూసేందు కూడా సమయం లేదు.

అశ్వికులనాయకుడు, అతడి కేసి కొర కొర చూస్తూ, "నువ్వు, కాళీవర్మవు కాదా? బందిపోట్లను రాజ్యసరిహద్దుల లోని, అరణ్యాల నుంచి పొరుగు రాజ్యంలోకి పారదోలినవాడివి, నువ్వేగదా?" అని అడిగాడు.

"అవును, ఆ పని చేసింది నేనే! అలాంటి నన్ను ఎంతో గౌరవంగా నగరానికి తీసుకుపోయి, రాజదర్శనం చేయించటానికి బదులు, యిలా బందిపోటును చుట్టుముట్టి పట్టుకుంటున్నట్టు, పట్టుకోబోతున్నారేం?" అని అడిగాడు కాళీవర్మ ఆశ్చర్యపోతూ.

ఆ జవాబుకు అశ్వికుల నాయకుడు పెద్దగా నవ్వి, "నువ్వు, జితకేతు రాజుగారికి చేసిన ద్రోహం అంతాయింతాకాదు. ఇక్కణ్ణించి పారిపోయిన దొంగలు పొరుగు రాజ్యంలో బందిపోట్లు ప్రారంభించారు. ఆ రాజు, మా రాజుగారే యిందుక్కారణం అని, చంద్రశిలానగరం మీదికి దండెత్తి రాబోతున్నాడు. ఈ గొడవ కంతకూ కారణం అయిన నిన్ను, ఉరి తీసి, శవాన్ని ఆ రాజుకు పంపబోతున్నాం." అన్నాడు.

"ఆ జితకేతు రాజుతోపాటు మీకూ మతులు పోయినయ్యా!" అంటూ కాళీవర్మ కత్తి పిడిమీద చేయి వేయబోయేంతలో, అశ్వికులు అతడి మీదపడి కాళ్ళూ, చేతులూ కట్టి, గుర్రం మీదవేసి, ఉత్సాహంగా కేకలు పెడుతూ, నగరం కేసి బయలుదేరారు.

—(ఇంకావుంది)





# భల్లూక మాంత్రికుడు

## 2

[ కాళీవర్మ అనే క్షత్రియయువకుడు, ఉద్యోగం కోసం రాజధానీ నగరానికి పోతూండగా, దారిలో అతడికి బందిపోటు దొంగలను గురించి గ్రామస్థులు చెప్పారు. కాళీవర్మ గ్రామ యువకుల సాయంతో బందిపోట్లను వేటాడాడు. తరవాత అతడు నగరాన్ని సమీపిస్తుండగా, జితకేతురాజుగారి ఆశ్వికభటులు, అతణ్ణి హఠాత్తుగా చుట్టుముట్టి పట్టుకున్నారు. తరవాత—]

చంద్రశిలా నగర అశ్వసైనికులు, కాళీవర్మతో నగరం ప్రవేశించారు. అంత మంది సైనికులు, ఒక్కొగానొక్కణ్ణి గుర్రం మీద బంధించి తీసుకుపోతూండటం చూసి, రాజవీధి వెంట నడిచే ప్రజలు చాలా ఆశ్చర్యం చెందారు. వాళ్ళల్లో కొందరు, ఆ గుర్రం మీద కట్టబడి వున్న బంధితుడెవడని అడిగినప్పుడు ఆశ్వికుల నాయకుడు ఎంతో విజయగర్వంతో, "ఈ బంధితుడా? ఇతడి పేరు కాళీవర్మ! మన రాజ్యానికేగాక, పొరుగునవున్న దుర్ముఖరాజుగారి ఉదయగిరి రాజ్యానికి కూడా ప్రబల శత్రువు. అరణ్యంలో యితణ్ణి పట్టుకునేందుకు మేం పడ్డ శ్రమ అంతా యింతా కాదు." అని చెప్పసాగాడు.

చంద్రశిలా, ఉదయగిరి రాజ్యాలు రెంటికీ విరోధి అయిన యీ కాళీవర్మ



కథ ఏమిటో విందామని కొంతమంది జనం అశ్వికుల వెనకగా రాజప్రాసాదం కేసి నడిచారు. అశ్వికుల నాయకుడు రాజప్రాసాదం ముందున్న ఆవరణలో తన తోటి అశ్వికులను వుండమని చెప్పి, రాజభవనంలోకి పోయి, ఒక భటుడి ద్వారా జితకేతు రాజుకు, తాము కాళీవర్మను బంధించి తెచ్చినట్టు కబురు చేశాడు.

ఆ సమయంలో రాజు జితకేతుడు, ప్రధానమంత్రితో పొరుగు రాజు దండెత్తి వస్తానంటూ దూత ద్వారా పంపిన లేఖ గురించ మంతనాలాడుతున్నాడు. కాళీవర్మ దొరికినట్టు వింటూనే ఆయన పరమానంద పడిపోతూ, మంత్రితో, "మహామంత్రీ! ఈ కాళీవర్మ అనే క్షత్రియ యువకుడి కారణంగా మనం, రాజు దుర్ముఖుడితో యుద్ధం చేయవలసిన ప్రమాదం ముంచుకొచ్చిందనుకున్నాను. వాడు దొరికాడు; ప్రమాదం తొలగిపోయింది. వాణ్ణి ప్రాణాలతో దుర్ముఖుడి వద్దకు పంపుదామంటారా, లేక ఉరి తీయించి, శవాన్ని పంపటం బావుంటుందంటారా?" అన్నాడు.

"మహారాజా, రాజు దుర్ముఖుడి లేఖలో వున్నదాన్నిబట్టి, ఆయనకు మీరు చెప్పిన రెండు పద్ధతుల్లో ఏదైనా సమ్మతమే. కాని, మనకు యీ దొరికినవాడు, బందిపోట్లను మన రాజ్య పరిహద్దుల నుంచి ఉదయగిరి రాజ్యంలోకి పారదోలిన కాళీవర్మే అన్న గట్టి రుజువు కావాలి గదా? అలా లేనప్పుడు మనం మాట తప్పిన వాళ్ళమై, రాజు దుర్ముఖుడి వల్ల కొత్త చిక్కులు కొని తెచ్చుకున్న వాళ్ళమవుతాం." అన్నాడు మంత్రి.

"మన అశ్వికుల నాయకుడు, దొరికిన వాడు కాళీవర్మే అని కబురు చేశాడు గదా?" అన్నాడు రాజు జితకేతుడు.

"ఇంత పెద్ద చంద్రశిలానగర రాజ్యంలో, ఎంతమందయినా కాళీవర్మ పేరుగల వాళ్ళుండవచ్చు. కనక, తమరు

స్వయంగా వెళ్లి, అతణ్ణి విచారించి, శిక్షించటం మంచిది,'' అన్నాడు మంత్రి.

రాజు అందుకు సరేనంటూ బయలుదేరాడు. రాజూ, మంత్రీ భవనం ముందున్న ఆవరణను చేరేసరికి, అక్కడ చాలామంది ప్రజలు చేరి వున్నారు. మంత్రి ఆజ్ఞాపించగానే ఆశ్వికభటులు, కాళీవర్మ చేతులకు బిగించిన తాళ్ళు విప్పి, అతణ్ణి గుర్రం మీది నుంచి దిగమన్నారు.

కాళీవర్మ గుర్రం దిగి, నిర్భయంగా రాజూ, మంత్రుల కేసి తేరిపారజూస్తూ, ''మహారాజా, తమ సైనికులు అరణ్యంలో నా మీద హఠాత్తుగా వచ్చి పడి బంధించి, నన్ను చాలా అవమానపరిచారు. ఇందుకు వాళ్ళను తగిన విధంగా శిక్షించ కోరుతున్నాను,'' అన్నాడు.

ఆ మాటలకు రాజు జితకేతుడు ఆశ్చర్యపోతూ, మంత్రితో, ''మహామంత్రీ, ఇవేం అవివేకమైన పలుకులు? నా యీ పదేళ్ళ పరిపాలనలో నిందితుడెవడూ యిలా దురుసుగా మాట్లాడటం వినలేదే!'' అన్నాడు.

మంత్రి కోపంగా చేయి ఎత్తి, ''ఏయ్, పొగరుబోతా! మహారాజుగారి అనుమతి లేకుండా మాట్లాడినందుకు, నీకు యీ క్షణంలోనే శిరశ్ఛేద శిక్ష విధించవలసి వుంది. అయినా, నువ్వు ఎవరివైనదీ ముందుగా తెలుసుకోవలసి వున్నది గనక, బతికిపోయావు. చంద్రశిలానగర రాజ్యపు





అరణ్యంలోని దారి దోపిడిగాళ్ళను, ఉదయగిరి రాజ్యంలో ప్రవేశపెట్టిన వాడివి నువ్వేనా? నీ పేరేమిటి?'' అన్నాడు.

''నా పేరు కాళీవర్మ. నేనీ రాజ్య పౌరుణ్ణే! గ్రామాలమీద పడి ప్రజల ధన ధాన్యాలు దోచుకునే దొంగల్ని, ఆ గ్రామస్థుల సాయంతో ఎదుర్కొని, వాళ్ళల్లో కొందరిని చంపిన మాట నిజమే. ప్రాణభయం కొద్దీ మిగిలిన వాళ్లు సరిహద్దు దాటి ఉదయగిరి రాజ్యపు అరణ్యాల్లోకి పారిపోయి వుంటారు. అందుకు నేనెలా బాధ్యుణ్ణవుతాను?'' అన్నాడు కాళీవర్మ.

ఆ జవాబుకు మంత్రి మరింత కోపం తెచ్చుకుని, ''మహారాజా, నే నడిగిన చిన్న ప్రశ్నకు నిందితుడు అంత మాత్రైన పెద్ద జవాబివ్వటమే కాక, ఎదురుప్రశ్నలు కూడా వేస్తున్నాడు. ఆలశ్యమెందుకు, నిందితుణ్ణి తగిన విధంగా శిక్షించండి,'' అన్నాడు.

రాజు జితకేతుడు, కాళీవర్మ కేసి ఒక క్షణకాలం పరీక్షగా చూసి, ''ఇతడు మనం శిక్షించదలచిన కాళీవర్మే అన్న మాట! ఏయ్, వర్మా! నువ్వు నా అనుమతి లేకుండా, నా పౌరులైన కొందరిని చంపటమేగాక, పొరుగు రాజుతో కలహ కారణం అయినందుకు, నీకు మరణ శిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు.

ఆ మాట వింటూనే కాళీవర్మ ఒక త్రుటికాలం నిర్విణ్ణుడయిపోయి, అంతలోనే తేరుకుని, ''మహారాజా, యిదే న్యాయసూత్రానికి అనుగుణమైన శిక్ష? నా తండ్రి తమ, తండ్రిగారి కొలువులో సైనికోద్యోగిగా వుంటూ, ఒక యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు. నేను తమ దగ్గిర ఉద్యోగం కోసం, పుట్టి పెరిగిన గ్రామం వదిలి యింతదూరం వచ్చాను. ప్రజా కంటకులైన బందిపోటు దొంగలను వేటాడినందుకు, నాకు మరణశిక్ష?'' అన్నాడు.

"ఇది అధిక ప్రసంగం," అని, మంత్రి సైనికులతో, ''మహారాజుగారి ఆజ్ఞ

విన్నారుగదా? ఈ కాళీవర్మను నగర పొలిమేరల్లోని దిరిసెన చెట్ల తోపులో ఉరి తీసి, శవాన్ని ఉదయగిరిరాజు దుర్ముఖుల వారి సన్నిధికి పంపండి,'' అన్నాడు.

మంత్రి యిలా అనగానే అక్కడ చేరిన జనంలో కలకలం బయలుదేరింది. వాళ్ళల్లో కొందరు పెద్దగా గొంతులెత్తి, ''ఇది అన్యాయం! మహారాజుగారు తాము విధించిన శిక్ష గురించి మరోసారి ఆలోచించాలి,'' అంటూ కేకపెట్టారు.

''మహారాజుగారికే సలహా లివ్వగలిగినంత వివేకులు నగరంలో వున్నారన్న మాట, ఆశ్చర్యం!'' అంటూ మంత్రి పళ్ళు కొరికి, సైనికులతో, ''ఆ కేకలు వేసే రాజద్రోహుల్ని పట్టి, ఖైదులో వేయండి,'' అన్నాడు.

మంత్రి యిలా అనగానే సైనికులు తమ గుర్రాలను గుంపులుగావున్న జనం కేసి ఉరికించారు. వాళ్ళు భయకంపితులై చెల్లా చెదురుగా పారిపోసాగారు. అది చూసి రాజు జితకేతుడు తృప్తిగా నవ్వి, ''దండనీతి ఒక్కటే, యీ అలగా జనాన్ని అదుపులో పెట్టగలదు. సమయానికి తగిన ఆజ్ఞయిచ్చారు, మహామంత్రీ!'' అంటూ మంత్రిని మెచ్చుకుని, తన భవనం కేసి బయలుదేరాడు. వెనకగా మంత్రి కదిలాడు.



జనాన్ని దూరంగా తరిమివేసింతరవాత అశ్వసైనికుల నాయకుడు, కాళీవర్మ దగ్గిరకు వచ్చి, ''రాజాజ్ఞ విన్నావుగదా? పాపం, ఇంత చిన్నవయసులోనే, నువ్వీ లోకం వదిలిపోతున్నందుకు, నాకు కాస్త విచారంగానే వున్నది. కాని, రాజాజ్ఞ, దానికి తిరుగులేదు,'' అన్నాడు.

కాళీవర్మ ఉగ్రుడైపోయి, కత్తి దూయబోయినవాడల్లా, ఇది అదనుకాదనుకుంటూ ఆగి, ''నువ్వనే రాజాజ్ఞ ఎంత బుద్ధిహీనమైనదో, యిక్కడ చేరిన నగరవాసులకు తప్ప, మీలో మరెవరికీ అర్థమైనట్టులేదు. పరాయి రాజుకు భయపడి ప్రజలకు మేలుచేసిన నన్ను, యీ జిత



కేతరాజు ఉరి తీయించబోతున్నాడు!'' అన్నాడు.

''రాజ్యక్షేమం రాజుకే తెలియాలి; నీకూ, నాకూ ఎలా తెలుస్తుంది? సరే, బయలుదేరు. నిన్ను ఉరితీసే దిరిసెన చెట్లతోపు చేరేలోపల రాజుగారు దయ తలచి, నీ శిక్ష రద్దుచేస్తూ ఆజ్ఞాపత్రం పంపినా పంపవచ్చు. లోగడ కొందరు నిందితులు ఆఖరిక్షణంలో, ఆ విధంగానే ఉరిశిక్షలు తప్పించుకున్నారు.'' అన్నాడు అశ్వికుల నాయకుడు.

కాళీవర్మకు అలాంటి ఆశ ఏమీలేదు. కాని, ఏదో విధంగా తాను ఉపాయంతో, యీ సైనికుల నుంచి పారిపోవాలను కున్నాడు. అందుకు నగరపొలిమేరలు దాటిన తరవాత ప్రయత్నించటం మంచి దన్న నిర్ణయానికి వచ్చాడు.

అశ్వికుల నాయకుడు తన అనుచరు లందర్నీ హెచ్చరించి, కాళీవర్మతో, ''నీ కిప్పుడు చేతులకు సంకెలలు తగిలించవలసివుంది: ఏదీ చేతులు చాచు,'' అంటూ దగ్గిరకు వచ్చాడు.

''ఇక కొద్ది క్షణాల్లో చావబోతున్న నాకు, ఈ సంకెళ్ళబెడద ఎందుకు? నేను పారిపోతాననే గదా, నీ భయం? ఇదిగో, కావాలంటే నా కత్తి తీసుకో. ఇంత మంది ఆయుధధారుల మధ్య నుంచి, నిరాయుధుడనైన నేను ఎలా తప్పించుకోగలను,'' అంటూ కాళీవర్మ ఒరనుంచి కత్తినిలాగి అశ్వికులనాయకుడికి యిచ్చాడు.

అశ్వికులనాయకుడు కత్తి తీసుకుని తృప్తిపడి, ''కాళీవర్మా, చావబోయేవాడి కోర్కె తీర్చటం పుణ్యం అన్నారు. ఒక వేళ నువ్వు పారిపోయేందుకు ప్రయత్నిం చావో, మేం పదిమంది అశ్వికులం! పదికత్తులు నీ శరీరాన్ని తూట్లుపొడిచి, నిన్ను పరలోకయాత్ర చేయించగలవు, జాగ్రత్త!'' అన్నాడు.

తరవాత కాళీవర్మను మధ్య వుంచి, ముందు ఐదుగురు అశ్వికులూ, వెనకగా ఐదుగురు అశ్వికులూ నగరపొలిమేరల

కేసి బయలుదేరారు. జనం జితకేతరాజు దుష్టత్వాన్ని గురించి మాట్లాడుకోసాగారు.

ఒకగంట తరవాత అందరూ నగర పొలిమేరల్లోని దిరిసెనచెట్ల ప్రాంతాన్ని చేరారు. చిత్త ఒత్తుగా పెరిగిన ఆ చెట్లకు దాపుల్లో ఎత్తయిన కొండలున్నవి. ఒక కొండ చరియమీదినుంచి జలపాతం ఒకటి ఇరవై ముప్ఫై అడుగుల దిగువనున్న బండరాళ్ళమీద పడుతూ భయంకరంగా శబ్దం చేస్తున్నది.

ఆశ్వికులతోపాటు చెట్ల మధ్యకు పోతూనే కాళీవర్మ, "ఇక్కడా నన్ను, మీరు ఉరితియబోతున్నది?" అన్నాడు. తప్పించుకు పోయేందుకు మార్గం ఏమిటా అని, నలుదిక్కులా పరికించిచూస్తూ.

ఆశ్వికుల నాయకుడు, ఏదో జవాబివ్వ బోయేంతలో, ఒక ఎనుబోతు మీద ఎక్కిన నల్లని ఆకారం ఒకటి వాళ్ల కంట బడింది. ఎనుబోతు మీద వున్నవాడు తల నుంచి కాళ్ళవరకూ నల్లని దుస్తులు ధరించివున్నాడు. వాటికి కళ్ళ దగ్గి మాత్రం కంతలున్నవి.

ఆ ఎనుబోతు రౌతు చేతిలోవున్న గండ్రగొడ్డలిని పైకెత్తి పట్టుకుని, ఆశ్వికుల కేసి వేగంగా వస్తూ, "ఎవరు, మీరు? ఈ ప్రధానతలారి లోగడ శిర శ్చేదం చేసినవాళ్ళ ప్రేతాలా లేక కొత్తగా తలలు నరికించుకోవటానికి వచ్చిన వాళ్లా?" అంటూ భీకరమైన కంఠ స్వరంతో ప్రశ్నించాడు.



ఎనుబోతు తమ కేసి వేగంగా రావటం చూస్తూనే గుర్రాలు బెదిరి, పెద్దగా సకిలిస్తూ అటూ యిటూ పరిగెత్తినై. పారి పోయేందుకు యిది చక్కని అవకాశం అనుకుంటూ కాళీవర్మ తన గుర్రాన్ని ముందుకు దూకించబోయేంతలో, ఎను బోతు మీద వున్నవాడు మెరుపులా వచ్చి, గుర్రంకళ్ళెపు తాళ్ళను వడిసి పట్టుకుని, "దిరిసెన చెట్లంటే భూత ప్రేత పిశాచా లకు ఎంతో యిష్టం! అందుకే రాజుగారు దొంగలకూ, దేశద్రోహులకూ మరణ శిక్షలు యిక్కడ అమలు చేస్తున్నారు. నువ్వు దొంగవా, దేశద్రోహివా?" అని ప్రశ్నించాడు.

"నేను ఆ రెంటిలో ఏదీకాదు. నువ్వే జాతి పిశాచానివి?" అన్నాడు కాళీవర్మ, కళ్ళెపుతాళ్ళను ఎనుబోతువాడి నుంచి లాక్కునేందుకు ప్రయత్నిస్తూ.

అంతలో అక్కడికి చెల్లా చెదరైన అశ్వికులందరూ వచ్చిచేరారు. అశ్వికుల నాయకుడు కోపంగా, ఎనుబోతు రౌతును, "ఒరే, ఈ గత్తరంతా ఏమిటి? నిన్నేమైనా పిశాచిపట్టిందా?" అన్నాడు కసురుతూ.

ఎనుబోతువాడు కాళీవర్మ గుర్రపు కళ్ళెంతాళ్ళను వదిలి, "నగరప్రధాన తలారినే ఒరే, అరే అంటున్నావా? రాజుగారు ఏ రోజన అయినా, నీకు శిరశ్ఛేద శిక్ష వేసి, నా దగ్గిరకు పంపవచ్చు. అప్పుడు నిన్ను నా మొండిగొడ్డలితో, ఎండు మోడును నరికినట్టు నరుకుతాను," అన్నాడు.

"తాగుబోతు వెధవా. యీ అవమా నాన్ని నేను సహించను!" అంటూ అశ్వికుల నాయకుడు చప్పున కత్తి దూశాడు. అమరుక్షణం కాళీవర్మ మెరుపు వేగంతో తలారి చేతినుంచి గండ్ర గొడ్డలిని లాక్కుని, అశ్వికులనాయకుడి కంఠం మీద బలంగా కొట్టాడు.

అశ్వికులనాయకుడి తల తెగి కింద పడేంతలో, దూరం నుంచి, "జై, ఆది భల్లూకా! ధైర్యశాలివిరా, యువకా!" అన్నకేక వినిపించింది.— (ఇంకావుంది)





# భల్లూక మాంత్రికుడు

## 3

[అరణ్యగ్రామాల్లోని ప్రజలకు బందిపోట్ల బాధ లేకుండా చేసిన కాళీవర్మను, పొరుగు రాజుకు భయపడి, జితకేతరాజు మరణశిక్ష విధించాడు. శిరశ్ఛేద సమయంలో, ఎనుబోతుపై వచ్చిన తలారి నుంచి గండ్రగొడ్డలిని లాక్కుని కాళీవర్మ, అశ్వికనాయకుడి తల నరికాడు. ఆ మరుక్షణం జై, అదిభల్లూకా! అన్న పెద్ద కేక వినిపించింది. తరవాత—]

ఆదిభల్లూకా, అన్న కేక వింటూనే అశ్వికులందరూ తలలుతిప్పి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. కాళీవర్మ గుర్రం మీది నుంచి కిందికి దూకి, తాను లోగడ అశ్వికుల నాయకుడికి యిచ్చిన కత్తిని తీసుకుని, ఒరలో పెట్టుకున్నాడు. అంతలో కొండచరియ పైనుంచి దుముకుతున్న జలపాతం దగ్గిర, ఒక అజానుబాహుడైన వ్యక్తి కనిపించాడు.

"ఇతడెవరో మాంత్రికుడై వుండాలి!" అనుకుంటూ కాళీవర్మ, తానక్కడి నుంచి పారిపోయేందుకు ప్రయత్నిస్తే, అశ్వికులు దారినడ్డగించగలరేమో అని, వాళ్ళ ముఖాలకేసి పరీక్షగా చూశాడు. అశ్వికుల్లో ఎవరిదృష్టీ అతడిమీద లేదు. అందరూ జలపాతం వెనకనుంచి, హఠాత్తుగా బయిటికి వచ్చిన వ్యక్తి కేసి భయాశ్చర్యాలతో చూస్తున్నారు.



మీద వున్న తలారీ భయకంపితులై చిన్నగా వణుకుతున్నారు.

ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించినవాడు, వాళ్ళను సమీపించి, "నేను సమయానికి ఆదిభల్లూకుడి పేరు స్మరించకపోతే, యిక్కడ మరికొంత రక్తపాతం జరిగి వుండేదని, నాకు తెలుసు. నా పేరు భల్లూకమాంత్రికుడు!" అన్నాడు.

ఒకటి రెండు క్షణాలు ఎవరూ మాట్టాడలేదు. కాళీవర్మ కుడిచేత్తో కత్తినీ, ఎడమ చేత్తో తలారి నుంచి లాక్కున్న గండ్ర గొడ్డలినీ పైకెత్తి పట్టుకుని, భల్లూక మాంత్రికుడితో, "అయ్యా, అడక్కుండానే తమ పేరేమిటో సెలవిచ్చారు, బావుంది! ఇక యిక్కడ, మీరన్నట్టు కొద్దిలో తప్పిన మరికొంత రక్తపాతం మాట! ఇప్పుడు నా దారిని ఎవరైనా అడ్డగిస్తే, మరికొన్ని కంఠాలు తెగి నేలపడనున్నవి." అంటూ గుర్రాన్ని అదిలించాడు.

"ధైర్యశాలివిరా, యువకా! ఒక్క క్షణం ఆగు!" అని భల్లూకమాంత్రికుడు తన మంత్రదండంతో, ఎనుబోతు మీద కదలా మెదలక వున్న తలారిని చిన్నగా పొడిచి, "ఒరే, ముసుగులో వున్న నువ్వు, ఈ దిరిసెనవన పిశాచానివా లేక రాజుగారి ప్రధాన తలారివా?" అని అడిగాడు.

ఇప్పుడు జలపాతం దాపులనుంచి కేక పెట్టినవాడు, దాని ముందున్న మోకాటి లోతు నీటిపాయను దాటి, ఒడ్డుమీదికి వచ్చాడు. మనిషి మంచి బలశాలిలా వున్నాడు; నల్లని ఎలుగుబంటి చర్మాలు ధరించి వున్నాడు; చేతిలో దృఢమైన దండం వున్నది; దాని పిడిమీద ఒకే వజ్రంలో మలిచిన ఎలుగుబంటి తల ధగధగ మెరుస్తున్నది.

ఆ క్షణం వరకూ, ఆ ప్రదేశాన్నుంచి పారిపోవాలని ఆత్రపడుతున్న కాళీవర్మ, తమకేసి వస్తున్న ఆ వింత దుస్తులు ధరించినవాణ్ణి చూస్తూ కదలామెదలక వుండిపోయాడు. అశ్వికులూ, ఎనుబోతు

''అయ్యా, నేను పిశాచాన్ని కాదు; ముమ్మాటికీ రాజుగారి ప్రధాన తలారినే. ఆయన శిక్ష వేసినవాళ్ళ తలలు నరకటం నా పని,'' అన్నాడు తలారి, మాంత్రికుడి వేషం చూసి భయపడి పారిపోజూస్తున్న ఎనుబోతు మెడను చేతితో దువ్వుతూ.

"అలా అయితే, శిరశ్ఛేదశిక్ష తప్పించుకోవటమే గాక, ఒక రాజసేవకుడి తల కూడా నరికి పారిపోజూస్తున్న నిందితుణ్ణి నువ్వేం చేయబోతున్నావు?'' అన్నాడు భల్లూకమాంత్రికుడు, అశ్వికుల నాయకుడి కళేబరం కేసి చూస్తూ.

''అయ్యా, నేను నిరాయుధుణ్ణి! నా గండ్రగొడ్డలిని నిందితుడైన యీ కాళీవర్మ బలప్రయోగంతో లాక్కున్నాడు,'' అన్నాడు తలారి బొంగురు పోయిన గొంతుతో.

ఈ మాంత్రికుడెవడోగాని తన మీదికి తలారినీ, అశ్వికుల్నీ ఉసికొల్పుతున్నాడని గ్రహించిన కాళీవర్మ, గండ్రగొడ్డలిని తలారి కేసి చాస్తూ, ''ఒరే, ముసుగు పిశాచీ, యిదిగో నీ గొడ్డలి! నా దారిని అడ్డగించగలవేమో చూడు!'' అన్నాడు.

ఆ వెంటనే తలారి తన ముసుగు తీసి దూరంగా విసిరివేస్తూ, తడబడే మాటల్తో, ''కాళీవర్మా, నువు మహాశూరుడివి; దిరిసెనవన భైరవుడి సాక్షిగా చెబుతు



న్నాను. నా అహం కూడా దిగిపోయింది.'' అన్నాడు.

''అహంతోపాటు తాగిన మైకం కూడా దిగిపోయి వుండాలి, ఇక దారి తొలుగు!'' అని, కాళీవర్మ, కొంచెం దూరంగా వున్న అశ్వికులతో, ''మీ మాటేమిటి? మీ నాయకుడికి పట్టిన దుర్గతి చూశారు గదా?'' అన్నాడు.

''శిరశ్ఛేద శిక్ష అమలు చేయవలసిన వాళ్ళలో ఒకరు చావగా, రెండవవాడు లొంగిపోయాడు. ఈ సంగతేదో రాజుగారికి చెబుతాం. దార్లు అడ్డగించి కత్తులు నరికించుకునేంత అమాయకులం కాదు, మేము!'' అన్నారు అశ్వికులు.



''బుద్ధిగల మాట చెప్పారు!'' అని కాళీవర్మ గుర్రాన్ని అదిలించి, అక్కడి నుంచి బయలుదేరబోయేంతలో, భల్లూక మాంత్రికుడు, ''భల్లూకపాదగురో! ఎట్టకేలకు మనకు కావలసిన జాతకుడు దొరికాడు,'' అంటూ ఒక్క కేకపెట్టి, కాళీవర్మ గుర్రపు కళ్ళెపు తాళ్లు పట్టుకుని, ''కాళీవర్మా! ఇక్కడ మహామంత్రవేత్త అయిన భల్లూకమాంత్రికుడు వున్న సంగతే నువ్వు మరిచినట్టున్నదే!'' అన్నాడు.

కాళీవర్మకు చిన్నప్పటినుంచీ మాంత్రికులన్నా, భూతవైద్యులన్నా, గణాచార్లన్నా ఏమాత్రం గౌరవభావం లేదు. అలాటివారిని ఎంతమందినో లోగడ అతడు తను పుట్టి పెరిగిన గ్రామంలో, చుట్టుపక్కల వున్న గ్రామాల్లో చూసి వున్నాడు.

భల్లూకమాంత్రికుడి మాటలు వింటూనే కాళీవర్మ, అతడేదో తనను చులకన చేసి మాట్టాడుతున్నాడని కోపం తెచ్చుకుని, ''అయ్యా, తమ పేరు భల్లూకమాంత్రికుడా? వింటేనే భీతి కొల్పేట్టుగా వుంది. మీరు యింతకు ముందే మరొక భల్లూకుడి పేరు కూడా పలికారు; ఆయనెవరు? ఏ భల్లూకుడెవరో గుర్తుపెట్టుకోవటం, నా బోటి సామాన్యుడికి చాలా కష్టం,'' అన్నాడు.

కాళీవర్మ తన పేరును యింత అపహాస్యం చేసి మాట్టాడినా భల్లూకమాంత్రికుడు కోపం తెచ్చుకోకపోగా, చిరునవ్వు నవ్వుతూ, ''నా గురువుగారి పేరు భల్లూకపాదుడు, నా పేరు భల్లూకమాంత్రికుడు. ముందు ముందు జరుగనున్న మహాద్భుతాలు చూసి, మహదానందపడబోయే నువ్వు, పేర్లలో వున్న యీ చిన్న పోలికను చూసి గజిబిజి పడిపోకు,'' అన్నాడు.

''ఇల్లొదిలి బయల్దేరిం. తరవాత, యిప్పటివరకూ ఎదురైన గజిబిజిల్తోనే మొహం మొత్తింది. ఇక త్వరగా

మా గ్రామం చేరి, పొలం సేద్యం చేసుకుంటూ, ఉన్న దానితో తృప్తిపడతాను," అంటూ కాళీవర్మ గండ్రగొడ్డలిని, తలారి కేసి విసిరివేసి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు.

గుర్రం కదిలి, పదీ పన్నెండడుగులు నడిచి, యిక దౌడు తీయబోయేంతలో వెనకనుంచి భల్లూకమాంత్రికుడు పెద్ద గొంతుతో, "కాళీవర్మా, ఆగు! నీకెదురుగా వస్తున్న వాళ్లెవరో చూశావా?" అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే కాళీవర్మ కొంచెం తల ఎత్తి ముందుకు చూశాడు. ఒక పెద్ద దిరిసెన చెట్టు వెనకనుంచి, ముగ్గురు అశ్వికులు వేగంగా వస్తున్నారు. వారిలో మధ్య వున్నవాడు పట్టుదుస్తులూ, పెద్ద తలపాగా ధరించి వున్నాడు. పక్కలనున్నవాళ్ళు కవచధారులు; వాళ్ళ చేతుల్లో కత్తులూ, భుజాల మీద తళతళ మెరుస్తున్న డాళ్ళూ వున్నవి.

వాళ్ళను చూస్తూనే కాళీవర్మ, గుర్రం కళ్ళాన్ని గట్టిగా వెనక్కు గుంజి ఆపాడు. కవచధారులైన అశ్వికుల మధ్య పట్టు దుస్తుల్లోవున్నవాడు, చేయెత్తి కాళీవర్మను చూపుతూ తలారితో, "ఒరే, నగరప్రధాన తలారీ! ఈ నిందితుడికి శిరశ్ఛేద శిక్ష విధించారు రాజుగారు. ఇంకా శిక్ష అమలుచేయలేదేం?" అన్నాడు కోపంగా.



తలారి గడగడ వణికిపోతూ, ఎనుబోతు మీదినుంచి దిగి, ఏం జవాబివ్వాలా అని ఆలోచిస్తున్నంతలో భల్లూకమాంత్రికుడు, తలారిని ప్రశ్నించిన అతడిని సమీపించి, "నువ్వేగదా, జితకేతురాజుకు ప్రధానామాత్యుడైన జీవగుప్తుడు?" అని ప్రశ్నించాడు.

రాజు పట్లగాని, తన పట్లగాని ఒక్క గౌరవవాచకం కూడా లేకుండా, అలా ప్రశ్నించిన వీడెవడో కపటబైరాగి అయి వుంటాడనుకుని మంత్రి జీవగుప్తుడు కోపంతో కళ్ళెర్రచేసి, "ఎవడీ బైరాగి? ముందితణ్ణి ఇక్కడి నుంచి తన్ని తగలెయ్యండి." అన్నాడు.



ఆ ఆజ్ఞ వింటూనే మంత్రి పక్కన వున్న ఆశ్వికులు కత్తులు దూయబోయిన వాళ్ళల్లా, భల్లూకమాంత్రికుడి మంత్ర దండం కేసి చూసి, నివ్వెరపోయారు. గుర్రాలు పెద్దగా సకిలిస్తూ, వెనక్కు నాలుగడుగలు వేసినై.

ఏం జరిగిందో అర్థంకాని మంత్రి జీవగుప్తుడు, ఆశ్చర్యంగా తన అంగరక్షకు లిద్దరికేసీ చూసి, "ఏం జరిగింది? పులిని చూసిన లేళ్ళలా అలా వణికిపోతు న్నారేం?" అని అడిగాడు.

"అయ్యా, పులికాదు, ఆ బైరాగి చేతిలోని మంత్రదండం పిడికి బిగించి వున్న ఎలుగుబంటి తల కేసి చూడండి! అది ఇంతకుముందు నోరు తెరిచి, కోరలు చాచి, కళ్ళల్లో నిప్పురవ్వలు రేపింది," అన్నారు ఆశ్వికులు.

జీవగుప్తుడు, భల్లూకమాంత్రికుడి మంత్రదండపు ఎలుగు తలాటం కేసి పరీక్షగా చూసి, హేళనగా నవ్వి, "ఏమోయ్, బైరాగీ! నీ మాట తీరూ, చేష్టలూ చూస్తూంటే, పెద్ద పొగరు బోతులావున్నావు. ఏమైనా టక్కుటమార విద్యలూ, ఇంద్రజాలం నేర్చినవాడివా?" అని అడిగాడు.

మంత్రి యిలా అనగానే భల్లూక మాంత్రికుడు గుడ్లురుముతూ అతడి ముఖం కేసి తీక్షణంగా చూసి, "సన్యాసి ముదిరితే, బైరాగి అవుతాడని సామెత; తొండముదిరి ఊసరవెల్లి అయినట్టు! నేను సన్యాసినీ కాను, బైరాగినీ కానూ— భల్లూకమాంత్రికుణ్ణి! జై, ఆది భల్లూకా!" అంటూ ఒక కేకపెట్టి, మంత్రదండంతో పక్కనవున్న ఒక ఎండిన చెట్టుబోదెను గట్టిగాకొట్టాడు.

మంత్రదండం దెబ్బకు చెట్టు బోదె నుంచి ఛరీమంటూ నిప్పు రవ్వలు లేచి, మరుక్షణం చెట్టు భగభగమనే మంటలతో నిలువునా కాలిపోసాగింది. మంత్రి జీవ గుప్తు డెక్కివున్న గుర్రం వెనక కాళ్ళమీద లేచి, పెద్దగా సకిలిస్తూ దూరంగా పరి

గెత్తింది. అతడి అంగరక్షకులైన అశ్వికులు, అతణ్ణి అనుసరించారు.

ఒకటి రెండు క్షణాలపాటు అక్కడ వున్న ఎవరి నోటా మాట పెగలలేదు. దూరం నుంచి యిదంతా గమనిస్తున్న కాళీవర్మ, గుర్రాన్ని అదిలించి భల్లూక మాంత్రికుడి దగ్గిరకు వచ్చి, గుర్రం దిగి, "ఆహా, నువ్వు మామూలు మాయలమారి ఇంద్రజాలికుడివి కాదు; మహామంత్రవేత్తవు! కపటీ, దుష్టుడూ అయిన యీ జితకేతరాజు మంత్రిని హడలెత్తించినట్టే, ఇతడి ప్రభువునూ, నీ మంత్రశక్తితో భయకంపితుణ్ణి చేసి, కాస్త బుద్ధిగా రాజ్యపాలన చేసేట్టు ఎందుకు చేయకూడదు?" అన్నాడు.

"భళీ, నువు ధైర్యశాలివే కాదు; బుద్ధిశాలివి కూడారా, యువకా! నా మనసులో వున్నదానిని, యిట్టే పసికట్టేశావు!" అని భల్లూకమాంత్రికుడు, కాళీవర్మను మెచ్చుకుని, మంత్రి జీవగుప్తుడితో, "మంత్రీ, నా శక్తి ఎలాంటిదో చూశావు గదా! ఇక యిప్పుడిక్కడ ఆజ్ఞలివ్వవలసిన వాళ్ళు, నువ్వా? నేనా?" అని అడిగాడు.

మంత్రి జీవగుప్తుడు నిలువునా కాలిపోతున్న చెట్టుకేసే చూస్తున్నాడు. అతడికి తానేదో ప్రాణాపదలో చిక్కుకున్నట్టు



భయంపట్టుకున్నది. భల్లూకమాంత్రికుడు మరోసారి గద్దించుతూ అదే ప్రశ్న అడిగేసరికి, అతడు వణుకుతున్న గొంతుతో, "అయ్యా, భల్లూకమాంత్రికా! మీ అమోఘమైన శక్తుల్ని కళ్ళారా చూశాను. ఇక్కడే కాదు, తమకు తీరుబాటుంటే, రాజప్రాసాదానికి వచ్చి, అక్కడా జితకేతురాజుగారికి ఆజ్ఞలూ, సలహాలూ యివ్వవచ్చు!" అన్నాడు.

"ఎంతటి మహామంత్రికి, ఎలాంటి దుర్గతి పట్టింది!" అంటూ కాళీవర్మ చుట్టూ వున్న అశ్వికులకేసీ, ఎనుబోతు దగ్గిర దిగాలుపడి వున్న తలారికేసీ చూశాడు.

భల్లూకమాంత్రికుడు, తన మంత్ర దండాన్ని పైకెత్తి పట్టుకుని. ''నా ఆజ్ఞలేమిటో అందరూ జాగ్రత్తగా వినండి!'' అని తలారితో, ''ఓరీ, తలలు నరకటం చేతనైన నీకు, తెగిన తలలు తిరిగి శరీరానికి అంటించి కుట్టటం కూడా చేతనై వుండాలి, అవునా? వెంటనే ఆశ్వికనాయకుడి తలను మొండానికి కుట్టి, గుర్రం మీద కూర్చోబెట్టి, పడకుండా తాళ్ళతో బిగించు,'' అన్నాడు.

తలారి క్షణాల మీద ఆ పని ముగించి, ఆశ్వికనాయకుణ్ణి ఒక గుర్రం మీద పెట్టి, తాళ్ళతో బిగించాడు. కాని, హడావిడిలో వాడు ముఖాన్ని వీపు వైపుకు పెట్టి కుట్టటంతో, గుర్రం మీద పెడతల కళేబరం స్వారీ చేస్తున్నట్టయింది.

ఈ జరిగిన పొరబాటు చూసి భల్లూకమాంత్రికుడితోబాటు, ఒక్క మంత్రి జీవగుప్తుడు తప్ప, అందరూ బిగ్గరగా నవ్వారు. మాంత్రికుడు, జీవగుప్తుడి కేసి కళ్ళెర్రచేసి, ''ఓయీ, మంత్రీ, నువ్విప్పుడు తలారి వాహనమైన ఎనుబోతునూ, నీ వాహనాన్ని తలారీ అధిరోహించబోతున్నారు,'' అన్నాడు.

జీవగుప్తుడు మారు మాట్టాడకుండా వడవడ వణుకుతూ వచ్చి, ఎనుబోతు మీద ఎక్కి కూర్చున్నాడు. అలాగే తలారి పోయి మంత్రి గుర్రం ఎక్కి, కళ్ళెపు తాళ్ళు పట్టుకున్నాడు. అందర్నీ నగరం కేసి బయలుదేరమన్నాడు, భల్లూకమాంత్రికుడు.

జితకేతరాజు మంత్రికి జరిగిన అవమానం చూసి, ఆనందపడుతూ కాళీవర్మ, ''ఈ ఊరేగింపు చూసి నగరప్రజలు తప్పక వినోదిస్తారు! ఇక నా దారిన నేను పోయి, మా గ్రామం చేరతాను,'' అంటూ గుర్రాన్ని అదిలించేంతలో భల్లూకమాంత్రికుడు మంత్రదండం పైకెత్తి, "కాళీవర్మా, నా ఆజ్ఞ వినలేదా?" అన్నాడు.

''ఆజ్ఞా! ఎవరు నన్నిక్కడ ఆజ్ఞాపించగలవాడు?'' అంటూ కాళీవర్మ ఒర నుంచి కత్తి దూశాడు. —(ఇంకావుంది)





# భల్లూకమాంత్రికుడు

## 4

[జలపాతం వెనక నుంచి వచ్చిన భల్లూకమాంత్రికుడు, కాళీవర్మ సాహసాన్ని మెచ్చుకున్నాడు. ఆ సమయంలో అక్కడికి జితకేతరాజు మంత్రి భటులతో వచ్చాడు. మాంత్రికుడు, అతణ్ణి హడలకొట్టి, తలారి ఎనుబోతు మీద ఎక్కించి, అందరినీ నగరానికి బయలుదేరమని ఆజ్ఞాపించాడు. అది సహించని కాళీవర్మ కోపంకొద్దీ మాంత్రికుడిపై కత్తిదూశాడు. తరవాత—]

భల్లూకమాంత్రికుడు ఒక క్షణకాలం కాళీవర్మ మాటలకు నివ్వెరపోయి, అక్కడ వున్నవాళ్ళందరి కేసీ పరీక్షగా చూశాడు. మంత్రి జీవగుప్తుడు తప్ప, మిగతా వాళ్ళందరూ యింకా భయకంపితులయ్యేవున్నారు. జీవగుప్తుడు తానెక్కివున్న ఎనుబోతును అదిలించి కాళీవర్మను సమీపించబోతున్నంతలో, భల్లూకమాంత్రికుడు, అతణ్ణి ఆపి, ''ఓయీ, మంత్రీ! ఇప్పుడు నువు వేయబోతున్న పథకం ఏమిటి? కాళీవర్మను నా మీదికి ఉసికొల్ప జూస్తున్నావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నతో మంత్రి జీవగుప్తుడు వెలవెలపోతూ, ''అయ్యా, భల్లూకమాంత్రికా! మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు. తమలాంటి మహామాంత్రికుల ఆజ్ఞల్ని శిరసావహించటం క్షేమమని, నేనీ యువకుడికి చెప్పబోతున్నాను,'' అన్నాడు.



ఆ జబాబుకు భల్లూకమాంత్రికుడు చిన్నగా నవ్వి, "నువ్వనే యువకుడు కాళీవర్మే త్వరలో మీ అందరికీ ఆజ్ఞ లివ్వబోతున్నాడు, జాగ్రత్త!" అని, యింకా కత్తి దూసి కోపంగా తన కేసి చూస్తున్న కాళీవర్మతో, "కాళీవర్మా, తొందరపడకు! నీవు అంతగా జీవితాను భవంలేనివాడివి. ఇప్పటి స్థితిలో నీ దారిన నువ్వూ, నా దారిన నేనూ వెళ్ళిపోతే, ఆ తరవాత జరగనున్నదేమిటో ఆలోచించావా ?" అన్నాడు.

"దాన్నిగురించి అంతగా ఆలోచించ వలసిందేమీలేదు. నువ్వు తిరిగి జలపాతం వెనకవున్న గుహలోకి పోతావు; నేను మా గ్రామం చేరి హాయిగా వ్యవసాయం చేసుకుంటూ ప్రశాంతంగా జీవితం సాగిస్తాను," అన్నాడు కాళీవర్మ.

"నువ్వెంత గొప్ప ధైర్యశాలివో, అంత అమాయకుడి వన్నమాట!" అని భల్లూక మాంత్రికుడు మంత్రి జీవగుప్తుడితో, "ఓయీ, మంత్రీ! కాళీవర్మ తన గ్రామం చేరింతరవాత, అతణ్ణి పట్టి తెచ్చేందుకు ఎంతమంది సైనికుల్ని పంపాలని రాజుకు సలహా యివ్వబోతున్నావో దాచకుండా చెప్పు? నీ మనసులో మెదిలే ఆలోచనలు నేను గ్రహించగలను, అబద్ధం ఆడావో నిన్నిక్కడే, ఆ కాలిన ఎండు మానులా నిలువునా భస్మం చేయగలను," అంటూ మంత్రదండం పైకెత్తాడు.

జీవగుప్తుడు ప్రాణభయంతో వణికిపోతూ, "నా ఆలోచనలేవో తమరు పసిగట్టారు గనక, నేను దాచి ప్రయోజనం లేదు. జితకేతరాజుగారి ఉప్పు తింటున్న నేను, ఆయన క్షేమం కోరి, యీ కాళీవర్మను హతమార్చాలని సలహా యివ్వక తప్పదు గదా? మంత్రిగా అది నా ధర్మం!" అన్నాడు.

భల్లూకమాంత్రికుడు మంత్రదండాన్ని గట్టిగా నేలకు తాటించి, "విన్నావా, కాళీ? ఇక నీకీ చంద్రశిలా నగర రాజ్యంలో భద్రత లేదు," అన్నాడు.



కాళీవర్మకు ఆ మాటలతో తన విషమ స్థితి అర్థమైపోయింది. అంత గొప్ప సైన్యం గల జితకేతరాజును తాను ఒంటరిగా గాని లేక కొంతమంది అనుచరుల సహాయంతో గాని ఎదిరించి నిలబడటం దుర్లభం. జితకేతుడి సింహాసనాన్ని తాను ఆక్రమించుకోగలగటమో, అది సాధ్యం కాక పోతే దేశం విడిచి పోవటమో తాను చేయవలసి వున్నది....

కాళీవర్మ యిలా ఆలోచిస్తూ, కత్తిని ఒరలో పెట్టి, భల్లూకమాంత్రికుడితో, "గురూ, తమరు చెప్పింది నిజం! నా క్షేమం సంగతి నాకన్న, నన్ను పెంచి పెద్ద చేసిన బలభద్రు డనే నౌకరుకూ, మీకూ ఎక్కువ తెలిసినట్టున్నది. ఇప్పుడేం ఆజ్ఞ!" అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, తన మంత్ర దండంతో కాళీవర్మ భుజాన్ని తాకి, "కాళీ, నీ అదృష్టదేవతే నిన్ను ప్రోత్సహించి, నన్ను గురువుగా సంబోధించమని చెప్పింది, భేష్! నీకు నే నిచ్చేవి ఆజ్ఞలు కాదు, సలహాలు! ఇప్పుడు మనమందరం నగరానికి పోతున్నాం. ఆ జితకేతరాజు దర్పం ఏ పాటిదో చూడాలి. ఓయీ, మంత్రి జీవగుప్తా! నేను ఆ ఎనుబోతు వాహనాన్ని అధిరోహించబోతున్నాను. నువు ముందుండి, దాని ముక్కు తాళు పట్టుకుని నగరం కేసి దారి తియ్యి." అన్నాడు.

మంత్రి జీవగుప్తుడు మారుమాట్లాడకుండా ఎనుబోతు మీదినుంచి దిగి, దాని తాళ్ళు పట్టుకున్నాడు. భల్లూకమాంత్రికుడు ఎనుబోతు మీద కూర్చుని, చుట్టూ వున్న వాళ్ళ కేసి ఓ మారు చూసి, "ఈ ఎనుబోతు చాలాకాలం కిందట, యీ లోకంలో దారి తప్పిన ఒక యమకింకరుడి వాహనం. ఈ మాట నమ్మని వాళ్ళు మీలో ఎవరైనా వున్నారా?" అని అడిగాడు.

ఎవరూ ఆ మాట కాదనలేదు గాని, తలారి మాత్రం ఆశ్చర్యపోతూ ఏదో



గాలిలోకి లేచి, నగరం కేసి కొద్ది దూరం ప్రయాణం చెయ్యి.'' అన్నాడు.

ఆ వెంటనే ఎనుబోతు ముక్కుపుటాల నుంచి బుస్సుమంటూ తుఫాను వేగంతో గాలి వదిలి, తల పైకెత్తి కర్ణకఠోరంగా అరిచి, నేలమీది నుంచి అలవోకగా గాలిలోకి లేచి, నగరం కేసి బయలుదేరింది. ఎనుబోతు అలా పైకి లేచే సమయంలో దాని ముక్కు తాళ్లను జారవిడిచిన మంత్రి జీవగుప్తుడు, పడుతూ లేస్తూ దాని కేసి పరిగెత్తసాగాడు.

భల్లూకమాంత్రికుడు కొంతదూరం పోయి ఎనుబోతును నేలకు దించి, మంత్రి దాని తాళ్ళు పట్టుకోగానే, వెనక వస్తున్న వాళ్ళ కేసి చూసి, ''ఎంతటి మహామంత్రికి, ఎలాంటి దుర్గతి పట్టిందో చూశారా?'' అన్నాడు.

గొణుక్కున్నాడు. వాడు ఆ ఎనుబోతును చిన్నపిల్లగా, ఒక పేద రైతు నుంచి చిల్లిగవ్వ యివ్వకుండా బలవంతాన లాక్కున్నాడు; రాజుగారు ఎప్పుడైనా శిరశ్ఛేద శిక్ష విధిస్తే, తల నరక్కుండా వదులుతానని మాత్రం దాని యజమానికి మాట యిచ్చాడు.

భల్లూకమాంత్రికుడు తన మంత్ర దండాన్ని ఎనుబోతు తలమీద ఒకసారి తాకించి, ''కింకరా! క్షుద్ర మానవుడి చేతబడి, పుట్టుకతో అబ్బిన అపూర్వ శక్తులు పోగొట్టుకున్నానని సంశయిస్తున్నావా? అదేం లేదు. ఏదీ, భూమి మీది నుంచి ఒకటి రెండు గజాల ఎత్తున

అప్పటివరకూ యీ జరిగినదానినంతా మౌనంగా చూస్తూ గుర్రంమీద కూర్చుని వున్న కాళీవర్మ, మాంత్రికుణ్ణి సమీపించి, ''మిమ్మల్ని నేను గురువుగా భావిస్తున్నాను. అట్లని నాకు యిష్టం లేని ఆజ్ఞలన్నిటికీ తల ఒగ్గుతాననుకోకండి. మీరు నిజంగానే ఆ దుష్టుడైన జితకేతరాజును శిక్షించబోతున్నారా?'' అని అడిగాడు.

''గురుశిష్యులన్న తరవాత, గురువు, శిష్యుడికి మేలు చేకూర్చే ఆజ్ఞలే యిస్తాడు.

అది సరే. నీకు జితకేతరాజు సింహాసనం ఆక్రమించాలని వున్నదా?" అని అడిగాడు భల్లూకమాంత్రికుడు, కాళీవర్మ ముఖం కేసి పరీక్షగా చూస్తూ.

"నాకు అలాంటి దురాశ లేదు. నేను కోరేదల్లా ఆ రాజు నిర్దోషుల్ని శిరచ్ఛేదం లాంటి అమానుష శిక్షలకు పాలుచేయ కుండా వుండటం," అన్నాడు కాళీవర్మ.

"ప్రయత్నించి చూస్తాను, కాళీ! కాని, పుట్టుకతోనే సింహాసనానికి వారసులయే జితకేతరాజు లాంటివాళ్ళు, ఒక పట్టాన మారరు. అవునా, మంత్రీ?" అన్నాడు భల్లూకమాంత్రికుడు.

"మహా గొప్పగా సెలవిచ్చారు, మాంత్రికులు!" అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

తరవాత అందరూ నగరం కేసి కొంత దూరం ప్రయాణించాక, ఇద్దరు ఆశ్వికులు వేగంగా వాళ్ళ ముందుకు వచ్చి, దారిని అటకాయిస్తూ, "ఎనుబోతు మీద సన్యాసిని ఎక్కించి, పట్టుదుస్తులూ, చెవికి బంగారు కుండలాలూ ధరించిన మనిషి, ముందుండి దారితీయడమేమిటి? ఆ నల్ల గుడ్డలతో, పిశాచిలాగా వున్న వాడు పంచకళ్యాణి లాంటి గుర్రం ఎక్కి సవారీ చేయటమా? ఎవరు మీరు?" అన్నారు పళ్ళు కొరుకుతూ.



ఆశ్వికులకు కాళీవర్మ జవాబివ్వబోయేంతలో, భల్లూకమాంత్రికుడు పెద్దగా నవ్వి, ఆశ్వికులతో, "మీరు జితకేతరాజు సైనికులు కాదన్నమాట; అందు వల్లే మమ్మల్ని పోల్చుకోలేకపోయారు. మేం ఎవరమో మరిచిపోయి, ఆ సంగతి తెలుసుకునేందుకు ఆ కనబడే నగరం పోతున్నాం," అన్నాడు.

"ఈ వేళాకోళం మాటలు కట్టిపెట్టు. మేం ఎవరమో తెలుసా? ఉదయగిరి రాజైన దుర్ముఖుడి సైనికులం. ఇప్పుడే దిరిసెనవనంలోకి పోయి వస్తున్నాం. అక్కడ కాళీవర్మ అనేవాడు గాని, వాడి శవంగాని కనిపించలేదు. అన్న



మాట తప్పినందుకు జితకేతరాజు మీదికి, మా రాజుగారు దాడి రాబోతున్నారు,'' అన్నారు దుర్ముఖుడి అశ్వికులు.

''అయితే, యీ సంగతులన్నీ మాకు మనవి చేయటమెందుకు? ఇక దారి తొలిగి, మీ దారిన మీరు పొండి," అన్నాడు భల్లూకమాంత్రికుడు కోపంగా.

అంతలో దుర్ముఖుడి అశ్వికుల్లో ఒకడు తలారి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, ''ఇంతకుముందు చూడగానే గుర్తుపట్టలేకపోయాను. నువ్వు దిరిసెన చెట్ల తోపులో వుండే జితకేతరాజు తలారివి కాదా?'' అన్నాడు హేళన చేస్తున్నట్టు వికవికమని నవ్వుతూ.

అప్పటికే తానేదో నలుగురిలో నవ్వుల పాలయానని బాధపడుతున్న తలారి పళ్లు కొరుకుతూ గండ్రగొడ్డలిని పైకెత్తి, ''ఒరే, పొగరుబోతా! నేనెవరైనదీ తెలిసీ అవహేళన చేస్తున్నావా? అదుగో, అగుర్రం మీదవున్న పెడతల శవాన్ని చూశావా? నీకూ ఆ గతి పట్టిస్తాను,'' అన్నాడు.

ఆ జవాబు విని కాళీవర్మ ఉత్సాహం కొద్దీ గుర్రాన్ని తలారి దగ్గిరకు పరిగెత్తించి, కత్తితో అతడి భుజాన్ని తట్టి, ''కుక్క కాటుకు చెప్పుదెబ్బలాంటి జవాబిచ్చావు, తలారీ! పనిలో పనిగా యీ దుర్ముఖుడి అశ్వికుల తలలు నరుకుతావా ఏం!'' అని అడిగాడు.

''అంతా భల్లూకమాంత్రికుల దయ! వారు ఆజ్ఞాపిస్తే, అంతపనీ చేయాలని వున్నది. ఈమధ్య ఒకటి, రెండు వారాలుగా నా గండ్రగొడ్డలి నెత్తురు చూసిన పాపాన పోలేదు,'' అన్నాడు తలారి.

అంతలో దుర్ముఖుడి అశ్వికుల్లో ఒకడు గుర్రాన్ని అదిలించి, పెద్దగా కేకపెడుతూ, "వీళ్ళెవరో నరమాంస భక్షకులు! మనిషిని చంపి, శవాన్ని పెడముఖంగా గుర్రం మీదకట్టి, నగరానికి తీసుకుపోతున్నారు," అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఛీత్కరిస్తూ ఆ ఇద్దరు అశ్వికుల కేసీ ఓమారు చూసి

కాళీవర్మతో, "కాళీ! ఈ చచ్చువెధవల వెకిలివాగుడు మరెంతసేపు భరించేట్టు!" అన్నాడు.

వెంటనే కాళీవర్మ కత్తిదూసి, "ఒరే, దుర్ముఖుడి సేవకుల్లారా, మర్యాదగా మీ దారిని మీరు పోతారా, తలలు నరికించుకుంటారా?" అన్నాడు.

ఆ వెంటనే మంత్రి జీవగుప్తుడి వెంట వచ్చిన అశ్వికులిద్దరూ డాళ్ళు పైకెత్తి, కత్తులు దూసి, దుర్ముఖుడి అశ్వికుల కేసి తమ గుర్రాలను దూకిస్తూ, "ఆ పని మాకు వదలండి. ఈ పొగరుబోతులు చాలా అవమానకరంగా మాట్లాడుతున్నారు," అంటూ వాళ్లమీద పడ్డారు.

దుర్ముఖుడి అశ్వికులు కూడా కత్తులు దూసి ఆత్మరక్షణ చేసుకుంటూ, తమ గుర్రాలను అదిలించి పారిపోతూ, "దుర్ముఖ మహారాజుగారు, యీ దాపుల నున్న మామిడితోటలోనే గుడారాలు వేసుకుని వున్నారు. క్షణాల మీద ఆయన వచ్చి, మీ అందర్నీ చిత్రవధ చేయించ గలడు," అంటూ కేకలు పెట్టారు.

జీవగుప్తుడి అశ్వికులిద్దరూ, శత్రు అశ్వికుల్ని చాలా దూరం తరుముకుంటూ పోయి, వాళ్ళు ఎంతకూ తమ కత్తి దెబ్బలకు అందకపోవటంతో, తిరిగి వచ్చారు.



అంతలో జీవగుప్తుడి భటులలో ఒకడు, పక్కకు చూస్తూ, "అయ్యా, యీ సారి పదిమంది శత్రుఅశ్వికులు మన మీది కొస్తున్నారు!" అంటూ అరిచాడు.

వాడు అన్నట్టు నిజంగానే పదిమంది దుర్ముఖుడి అశ్వికులు వాళ్ళను సమీపించారు. కాని, వాళ్ళు కత్తులు దూసి కలియబడక, కొంచెం దూరంలోనే ఆగారు. వాళ్ళలో ఒకడు దుస్తుల్లోనుంచి ఒక పొడవాటి పత్రాన్ని తీసి పెద్ద గొంతుతో యిలా చదివాడు; "ఇక్కడ వున్న వాళ్ళందరూ, మామిడితోటలో విడిది చేసివున్న దుర్ముఖ మహారాజుగారి సముఖానికి రావాలి. ఇది రాజాజ్ఞ!"

అది వింటూనే అందరూ విస్తుపోయి చూసేంతలో భల్లూకమాంత్రికుడు తను ఎక్కి వున్న ఎనుబోతును దుర్ముఖుడి ఆశ్వికుల కేసి తిప్పమని మంత్రి జీవగుప్తుణ్ణి ఆజ్ఞాపించి, దుర్ముఖుడి ఆశ్వికులతో, ''దుర్ముఖుడంతటివాడు ఆజ్ఞాపిస్తే, యిక చేయగలిగిందేమిటి? అతడున్న మామిడితోటకు దారితీయండి," అన్నాడు.

''గురూ, ఏమిటిది ?'' అన్నాడు కాళీవర్మ ఆశ్చర్యపోతూ.

''స్వయంగా నువే చూద్దువు గాని,'' అన్నాడు భల్లూకమాంత్రికుడు.

దుర్ముఖుడి అశ్వికులు వాళ్ళను సరాసరి వాళ్ళ రాజున్న మామిడితోటకు తీసుకుపోయారు. రాజు దుర్ముఖుడు ఒక ఎత్తయిన ఆసనం మీద కూర్చుని వున్నాడు. దానికి అటూ యిటూ యిద్దరు ఖడ్గధారులూ, కొంచెం ఎడంగా మంత్రులూ, సలహాదారులూ తలలు వంచుకుని నిలబడివున్నారు.

భల్లూకమాంత్రికుణ్ణీ, అతడి వెంట వున్న వాళ్ళనూ చూస్తూనే దుర్ముఖుడు కళ్ళెర్రచేసి, ''ఒరే, దుష్టులారా! తలారితో ప్రారంభించి మీ అందరి తలలూ నరికించబోతున్నాను. ఆఖరి వంతు కాళీవర్మ అనేవాడిది,'' అన్నాడు.

దుర్ముఖుడు యిలా అనగానే భల్లూకమాంత్రికుడు, ''అది భల్లూకా!'' అంటూ ఒక కేకపెట్టి, ఎనుబోతు మీది నుంచి దిగి, ప్రాణభయంతో గడగడ వణుకుతున్న తలారితో, ''ఒరే, తలారీ! నీ తల దుర్ముఖుడు నరుకుతాడో, లేక వాడి తల నువ్వు నరుకుతావో, యీ క్షణంలోనే తేలిపోతుంది.'' అంటూ మంత్రదండం చివరనున్న భల్లూక తలాటంతో, వాడి వెన్నును తాకాడు.

ఆ మరుక్షణం తలారి నల్లని భల్లూకాకారంతో గండ్రగొడ్డలిని గిర్రున తిప్పుతూ, గుర్రం మీది నుంచి కుప్పించి దూకి, భీకరంగా అరుస్తూ, రాజు దుర్ముఖుడి కేసి పరిగెత్తాడు. —(ఇంకావుంది)





# భల్లూకమాంత్రికుడు

## 5

[రాజు జితకేతుణ్ణి శిక్షించేందుకు భల్లూకమాంత్రికుడు, కాళీవర్మనూ, ఇతరులనూ వెంట బెట్టుకుని, నగరం కేసి పోతున్నంతలో, రాజు దుర్ముఖుడి సైనికులు అతడి దారిని అడ్డగించారు. మాంత్రికుడు, దుర్ముఖుడి దగ్గిరకు పోయి, తలారిని మంత్రదండంతో తాకగానే, వాడు భల్లూకాకారంతో గండ్రగొడ్డలిని తిప్పుతూ, దుర్ముఖుడి కేసి దూకాడు. తరవాత—]

తలారి హఠాత్తుగా భయంకరమైన భల్లూకంగా మారి, తళతళ మెరుస్తున్న గండ్రగొడ్డలితో తన పైకి రావటం చూస్తూనే, రాజు దుర్ముఖుడు ఒక క్షణకాలం నిశ్చేష్టుడైపోయాడు. అంతలో తలారి తనకు అడ్డుగా వున్న రాజు అంగరక్షకులిద్దరిని కాలితో గట్టిగా తన్ని, వాళ్ళు కింద పడగానే, దుర్ముఖుడు కూర్చుని వున్న ఉన్నతాసనం కేసి వెళ్ళాడు.

దుర్ముఖుడు ఆ సరికి తెప్పరిల్లి, "ఒరే, సైనికులెక్కడ? అంగరక్షకులేమయ్యారు? ఈ ఎలుగుబంటును అడ్డగించి, కత్తులతో నరకండి!'' అని అరుస్తూ, ఆసనం మీది నుంచి లేచి, కొద్ది దూరం పరిగెత్తి, తన గుర్రం మీద ఎగిరి కూర్చున్నాడు. అతడితోపాటు మరొక అంగరక్షకుడు కూడా పరిగెత్తిపోయి, మరొక గుర్రాన్ని ఎక్కాడు.



విదిలించి వేస్తూ, వేగంగా పరుగు పుచ్చుకున్నది.

రాజు దుర్ముఖుడూ, అతడి అంగరక్షకుడూ గుర్రాల మీద పారిపోవటం చూస్తూనే, కాళీవర్మ నిరుత్సాహపడిపోయి, భల్లూకమాంత్రికుడితో, "గురూ, ఈ చుట్టుపక్కల రాజ్యపాలకులుగా చెలామణీ అవుతున్న ఇద్దరు దుర్మార్గుల్లో ఒకడు దొరికి తప్పించుకుపోతున్నాడు. వాణ్ణి మన తలారి భల్లూకం వెంబడించి పట్టుకోగలదన్న నమ్మకం నాకు లేదు," అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, దుర్ముఖుడి గుర్రం వెనకగా పరిగెత్తుతున్న తలారి భల్లూకం కేసి ఓ మారు చూసి, తృప్తిగా తలాడించి, "కాళీ, ఆ రాజు మన తలారి గండ్రగొడ్డలికి చిక్కకపోతే, అప్పుడు వాడి అంతేదో నువ్వూ, నేనూ చూద్దాం." అని, అక్కడ ప్రాణభయంతో వణికిపోతున్న దుర్ముఖుడి మంత్రులూ, సలహాదార్ల కేసి కళ్ళెర్రచేస్తూ చూసి, "ఒరే, మీరు చంద్రశిలా నగరం మీదికి దాడి బయలుదేరారు గదా? మీ సైన్యం ఎక్కడ?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సలహాదార్లలో ఒకడు బొంగురుపోయిన గొంతుతో, "మహామాంత్రికులైన మీకు, ఆ సైన్యం ఎక్కడ

"మహారాజా, మనం ప్రస్తుతానికి యిక్కడి నుంచి పారిపోవటం క్షేమం. మన సైనికులు ఎక్కడో నదీ తీరాన గుడారాల్లో వున్నారు. వాళ్ళకు వార్త అంది వచ్చేలోపల, యీ మాంత్రికుడు తన ఎలుగుబంటితో, మనలనందర్నీ నిలువునా నరికించి పోగులు పెట్టగలడు," అన్నాడు అంగరక్షకుడు.

అంగరక్షకుడు యిలా చెపుతున్నంతలోనే రాజు దుర్ముఖుడు, వెనక నుంచి పరిగెత్తుకు వస్తున్న తలారి భల్లూకాన్ని చూసి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు. గుర్రం కూడా భల్లూకాన్ని చూసి బెదిరిపోయి, పెద్దగా సకిలించి, కళ్ళెపు తాళ్లను

వున్నదీ తెలిసే వుండాలి. అయినా అడుగు తున్నారు గనక చెపుతున్నాను: వాళ్లందరూ నది ఒడ్డున గుడారాల్లో వుండి, రానున్న పోరాటంలో శత్రు సంహారం కోసం అయుధాలకు పదును పెడుతున్నారు,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఆ మాటలను పెద్దగా నవ్వి, దాపులనే వుండి ఆశ్చర్య పోతూ చూస్తున్న మంత్రి జీవగుప్తుడితో, ''ఓయీ, చంద్రశిలానగర మంత్రీ, విన్నావా దుర్ముఖుడి సలహాదారు చెప్పిన మాటలు?'' అన్నాడు.

''అయ్యా, అంతా విన్నాను. ఇదంతా చూస్తూంటే నాకు మతిపోతున్నట్టున్నది,'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

''అవునా! నేనూ, కాళీవర్మా యీ ప్రాంతాలు వదిలి, హిమాలయ పర్వత శిఖరాల మీదుగా, ఆవలి లోయలకు చేరేలోపల, మరికొందరి అహం వదిలించి, మతులు పూర్తిగా పోగొట్టదలిచాను, ఏమంటావు?'' అన్నాడు భల్లూక మాంత్రికుడు మంత్రదండాన్ని నేలకు గట్టిగా తాటిస్తూ.

''అంతా తమ దయ,'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు తలవంచుతూ. భల్లూకమాంత్రికుడు తిరిగి ఏదో చెప్ప బోయేంతలో కాళీవర్మ మామిడిచెట్ల



లోంచి దూరంగా చూస్తూ, ''గురూ, చాలామంది సైనికులు కత్తులూ, ఈటెలూ ఎత్తిపట్టుకుని మనకేసే వస్తున్నారు!'' అంటూ ఒరలోనుంచి కత్తి దూస్తూ, తమ వెంట వున్న రాజు జితకేతుడి సైనికులను హెచ్చరించాడు.

భల్లూకమాంత్రికుడు యింకా భయ కంపితులై వున్న రాజు దుర్ముఖుడి సలహా దార్లతో, ''ఒరే, మీలో ఒకడు ముందుగా పోయి, యిక్కడ మీ రాజుకు పట్టిన దుస్థితి ఏమిటో, అ సైనికులను వెంట బెట్టుకు వస్తున్న దళనాయకుడితో చెప్పండి. వాడు మూర్ఖం కొద్దీ నా మీదా, నా అనుచరుల మీదా దాడి చేయ



యత్నించాడో, మిమ్మల్ని పులులుగానూ, వాళ్ళను లేళ్ళగానూ మార్చి, మీకు, వాళ్ళను ఆహారం చేయబోతున్నాను,'' అన్నాడు.

''మహా మాంత్రికులు అందుకు సమర్థులే! మీ కళ్ళ ఎదుటే తలారిని భయంకరమైన ఎలుగుబంటుగా మార్చటం, చూశారు గదా?'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు, సలహాదార్లతో.

రాజు దుర్ముఖుడి మంత్రులూ, సలహాదార్లూ ఒకసారి ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళల్లో ఒకడు అక్కడినుంచి బయలుదేరి, తమను సమీపిస్తున్న సైనికుల నాయకుణ్ణి కలుసుకుని, అతడికి జరిగినదంతా చెప్పి, ''మన రాజుగారు ప్రాణాలతో తిరిగి మనకు కనబడేవరకూ, మనం యీ భయంకరుడైన మంత్రవేత్త చెప్పినట్టు వినటం క్షేమమవుతుంది,'' అన్నాడు.

ఆ మాటలకు దళనాయకుడు కోపం తెచ్చుకుని, తన వెనక వున్న యాభైమంది సైనికులతో, ''ఈయన చెప్పింది విన్నారు కదా? నన్నడిగితే, ఇదంతా కేవలం కనుకట్టు అంటాను. ఇంతమంది సాయుధులం ఒక్కుమ్మడిగా పోయి మీద పడి, ఆ మాంత్రికుణ్ణీ, అతడి అనుచరులనూ హతమార్చలేమా?'' అన్నాడు.

''కాని, ఆ లోపల మాంత్రికుడు మనల్ని లేళ్ళగానూ, పులులుగానూ తన కనుకట్టు విద్యతో మార్చటం జరిగితే, అప్పుడు మనకు ఎలాంటి దుర్గతి పట్టనున్నదో ఆలోచించాలి గదా?'' అంటూ గుంపులోంచి ఒక సైనికుడు తన తోటి వాళ్ళకేసి చూశాడు.

''అయ్యా, దళనాయకా! మనం దుర్ముఖరాజుగారి ఉప్పు తింటున్నవాళ్లం గనక, అవసరం పడ్డప్పుడు ఆయనకోసం ప్రాణాలు ఒడ్డవలసిందే! కాని, యిప్పుడు విన్నదాన్నిబట్టి, రాజుగారు యింకా సజీవులే అన్న నమ్మకం ఏమిటి? ఆ భయంకర భల్లూకం గండ్రగొడ్డలితో

ఆయన తల యీసరికే నరికివుంటే, మన సాహసం, రాజభక్తి అంతా వృథా గదా!'' అన్నాడు, యింకొక సైనికుడు గుంపులో నుంచి ముందుకువచ్చి.

ఇది విన్న తరవాత దళనాయకుడి మనసులో, చిన్న దురాశలాటిది రేగింది. అతడు చుట్టూ ఓ మారు కలయచూసి, ''రాజు చావటం అంటూ జరిగితే, సింహాసనం కోసం తను ఎందుకు ప్రయత్నించకూడదు?'' అనుకుని, సైనికులతో, ''మనం ప్రస్తుతానికి చంద్రశిలా నగరం మీద దాడిమాని, మిగిలిన సైనికులతో కలిసి, ఉదయగిరి నగరానికి తిరిగి పోవటం మంచిది!'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, పక్కనే వున్న కాళీవర్మకు కనుసైగ చేసి, ''కాళీ, యీ దుర్ముఖరాజు సైనికులకు నిన్ను నాయకుడుగా నియమిస్తున్నాను. యీ దళనాయకుడు, తన కత్తిని నీ పరం చేస్తాడో లేదో అడిగిచూడు!'' అన్నాడు.

కాళీవర్మ, దళనాయకుణ్ణి సమీపించి, ''మా గురువుగారు చెప్పింది విన్నావు కదా? ఏదీ, నీ కత్తిని నా చేతికిస్తావో లేక నేలపై జారవిడుస్తావో, వెంటనే తేల్చి చెప్పు,'' అన్నాడు.

దళనాయకుడు, కాళీవర్మ కేసీ, భల్లూకమాంత్రికుడి కేసీ ఓ మారు చూసి,



కత్తిపట్టిన చేయి వణుకుతూండగా, ''కత్తిని తమ స్వాధీనం చేయటం అంటే, నేను దుర్ముఖమహారాజుగారికి ద్రోహం చేసినట్టే గదా? రాజద్రోహం చెయ్యమని, తమ వంటివారు అడగవచ్చునా?'' అన్నాడు.

''ఇది తెలివైన ప్రశ్నేకాని మీ రాజు ఒక ఎలుగుబంటుకు భయపడి, యిక్కడ మీ అందర్నీ మీ కర్మకు వదిలి పారిపోవటం, ఏవిధమైన రాజలక్షణం అవుతుంది?'' అంటూ భల్లూకమాంత్రికుడు, దళనాయకుడి పక్కన వున్న సైనికుణ్ణి చేయి పట్టుకుని వెనక్కు తిప్పి, వాడి వెన్ను మీద మంత్రదండాన్ని ఆనించి, ''ఇదుగో, ఇక్కడ నేను అంజనం



వేస్తున్నాను. దుర్ముఖుడు ఎలాంటి దురవస్థలో వున్నాడో నువ్వూ, నీ తోటి సైనికులూ చూడండి!'' అన్నాడు.

ఆ మరుక్షణం సైనికుడి వెన్ను మీది వస్త్రభాగమంతా నల్లని నీలినీడలు ముసిరినట్టు అయిపోయి, వెంటనే తళతళమంటూ మెరిసింది. అందులో మహారణ్యం చెట్లలో గుర్రాలను వేగంగా దౌడుతీయిస్తూ రాజు దుర్ముఖుడూ, అతడి అంగరక్షకుడూ కనిపించారు. వాళ్ళను వెంబడిస్తూ తలారి భల్లూకం పరిగెత్తుతున్నది. ముందు పోతున్న దుర్ముఖుడి గుర్రాన్ని, ఒక చెట్టుచాటు నుంచి బయిటికి వచ్చిన ఏనుగు ఒకటి తొండంతో కొట్టబోయింది. దుర్ముఖుడు ఒక చావు కేకపెట్టి, దెబ్బ తప్పించుకుని, తన అంగరక్షకుడితో పాటు పక్కకు పారిపోయాడు.

ఇప్పుడు దుర్ముఖుడి వెంటబడివస్తున్న తలారి ఎలుగుబంటు హఠాత్తుగా ఎదురవటంతో ఏనుగు దాన్ని తొండంతో పట్టి పైకెత్తబోయింది. తలారి భీకరంగా ఒక కేకపెట్టి, గండ్రగొడ్డలితో ఏనుగు తొండం మీద గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు తొండం సగం తెగి వేళ్ళాడుతూండగా ఏనుగు ఘీంకరిస్తూ వెనక్కు తిరగబోయేంతలో, తలారి ఎలుగుబంటు దాని మెడ మీద ఎక్కి కూర్చుని, కుంభస్థలం పైన గండ్ర గొడ్డలి పిడితో గట్టిగా పొడుస్తూ, ''ఊఁ, ఆ దుష్టుడు, దుర్ముఖుడెక్కడ? వాణ్ణి తరిమిపట్టుకుని తల నరకాలి!'' అంటూ అరిచింది.

రాజు దుర్ముఖుడు యీలోపల అరణ్యంలో చాలా దూరం వెళ్ళిపోయాడు. అతడికి తలారి భల్లూకంతోపాటు, ఏనుగు కూడా వెంటబడి వస్తున్నదన్న భయం పట్టుకున్నది. అంగరక్షకుడు అతణ్ణి హెచ్చరిస్తూ, ''మహారాజా, మనం దారీ తెన్నూ కానకుండా, మన రాజ్య సరిహద్దులు కూడా దాటి పోతున్నట్టున్నది,'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు కోపంగా, ''ఒరే, మందమతీ! ప్రాణాల కన్న రాజ్య సరిహద్దులు విలువైనవా?'' అంటూ గుర్రాన్ని చర్నాకోలతో గట్టిగా కొట్టాడు.

భల్లూకమాంత్రికుడు, సైనికుడి వెన్ను మీద యీ సారి మంత్రదండంతో గట్టిగా పొడిచి, వాడు బాధతో ఎగిరి గంతు వేయగానే, ''నే వేసిన అంజనం కాస్తా, వీడుపాడు చేశాడు! సరే, మీ రాజు దుర్ముఖుడి పలాయనం చూశారు గదా?'' అని దళనాయకుణ్ణీ, సైనికుల్నీ అడిగాడు.

భల్లూకమాంత్రికుడి శక్తి ఎలాంటిదో చూసిన దుర్ముఖుడి సైనికులు ఏకకంఠంగా, ''ఏం చేయాలో, మీరే సెలవివ్వండి!'' అంటూ కేక పెట్టారు.

''అలా అయితే, నా వెంట చంద్రశిలా నగరానికి రండి. ఆ రాజు జితకేతుడి సంగతేమిటో చూడాలి. ఈ క్షణం నుంచీ మీ నాయకుడు కాళీవర్మ, విన్నారా?'' అన్నాడు భల్లూకమాంత్రికుడు.

అందరూ కదిలి చంద్రశిలా నగరం కేసి బయలుదేరారు. అదే సమయంలో అరణ్యంలో పారిపోతున్న రాజు దుర్ముఖుణ్ణీ, అతడి అంగరక్షకుణ్ణీ, చెట్లకొమ్మల్లో దాగివున్న నాగమల్లు అనే దొంగల నాయకుడు చూశాడు. వాడు పక్కనే వున్న యిద్దరు అనుచరులతో, ''ఒరే, ముందు గుర్రం మీద వస్తున్నవాడి దుస్తులు చూస్తూంటే, ఎవడో మంచి సంపన్నుడిలా వున్నాడు. వెనక వున్న



వాడు, అతడి నౌకరో, సైనికుడో అయి వుండాలి. ఇద్దర్నీ ప్రాణాలతో పట్టుకుంటే, తరవాత వాళ్ళ బంధువుల్నుంచి కూడా, వీళ్ళ విడుదల కోసం డబ్బు గుంజవచ్చు,'' అన్నాడు.

నాగమల్లు అనుచరులిద్దరిలో ఒకడు, తనచేతిలో చుట్టగావున్న బలమైన తాడును అటూ ఇటూ ఊపుతూ, ''దొరా, వీళ్లను ఎదటపడి ప్రాణాలతో పట్టటం కుదిరేది కాదు; వాళ్ళు కత్తులు దూసి ఎదిరించ గలరు. ముందుగా ఒకణ్ణి, యీ తాడు విసిరి, ఉచ్చులో బంధించటం ఎలా వుంటుంది?'' అన్నాడు.

''ఓс, భలే ఉపాయం! అదుగో, వస్తున్నారు! అందుబాటులోకి రాగానే, ముందు గుర్రం మీద వున్న వాడి నడుముకు ఉచ్చు తగిలించి, పైకి లాగు. ఆ రెండోవాడి సంగతి మేం యిద్దరం చూస్తాం,'' అన్నాడు నాగమల్లు.

రాజు దుర్ముఖుడుగాని, అతడి అంగ రక్షకుడుగాని, యింత మహారణ్యంలో తమకు భల్లూకమాంత్రికుడి ఎలుగుబంటు నుంచే కాక, మరి యితరత్రా ప్రాణాపద రావచ్చన్న ఆలోచనలోనే లేరు. వాళ్ళు తలారి భల్లూకం నుంచి సాధ్యమైనంత దూరం పారిపోవాలనే ఆదుర్దాలో వున్నారు.

దుర్ముఖుడి గుర్రం చెట్టును సమీపించి, దాని కొమ్మల కిందుగా పరిగెత్తే సమయంలో నాగమల్లు అనుచరుడు చేతిలోని తాడు ఉచ్చును గురిగా, అతడి మీదికి విసిరి, తాడు రాజు నడుమును బిగించ గానే కొమ్మల మీదికి గుంజాడు. రౌతు లేని గుర్రం వేగంగా ముందుకు పరిగెత్తి పోయింది.

దుర్ముఖుడు ఏమిజరిగిందీ అర్థంకాక ఒక చావుకేక పెట్టి, తాడు నుంచి వేళ్లాడ సాగాడు. నాగమల్లూ, అతడి రెండవ అనుచరుడైన దొంగా, భీకరంగా ఒక కేకపెట్టి, కత్తులు ఝుళిపిస్తూ, కొమ్మల్లోంచి అంగరక్షకుడి గుర్రం ముందుకు దూకారు. —(ఇంకావుంది)





# భల్లూక మాంత్రికుడు

## 6

[చంద్రశిలానగరం మీద దాడికి బయలుదేరిన రాజు దుర్ముఖుడి పైకి, భల్లూక మాంత్రికుడు, తలారి భల్లూకాన్ని ఉసికొల్పాడు. అది చూసి దుర్ముఖుడు ఒక అంగరక్షకుడితో పాటు గుర్రం మీద, అరణ్యానికి అడ్డంపడి పారిపోతూండగా, నాగమల్లు అనే దొంగలనాయకుడు అతణ్ణి కాడుఉచ్చుతో బిగించి, కొమ్మల పైకి లాగాడు. తరవాత—]

ఇద్దరు దొంగలు భీకరంగా అరుస్తూ, చెట్ల కొమ్మల్లోంచి, తన గుర్రం ముందుకు దూకగానే, రాజు దుర్ముఖుడి అంగరక్షకుడు, గుర్రం కళ్ళెపుతాళ్ళను గట్టిగా లాగుతూ, "అయ్యలారా, నా నడుం నుంచి కత్తి వేళ్ళాడుతున్నా. నేను నిరాయుధుడికిందనే లెక్క! నా నుంచి మీ కేలాంటి హానీ కలగదు." అన్నాడు భయంతో వణికిపోతూ.

దొంగల నాయకుడు నాగమల్లు, ఎడంచేత్తో గుర్రం కళ్ళాలు వడిసి పట్టుకుని, కుడిచేతిలో వున్న కత్తిని అంగరక్షకుడి కంఠం కేసి చాచి, "ఒరే, నువ్వు నిజంగా కత్తియూసినా, మేం భయపడేవాళ్ళం కాదు. అదుగో, నీ ముందుపోయిన గుర్రం వాడు, చెట్టుకొమ్మ నుంచి వేళ్లాడుతున్నాడు. మీవాళ్ళు మరికొందరు యిటు కేసి వస్తున్నారా?" అని అడిగాడు.



తమ అనుచరులు మరి కొందరు వస్తున్నారంటే, ప్రమాదం తప్పుతుందో, లేక యిటు వచ్చిన వాళ్ళం, తామిద్దరమే అంటే ప్రమాదం తప్పుతుందో అని ఆలోచిస్తూ, అంగరక్షకుడు జవాబిచ్చేందుకు తటపటాయిస్తున్నంతలో, రాజు దుర్ముఖుడు కొమ్మ నుంచి తాడుకు వేళ్ళాడుతూనే, "ఈ అవమానాన్ని నేను సహించను: ఎక్కడరా, అంగరక్షకా!" అంటూ కేకపెట్టాడు.

అంగరక్షకుడు జవాబివ్వబోయేంతలో నాగమల్లు కత్తి ఝుళిపించి బెదిరిస్తూ, "నువు అంగరక్షకుడివా? ఏ రకంవాడికి, అంగరక్షకుడివి? ముందు గుర్రం దిగు," అని. అంగరక్షకుడు గుర్రం దిగగానే, రాజు దుర్ముఖుణ్ణి కొమ్మల్లోకి లాగేందుకు నానా అవస్థాపడుతున్న దొంగతో, "ఒరే, మనకు బాగా డబ్బున్న జీవాలే దొరికినట్టున్నవి. ఆ పట్టుఉడుపులు కట్టిన వాణ్ణి, నడుం విరక్కుండా జాగ్రత్తగా నేలమీదికి జార్చు." అన్నాడు.

కొమ్మల్లోని దొంగ, దుర్ముఖుణ్ణి మెల్లిగా నేలకు దింపాడు. ఆ వెంటనే దుర్ముఖుడు తన నడుముకు బిగిసి వున్న తాడును విప్పబోయేంతలో, నాగమల్లు పక్కన నిలబడి అంతా చూస్తున్న మరొక దొంగ, దుర్ముఖుణ్ణి సమీపించి, "ఆ నడుముకు బిగుసుకున్న తాడును, గొంతుకు బిగించుకోవాలనుకుంటున్నావా? తొందరపడకు. నువ్వెవరో నిజం చెప్పకపోతే, ఆ పని మేమే చేస్తాం," అన్నాడు.

అంతలో అక్కడికి చెట్టుమీద వున్న దొంగా, నాగమల్లూ వచ్చారు. నాగమల్లు, రాజు దుర్ముఖుణ్ణి నఖశిఖ పర్యంతం ఒకసారి పరీక్షగా చూసి, "నీ విలువైన దుస్తులూ, నగిషీలు చెక్కిన కత్తీ ఒరా చూస్తూంటే, బాగా డబ్బున్న వాడివిలాగే కనిపిస్తున్నావు. ముందు నీ దగ్గిర వున్న డబ్బు అక్కడ పెట్టి, తరవాత నువ్వనే, యీ అంగరక్షకుణ్ణి ఇంటికి పంపి, పది వేల వరహాలు తెప్పించు. అలా చేయక

పోయావో నీ ప్రాణాలు దక్కవు. నీ శవం ఆ కనపడే కొండ గుహల్లోవుండే ఏ పులికో, తోడేలుకో ఆహారం అయిపోతుంది.'' అన్నాడు.

ఆ మాటలతో రాజు దుర్ముఖుడు తాను పెద్ద చిక్కుల్లో పడిపోయానని గ్రహించాడు. తాను ఫలానా దేశానికి రాజునని చెపితే, యీ దొంగల నాయకుడు తన తలను అక్కడికక్కడే నరికి, మరింత పెద్ద బహుమతి సంపాయించేందుకు, తన శత్రువైన చంద్రశిలా నగరపు రాజు జితకేతుడి దగ్గరకు తీసుకుపోవచ్చు. అలా కాక తాను ఏ సంపన్న వర్తకుణ్ణో అని అబద్ధం ఆడితే, అప్పుడు తన అంగరక్షకుడి చేత పదివేల వరహాలు తెప్పించవలసి వుంటుంది. ఈ లోపల తాను అబద్ధమాడిన సంగతి బయటపడితే....

రాజు దుర్ముఖుడు తన ప్రశ్నకు జవాబివ్వకుండా, మూగిలా యిలా ఆలోచిస్తున్నంతలో దొంగల నాయకుడు నాగమల్లు కసిగా పళ్లు కొరికి, ''ఏమిటాలోచిస్తున్నావు? ఎలాంటి జిత్తులు వేసి, నా నుంచి పారిపోవాలా అని పథకం అల్లుతున్నావా?'' అంటూ కత్తి పైకెత్తాడు.

ఆ వెంటనే దుర్ముఖుడు, ''నువ్వనే ఆ పదివేల వరహాలు ఎలా తెప్పించటమా అని ఆలోచిస్తున్నాను. నా పేరు దుర్జయ



శెట్టి. ఉదయగిరి పట్టణం వాణ్ణి. ఇప్పుడు నా దగ్గిర చిల్లిగవ్వ లేదు.'' అన్నాడు.

ఆ జవాబుకు నాగమల్లు ఆశ్చర్యపోతూ, ''ఇంత విలువైన దుస్తులు ధరించి, అంగరక్షకుణ్ణి కూడా తోడు పెట్టుకుని, అరణ్యంలో చిల్లిగవ్వ చేత లేకుండా ప్రయాణం చేస్తున్నావన్న మాట! ఈ మాటలు నమ్మమనేనా నువ్వనేది?'' అని, పక్కనవున్న దొంగలతో, ''ఒరే, వీడి నడుముకున్న తాడు విప్పి, గొంతుకు బిగించండి. ఉరితీసేందుకు గట్టి చెట్టు కొమ్మ చూస్తాను.'' అన్నాడు.

నాగమల్లు మాట ముగించే లోపలే, ఎక్కడో దూరాన్నుంచి ఏనుగు ఘీంకరించిన



ధ్వనితోపాటు, తలారి ఎలుగుబంటు పెట్టిన గావు కేక కూడా వాళ్లకు వినిపించింది. ఆ మరుక్షణం రాజు దుర్ముఖుడూ, అంగరక్షకుడూ నిలువెల్లా వణికిపోసాగారు. అంగరక్షకుడు చుట్టూ కలయ చూస్తూ, ''మహారాజా, ఆ తలారి భల్లూకం అరణ్యంలో ఎక్కడో దారి తప్పిందనుకున్నాను. కాని, అది మన జాడలు పసికట్టి, యిటే వస్తున్నట్టున్నది.'' అన్నాడు.

దొంగల నాయకుడు నాగమల్లు నోరు తెరిచి, గుడ్లు తేలవేసి తన అనుచరులిద్దరికేసి అయోమయంగా ఒకసారి చూసి, ''వీళ్ళ మాటలు విన్నారా? వీడు తన పేరు దుర్జయశెట్టి అంటున్నాడు; వాడు మహారాజా, అని పిలుస్తున్నాడు. అన్నిటికన్నా వింత, తలారి భల్లూకం....అది అరణ్యంలో దారి తప్పటం!'' అంటూ కత్తిని పైకెత్తి, ''ఒరే, మీ యిద్దరూ నిజంగా మతిమాలిన వెధవలా లేక మాకు, మీ పిచ్చి వాగుడుతో మతులు పోగొట్టాలని చూస్తున్నారా?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు బెంబేలు పడిపోతూ, ఏం జవాబివ్వటమా అని తికమకపడుతున్నంతలో, యీసారి మరి కాస్త దాపులగా ఏనుగు ఘీంకారం, తలారి ఎలుగుబంటు కేకలూ వినిపించినై. దానితో నాగమల్లు కూడా కొంచెంగా బెదిరిపోయి, ఒక దొంగతో, ''ఒరే, నువు చెట్టెక్కి చూడు! ఒకేసారి ఏనుగు ఘీంకారం, ఎలుగుబంటు గొంతులాంటి మనిషి కేకలూ వినబడటం ఏమిటి? వీళ్ళ మాటల్లో ఏమన్నా నిజం వున్నదేమో!'' అన్నాడు.

దొంగల్లో ఒకడు గబగబా పక్కనే వున్న ఒక చెట్టెక్కి, ఆ మరుక్షణం ఒక చావు కేకపెట్టి, ''మల్లూ! ఆ దుర్జయశెట్టి, వాడి నౌకరూ చెప్పింది నిజం! తెగి వేళ్లాడుతున్న తొండంతో ఏనుగూ, దాని మీద గండ్రగొడ్డలి పట్టుకున్న ఎలుగుబంటూ—అరెరె, దాని గండ్రగొడ్డలి దెబ్బకు, అడ్డం వచ్చిన చెట్లకొమ్మలు

పూచిక పుల్లల్లా విరిగి, చెల్లా చెదురుగా లేచి పోతున్నవి,'' అన్నాడు.

నాగమల్లు భయాశ్చర్యాలతో దిక్కులు చూస్తూ, యిప్పుడేం చేయటమా అని ఆలోచిస్తున్నంతలో, రాజు దుర్ముఖుడు అతడి చేయి పట్టుకుని, ''మల్లా! మనం త్వరగా యిక్కణ్ణించి పారిపోవటం క్షేమం. ఉట్టినే గొర్రె ప్రాణాలు బలి పెట్టకు. కావాలంటే, నా ఇంటనున్న డబ్బుతో ఒక రాజ్యమే కొనిపెట్టగలను,'' అన్నాడు వణికిపోతూ.

అంగరక్షకుడు గుర్రం ఎక్కి పారిపోవటానికి ఎత్తువేసి, దాని కళ్ళెపు తాళ్ళు పట్టుకుని, నాగమల్లుతో, ''మల్లూ! ఈ క్షణాన నువ్వు, మహారాజుగారి ప్రాణాలు కాపాడావంటే, ఆయన నీకు అర్ధరాజ్యం ధారాదత్తం చేయగలడు! నేను గుర్రం ఎక్కి, వాయువేగంతో రాజధానికి పోయి, సైన్యాన్ని వెంటబెట్టుకు రావటం ఎలా వుంటుంది, మహారాజా?'' అన్నాడు.

''ఆ పని నేనే చేయగలను; కాని రాజధానికి వెళ్ళే మార్గమేదో, యీ మహారణ్యంలో తెలియటం లేదు.'' అంటూ రాజు దుర్ముఖుడు, తానూ గుర్రపు కళ్ళెపు తాళ్ళను వడిసిపట్టుకున్నాడు.

నాగమల్లు తన అనుచరులిద్దరికీ సైగ చేసి, దుర్ముఖ, అంగరక్షకుల కేసి కళ్ళెర్ర



చేసి చూస్తూ, ''ఒరే, మీ యిద్దరూ నిజంగా బుద్ధిహీనులా లేక అతితెలివి మోసగాళ్ళా? అవతల మీరనే తలారి భల్లూకం వచ్చిపడుతూండే, మీరెక్కడో వున్న రాజధానికిపోయి సైనికులను తీసుకువస్తారా?'' అని, అనుచరులతో, ''ఒరే, వీళ్ళనిద్దరినీ తాడుకుకట్టి, ఆ కనబడే కొండగుహల కేసి లాక్కురండి. ఆ తలారి ఎలుగుబంటు, యీ ప్రాంతాలు వదిలిన తరవాత, అసలు నిజంగా వీళ్ళెవరో తెలుసుకుందాం,'' అన్నాడు.

నాగమల్లు యిలా చెప్పి, గుహలకేసి బయలుదేరేసరికి, అతడి అనుచరులు రాజు దుర్ముఖుణ్ణీ, అంగరక్షకుణ్ణీ తాళ్ళతో



కట్టి వెనకగా లాక్కుపోసాగారు. వాళ్ళు ఒక పెద్ద గుహను సమీపిస్తున్నంతలో, తలారి ఎలుగుబంటు చెట్లచాటు నుంచి ఏనుగు నెక్కి అటుకేసివస్తూ, దుర్ముఖుణ్ణి చూసి. "ఒరే, దుష్టుడా, దొరికావా! నిన్నిదే నా గండ్ర గొడ్డలికి బలిచేయబోతున్నాను," అంటూ ఏనుగు మీదినుంచి దూకి, వాళ్ళవెంటబడింది.

నాగమల్లుతోపాటు అందరూ భయకంపితులై, పరుగెత్తుతూపోయి ఒక గుహలో జొరబడ్డారు. తలారి ఎలుగుబంటు గుహను సమీపిస్తున్నంతలో, వాళ్లు ఒక పెద్ద బండరాయిని గుహద్వారానికి అడ్డంపెట్టి, లోపల వణికిపోసాగారు.

తలారి ఎలుగుబంటు గుహ ముందుకు పోయి, దానికి అడ్డంగావున్న బండరాయిని ఒకటికి రెండుసార్లు కాలితో గట్టిగా తన్ని, "ఒరే, గుహలో వున్నవాళ్ళంతా బయిటికిరండి. నాకు కావలసింది, రాజుదుర్ముఖుడి తల. మిగతావాళ్ళకు ఎలాంటి హానీ చేయను," అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు విన్న దొంగలనాయకుడు నాగమల్లు, తన ఇద్దరు అనుచరులతో, "ఇది యింకా బావుంది! ఆ పిశాచి ఎలుగుబంటుకు కావలసింది, రాజుదుర్ముఖుడి తల అట! ఏమిటీ తలా, తోకా లేని గత్తరంతా?" అని రాజు దుర్ముఖుడితో, "ఈ ప్రాంతాలకు సమీపానగల ఉదయగిరి రాజ్యాన్ని, దుర్ముఖు డనే రాజు పాలిస్తున్నాడు. నేను అరణ్యాలు వదిలి, వింతలు చూసేందుకు నగరాలకు పోయేవాణ్ణికాదు గనక, ఆ రాజును ఏనాడూ చూడలేదు. ఒకవేళ నువ్వే, ఆ దుర్ముఖ రాజువు కాదుగదా?" అని అడిగాడు.

"నేను దుర్గయశెట్టిని, ఉదయగిరి నగరం వాణ్ణి. ఏ పిశాచో ఆవహించిన ఆ ఎలుగుబంటు మాటలు ఎందుకు నమ్ముతావు? మనం క్షేమంగా యిక్కణ్ణించి బయటపడే మార్గం ఏదైనావుంటే చూడు. నువ్వడిగిన ఆ పదివేల వరహాలూ



యిచ్చుకుంటాను.'' అన్నాడు రాజు దుర్ముఖుడు దీనంగా ముఖంపెట్టి.

''మహారాజుగారు, అన్నమాట తప్పటమంటూ ఏనాడూ జరగలేదు, మల్లా!'' అన్నాడు అంగరక్షకుడు.

''ఛీ, వెధవా, నోరుముయ్యి! నిన్ను, ఏదైనా పిశాచి పట్టలేదుగదా? ఈ అరణ్యం ప్రవేశించినప్పటి నుంచీ చూస్తున్నాను. నన్ను విడవకుండా, ఆదేపనిగా మహారాజా, మహారాజా అంటున్నావు. బహిరంగ శిరశ్ఛేదం చేయించగలను, జాగ్రత్త!'' అన్నాడు దుర్ముఖుడు.

దొంగ నాగమల్లు ఉలిక్కిపడి, మిగతా యిద్దరు దొంగలతో, ''ఒరే, మనం అదృష్టంకొద్దో లేక దురదృష్టంకొద్దో, ఉదయగిరి రాజు దుర్ముఖుణ్ణే పట్టినట్టుంది. రాజుకు తప్ప, మరెవడికి తోటి మనిషిని బహిరంగంగా శిరశ్ఛేదం చేయించే హక్కుంది? ఈ దుర్జయశెట్టి ననేవాడు, నోరుజారి నిజంగా తనెవరైందీ చెప్పేశాడా ఏం!'' అన్నాడు.

రాజు దుర్ముఖుడికి బయట గుహకు అడ్డంగా వున్న రాతిని పక్కకు తోసేందుకు ప్రయత్నిస్తున్న తలారి ఎలుగుబంటి భయంతోపాటు, లోపలవున్న దొంగలు తనకేమైనా హానికలిగించగలరేమో అన్న భయం పట్టుకున్నది. అతడు ఏదో హెచ్చరిస్తున్నట్టు పక్కనవున్న అంగరక్షకుణ్ణి మోచేతితో ఒకసారి పొడిచి, ''మల్లా! నన్ను గురించి నువ్వేదో భ్రమలకు లోనవుతున్నావు. నేను, నిజంగా, దుర్జయశెట్టినే! ఈ భయంకరారణ్యం చేరినప్పటినుంచీ, నా నౌకరు మతిస్థిమితం పోగొట్టుకున్నవాడిలా పిచ్చివాగుడు వాగుతున్నాడు. వీణ్ణి, ఏదో దుష్టగ్రహం పట్టివుండాలి!'' అన్నాడు.

''క్షమించండి, మహారాజా! అంతే, అంతే.'' అన్నాడు అంగరక్షకుడు పెద్దగా మూలుగుతూ.

నాగమల్లు తల గట్టిగా పట్టుకుని, ''ఇప్పటి పరిస్థితిలో నువు రాజువైనా,

శెట్టివైనా నాకు ఒరగబోయేదేంలేదు. ఆ భయంకరమైన ఎలుగుబంటు గుహ కడ్డంగా వున్న రాతిని పక్కకు నెట్టి, గండ్ర గొడ్డలితో మనందరి తలలూ నరకబో తున్నది,'' అని తన యిద్దరు అనుచరులతో, ''ఒరే, చచ్చేవాళ్ళం, ఎలానూ చస్తాం. మనమే ముందుగా రాతిని పక్కకు నెట్టి, కత్తులతోపోయి, ఆ తలారి ఎలుగుబంటు మీదపడటం ఎలావుంటుందంటారు?'' అని అడిగాడు.

దొంగలిద్దరూ తమనాయకుడికి జవాబివ్వబోయేంతలో, అంగరక్షకుడు కల్పించుకుని, ''మల్లూ! ఆ తలారి ఎలుగుబంటును, భల్లూకమాంత్రికు డనే వాడు సృష్టించాడు. దాని బలం రాక్షస బలం అనుకో! మనం యీ గుహనే అంటిపెట్టుకుని వుండటం క్షేమం,'' అన్నాడు.

వాడు మాట ముగించేలోపలే తలారి ఎలుగుబంటు రెండు చేతులతో పట్టి రాతిని కొంచెంగా పక్కకు నెట్టి, గుహ లోపలికి తొంగి చూస్తూ, ''ఒరే, దుర్ముఖ రాజా, బయిటికి రా. నీ తల నరికి, నా దారిన నేను వెళ్ళిపోతాను,'' అన్నది.

''బావుంది! దీని పగ దుర్ముఖరాజో, దుర్జయశెట్టో అనే వీడి ఒక్కడి మీదనే అన్నమాట; వీణ్ణిపట్టి గుహ బయిటికి నెట్టండి!'' అన్నాడు నాగమల్లు.

దొంగలిద్దరూ, రాజు దుర్ముఖుడి భుజాలు పట్టుకుని, పెనుగులాడుతున్న అతణ్ణి గుహ బయిటికి యీడ్చుబోతున్నంతలో, గుహకు కొంచెం దూరం నుంచి, ''ఇందాకటి నుంచి చూస్తున్నాను, ఏమిట్రా యీ గొడవ? పక్క గుహలో మహా రాక్షసుడైన ఉగ్రదండుడు వున్నాడనే సంగతే ఎరగరా?'' అన్న భీకరమైన కంఠస్వరం వినబడింది.

ఆ మరుక్షణం తలారి ఎలుగుబంటు, ''నువ్వు, రాక్షసుడివా? ఉగ్రదండుడా. నీ పేరు? భల్లూకమాంత్రికుడి మంత్ర శక్తి గల, యీ గండ్రగొడ్డలి నీ కంఠాన్ని నరకబోతున్నది!'' అంటూ, రాక్షసుడి కేసి బయలుదేరింది. —(ఇంకావుంది)





# భల్లూక మాంత్రికుడు

## 7

[అరణ్యంలో నాగమల్లు అనే దొంగలనాయకుడికి దొరికిన రాజు దుర్ముఖుడు, తన పేరు దుర్జయశెట్టి అని చెప్పి పారిపోజూశాడు. నాగమల్లు నమ్మక అతణ్ణి ఒక గుహలోకి తీసుకుపోయాడు. అక్కడికి తలారిభల్లూకం వచ్చి గొడవ చేస్తూండగా, ఉగ్రదండుడనే రాక్షసుడు వచ్చాడు. తలారిభల్లూకం, వాడి మీదికి గండ్రగొడ్డలి ఎత్తింది. తరవాత—]

తలారిభల్లూకం సూర్యకాంతిలో ధగధగ లాడుతున్న గండ్రగొడ్డలిని పైకెత్తి పట్టుకుని తన కేసి రావటం చూస్తూనే, రాక్షసుడు ఉగ్రదండుడు ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, అంతలోనే ఏదో గుర్తుకు రావటంతో నిలువెల్లా వణికిపోతూ, రాతి గదను ముందుకు చాచి, "ఒరే, మానవ భల్లూకాధమా! అగు, ఏమా పొగరు?" అన్నాడు.

తలారి భల్లూకం చప్పున ఉన్నచోటునే ఆగి, ఉగ్రదండుణ్ణి నిలువెల్లా ఒకసారి పరీక్షగా చూసి, "ఒరే, ఉగ్రదండా! రాక్షసుణ్ణని అహం పోతున్నావా? నీ మేక పోతు గాంభీర్యం, నా దగ్గిరా? నీ కాళ్లూ, గద పట్టిన చేయీ వణుకుతూండటం, తెలుస్తూనే వున్నది." అన్నాడు.

ఉగ్రదండుడు పళ్ళు కొరుకుతూ కాళ్ళతో గట్టిగా నేలను తాటించి,



ముందుకు దూకి, గండ్రగొడ్డలిని రాక్షసుడి కంఠం కేసి కొట్టబోయాడు.

ఉగ్రదండుడు ఎగిరి గంతేసి దాపుల నున్న ఒక చిన్న దేవదారువృక్షం పక్కకు పోయి నిలబడి, యీ సారి నిబ్బరంగా అడుగులో అడుగు వేసుకుంటూ తనను సమీపిస్తున్న తలారి భల్లూకంతో, "తలారి భల్లూకా, కాస్త శాంతించు. మనిద్దరం ఒకళ్ళనొకళ్ళం చంపుకునే ప్రయత్నంలో బాగా గాయపడటం తటస్థిస్తే, లాభపడేది ఎవరో తెలుసా ?'' అన్నాడు.

ఆ ప్రశ్న వింటూనే తలారి భల్లూకుడికి, తానా ప్రాంతాలకు వచ్చిన పనేమిటో గుర్తుకు వచ్చింది. భల్లూక మాంత్రికుడు తనను పంపింది, దుష్టుడైన ఉదయగిరి రాజు దుర్ముఖుడి తల నరకమని! ఆ పని ముగించుకుని, తిరిగి భల్లూకమాంత్రికుడి దగ్గిరకు పోక, తనెందుకు యీ ఉగ్ర దండుడనే రాక్షసుడితో గొడవలు పడటం? వాడు కవ్వించినందుకు, తను గండ్ర గొడ్డలితో మీదికి దూకితే, దూరంగా పారి పోయాడు. అంటే, తనే గెలిచినట్టన్న మాట!

ఈ ఆలోచన కలగ్గానే తలారి భల్లూకం, వేళ్ళతో గండ్రగొడ్డలి పదునును ఒకసారి పరీక్షించి చూసుకుని, "ఒరే, ఉగ్రదండా! సమయానికి నేనిక్కడికొచ్చిన పనేమిటో

''నా కాళ్ళూ, చేతులూ వణుకుతున్న మాట నిటమే. కాని, అది నిన్ను చూసిన భయం వల్ల కాదు; అసహ్యం వల్ల! ఇంతకూ నీలో భల్లూకం పాలెంత? మనిషి పాలెంత ? ఏమిటీ, యీ సంకరరూపం!" అన్నాడు.

ఆ మాటలతో ఉగ్రుడైపోయిన తలారి భల్లూకం, కోపం పట్టలేక గండ్రగొడ్డలిని దాపులనున్న పెద్ద రాతిమీద బలంగా కొట్టి, ''ఒరే, రాక్షసాధమా! భల్లూక మాంత్రికుడు సృష్టించిన, యీ తలారి భల్లూకుణ్ణే హేళనచేసి మాట్లాడు తున్నావా? ఇదిగో, నీ తల తెగి నేల పడబోతున్నది,'' అంటూ కుప్పించి

గుర్తు చేశావు. మెచ్చాను! ఇక నీ దారిన నువ్వుపో: నే నీ పక్కన వున్న గుహలో దాగిన రాజు దుర్ముఖుడి తల నరికి, నా దారిన నేను పోతాను,'' అంటూ వెనుదిరిగాడు.

ఉగ్రదండుడు రెండడుగులు ముందుకు వేసి. ''ఓయ్, తలారి భల్లూకా, కొంచెం ఆగు! ఇంతకుముందు నువ్వు, భల్లూకమాంత్రికుడి పేరు పలికావు. నే విన్న భల్లూకమాంత్రికుడూ, నువ్వనే యీ భల్లూకమాంత్రికుడూ ఒకరేనేమో అన్న సంశయం కలుగుతున్నది. నువ్వెరిగిన యీ మాంత్రికుడి వయసు ఏపాటి వుంటుంది ? '' అన్నాడు.

ఆ ప్రశ్నకు తలారి భల్లూకుడు పెద్దగా నవ్వి. ''సూర్య, చంద్రుల వయసెంతో ఆయన వయసంత. ఆయన కళ్ళ ఎదటే హిమాలయ పర్వతాలు పుట్టి; యింత అయినై. బ్రహ్మపుత్రానది పురిటిబిడ్డగా కెవ్వు మంటూ అరిచి, వేలెడంత నీటి పాయగా కొండరాళ్ళ మీద గంతులు వేయటం ఆయనెరుగు ! '' అన్నాడు.

''భళిరా, తలారిభల్లూకా! నీ చేతిలోని గండ్రగొడ్డలి ఎంత వాడి అయిందో, నీ తలలోని నాలుకా అంత వాడి అయిందే! నిజంగా మెచ్చాను! నేనూ, నీ వెంట వచ్చి, ఆ భల్లూకమాంత్రికుడి దర్శనం



చేసుకోవటం ఎలా వుంటుందంటావు ? '' అన్నాడు ఉగ్రదండుడు రాతి గదను దూరంగా విసిరివేస్తూ.

రాక్షసుడి ప్రవర్తనకు తలారిభల్లూకం ఆశ్చర్యపోతూ, ''అలా రాతి గదను దూరంగా పారవేయటంలో ఏదైనా విశేష ముందంటావా ? '' అని అడిగాడు.

''ఎందుకు లేదు ? ఈ క్షణంనుంచీ మనిద్దరం మిత్రులం,'' అన్నాడు ఉగ్రదండుడు.

ఆ జవాబుకు తలారిభల్లూకం పొట్ట చెక్కలయేలా నవ్వి, "భల్లూకమాంత్రికుడి చేతగల, ఎలుగుతలాటం మంత్రదండం తగిలి, నా రూపం మారినా, చూచాయగా



13926



నేనెవరో, నా కింకా గుర్తున్నది. రాజు దుర్ముఖుడి తలను ఆ మాంత్రికుడి పరం చేసిన మరుక్షణం, ఆయన నన్ను తలారిగా మార్చేస్తాడు. కనక, మనిద్దరి మధ్యా స్నేహం సాగదు. నీ గుహ దారేదో నువు చూసుకో,'' అని, దొంగల నాయకుడూ, రాజు దుర్ముఖుడూ దాగి వున్న గుహకేసి వెళ్ళాడు.

ఈసారి తలారిభల్లూకం గుహకు అడ్డంగావున్న రాతిని పక్కకు లాగి పడవేసే ప్రయత్నం ప్రారంభించగానే లోపలవున్న రాజు అంగరక్షకుడు, దొంగ నాగమల్లుతో, ''నాగమల్లూ, ఈసారి మహారాజుగారితోపాటు మనందరికీ చావు తప్పదు. ఇప్పుడు ఏం చేసేట్టు?'' అన్నాడు వణికిపోతూ.

నాగమల్లు, దుర్ముఖుడి కేసి చూశాడు. దుర్ముఖుడు, తనలో తాను ఏదో గొణుక్కుంటూ గుహద్వారం కేసి చూస్తున్నాడు. నాగమల్లు తన అనుచరులిద్దరినీ కత్తులు దూసి, సిద్ధంగా వుండమని హెచ్చరించి, దుర్ముఖుడితో, ''నీ అంగరక్షకుడి మాటల వల్ల యిప్పటికి నువ్వు శెట్టివి కాదనీ, రాజువనీ నాకు నమ్మకం కలిగింది. ఆ భల్లూకం నరకవచ్చింది, నీ తల. ఆత్మరక్షణ చేసుకునే ప్రయత్నం చెయ్యక, ఏదో గొణుగుతున్నా వెందుకు?'' అన్నాడు కోపంగా.

''నేను గొణగటం లేదు, ఏమి చెయ్యాలో తెలుసుకునేందుకు, ఇష్టదైవాన్ని ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు రాజు దుర్ముఖుడు బొంగురుపోయిన గొంతుతో.

''అంటే, యీనాటివరకూ నువ్వుచేసిన వెధవ పనులన్నీ, నీ యిష్టదైవం అనుమతితోనే చేశావన్నమాట! ఛీ, బయిటికి నడు,'' అంటూ నాగమల్లు, దుర్ముఖుణ్ణి పక్కకు తోసి, సగం తెరుచుకున్న గుహద్వారం దగ్గిరకుపోయి, పెద్ద గొంతుతో, ''ఓయ్‌, తలారిభల్లూకా, కాస్త నిదానించు! ఈ గుహలోవున్న వాళ్ళలో నీ క్కావలసింది, దుర్ముఖశెట్టి నని

అబద్ధాలాడే దుర్ముఖరాజే గదా ?'' అని అడిగాడు.

''ఔనౌను! మిగతా చిల్లరమల్లర సరుకుతో నాకేం పని? వాణ్ణి గుహనుంచి తలతోపాటు బయటికి నెట్టండి; తల మాత్రం నే న్నరుక్కుపోతాను,'' అన్నాడు తలారిభల్లూకం.

''అయితే కొంచెం ఓపికపట్టు,'' అని, దొంగలనాయకుడు నాగమల్లు వెనుదిరిగి, దుర్ముఖుడితో, ''రాజా, దుర్ముఖా! తలారిభల్లూకం మాటలువిన్నావు గదా? చావే తప్పకపోతే, రాజోచితంగా కత్తి దూసి, ఆ తలారి భల్లూకంతో పోరాడుతూ ఎందుకు చావకూడదు?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు వెలవెలపోతూ, ''నేను రాజోచితంగా బతకటం నేర్చిన వాణ్ణేకాని, రాజోచితంగా చావటం చేత నైన వాణ్ణికాను!'' అని, పక్కనవున్న అంగరక్షకుడితో, ''ఒరే, అంగరక్షకా! నీ స్వామిభక్తి ఎలాంటిదో చూపి, స్వర్గానికి పోయేందుకు, యిదే మంచి అవకాశం! నువు ముందుపోయి ఆ తలారిభల్లూకాన్ని ఎదిరించు. ఆ సమయంలో నేను ప్రాణాలతో తప్పించుకునే అవకాశం వుంటుందేమో చూస్తాను.'' అన్నాడు.

అంగరక్షకుడు యీసారి ఒర నుంచి దూసిన కత్తిని తిరిగి ఒరలో పెట్టివేస్తూ,



''నేను చచ్చి స్వర్గానికిపోతే, యిక్కడ నా భార్యాబిడ్డల మాటేమిటి? ఇప్పు డప్పుడే అటుకేసిపోవాలని లేదు,'' అంటూ గుహ గోడకు చేరగిలబడి, గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

అంతలో బయటి నుంచి తలారి భల్లూకం కోపంతో పళ్ళుకొరికి, ''ఒరే, ఎక్కడరా, ఆ దుర్ముఖ రాజు? ఒకసారి నేను గుహలో జొరబడ్డానంటే, మీ అందర్నీ ఊచకోత కోస్తాను,'' అన్నది.

దొంగ నాగమల్లు తన అనుచరులిద్దరికీ సైగచేసి, వాళ్ళు వెంటరాగా, గుహకు అడ్డంగావున్న రాయిని పక్కకునెడుతూ, తల బయటికి పెట్టి, ''అయ్యా, నన్నూ,



నా యిద్దరు సేవకుల్నీ ప్రాణాలతో వదలండి. మేం, యీ ప్రాంతాల అరణ్యమృగాల మధ్య దినదిన గండంగా బతుకుతున్నవాళ్ళం!'' అన్నాడు.

''ఒరే, మీరు దొంగలు, ఆ సంగతి నాకు తెలుసు! అయినా నేను, మిమ్మల్ని ఏమీ చెయ్యను,'' అన్నాడు తలారిభల్లూకుడు.

నాగమల్లూ, అతడి అనుచరులూ రాతిన సాంతం పక్కకు నెట్టివేసి బయిటికి వస్తున్నంతలో, వాళ్ళను చాటు చేసుకుని రాజు దుర్ముఖుడు వేగంగా బయిటికి దూకి, పారిపోసాగాడు.

తలారిభల్లూకం ఎగిరి గంతేసి, ''ఒరే. దుర్ముఖా! ఆఁ, ఆగు,'' అంటూ వెంటబడి కొంత దూరం పరిగెత్తేంతలో దుర్ముఖుడు ఒక చెట్టుచాటుకు పరిగెత్తబోయి, ఎదురుగా రాతిగద పట్టుకుని నిలబడివున్న రాక్షసుడు ఉగ్రదండుణ్ణి చూసి, ఒక చావుకేకపెట్టి, అతడి ముందు బోర్లాపడిపోయాడు.

తలారిభల్లూకుడు, ''ఆహాఁ, దొరికావు గదరా!'' అంటూ దుర్ముఖుణ్ణి సమీపిస్తున్నంతలో, ఉగ్రదండుడు రాతిగదను నేలజార్చి, చేఎత్తి, ''సోదరా, తలారిభల్లూకా, ఒక్క క్షణం ఆగు! ఆ భల్లూకమాంత్రికుడు నిన్ను బతికివున్న రాజు దుర్ముఖుడి తల నరుక్కురమ్మన్నాడా లేక చచ్చిన దుర్ముఖుడి తల కోసుకు రమ్మన్నాడా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు తలారిభల్లూకం ఆశ్చర్యపోతూ, కదలా మెదలక పడివున్న దుర్ముఖుడికేసి పరీక్షగా చూసి, ''ఉగ్రదండా! ఈ దుర్ముఖుడు చచ్చిపోయాడనా నువ్వనేది?'' అన్నది.

''చావలేదు, మూర్ఛపోయాడు. మూర్ఛలోవున్నవాడి తల నరకటం మహాపాపం అన్నారు గదా, పెద్దలు. ఒక పని చెయ్యి. వీణ్ణి, ఆ మాంత్రికుడి దగ్గిరికి తీసుకుపోయి, అక్కడే తల నరుకు. అక్కడకు వెళ్ళేలోపల వీడికి స్పృహ రాకపోదు.'' అన్నాడు ఉగ్రదండుడు.



తలారిభల్లూకం బుసలుకొడుతున్నట్టు పెద్దగా నిట్టూర్చి, ''శత్రువును భుజాన వేసుకుని మోయమన్నావా? ఛీ, ఛీ!'' అన్నాడు.

ఉగ్రదండుడు గుహకేసి ఓ మారు చూశాడు. అక్కడ నాగమల్లూ, అతడి యిద్దరు అనుచరులూ నిలబడి, పారి పోయే ప్రయత్నం చేస్తూ గుసగుస లాడు తున్నారు. ఉగ్రదండుడు రాతిగదను చేతికి తీసుకుని, ''ఒరే, దారిదోపిడీ వెధవల్లారా, పారిపోవాలని చూస్తున్నారా? జాగ్రత్త, కాలరాయగలను! ఇటురండి. ఆ అంగరక్షకు డెక్కడ?'' అంటూ గద్దించాడు.

దొంగలు ముగ్గురూ గడగడ వణికి పోయారు. నాగమల్లు గుహలోకి తొంగి చూసి, ''అయ్యా, ఇక్కడ ఆ రాజు అంగరక్షకుడు మూర్ఛపోయినట్టున్నది. గుహకు చేరగిలబడి, కట్టెలా బిగుసుకు పోయి వున్నాడు,'' అన్నాడు.

''వాడిది దొంగమూర్ఛ. ఉగ్రదండుడు అభయంయిచ్చి, పిలుస్తున్నట్టు చెప్పండి. ఇక్కడ రాజుదుర్ముఖుడు చావబోతు న్నాడు,'' అన్నాడు ఉగ్రదండుడు.

దొంగల నాయకుడు నాగమల్లు పెద్దగా గొంతెత్తి, ''ఒరే, అంగరక్షకా, మూర్ఛలే! మహారాక్షసుడు ఉగ్రదండుడు, నిన్ను చంపనని అభయం యిచ్చాడు,'' అని కేకపెట్టాడు.

దానితో అంగరక్షకుడు చప్పున లేచి కూర్చుని, మోకాళ్ళ మీద పాకుతూ గుహలోనుంచి బయిటికి వస్తూ, ''మహా రాజుగారి తల తెగినట్టేనా? ఆ భయంకర తలారిభల్లూకం యిక్కణ్ణించి వెళ్ళి పోయిందా?'' అని అడిగాడు.

ఆ వెంటనే నాగమల్లు అనుచరు లిద్దరూ, వాడి మీదికి దూకి, ఒకడు మెడా, మరొకడు నడుమూ పట్టుకుని బయిటికిలాగి, ''అట్టే వాగకు! అడుగో, మీ దుర్ముఖరాజు, ఉగ్రదండుడి పాదాల దగ్గిర మూర్ఛపోయి వున్నాడు,'' అన్నారు.

అంగరక్షకుడు నిలువెల్లా వణికిపోతూ ఉగ్రదండుడి ముందుకు పోయి, "అయ్యా, యీ క్షణం నుంచీ నేను తమకు అంగరక్షకుణ్ణి. ఈ తలారి భల్లూకం నుంచి కాపాడాలి," అన్నాడు.

ఉగ్రదండుడు పెద్దగా నవ్వి, "అలా అయితే, నా రక్షణకు, ఒక అంగరక్షకుడు దొరికాడన్నమాట! ఎంత మహా రాక్షసుడికి ఎంత దుర్దశపట్టింది," అని, "ఒరే, అంగరక్షకా! వెంటనే ఆ కనబడే నా గుహలోకిపోయి, ఒక రాతిపాత్ర తీసుకుని, ఆ చెట్లచాటునవున్న నీటివాగు నుంచి, నీరు తీసుకురా. ఈ దుర్ముఖ రాజు మూర్ఛనుంచి లేచేమార్గం ఏమన్నా వున్నదేమో చూద్దాం," అన్నాడు.

"మా రాజు మూర్ఛనుంచి బయటపడితే తప్ప, తలారిభల్లూక దొర, తల నరుక్కుపోరన్నమాట!" అంటూ ఆశ్చర్యపోయాడు అంగరక్షకుడు.

తలారిభల్లూకం గండ్రగొడ్డలి ఎత్తి, కళ్ళెర్రచేసి, "ఒరే, మూర్ఖుడా! అలా చూస్తావేం? ఉగ్రదండుడు చెప్పిందేమిటి?" అన్నాడు.

ఆ మరుక్షణం అంగరక్షకుడు రాక్షసుడి గుహలోకి పరిగెత్తి, అక్కడవున్న ఒక రాతిపాత్ర తీసుకుని, వాగు కేసిపోయాడు. వాడు పాత్రలో నీటిని నింపుతున్నంతలో, ఆ పక్కనవున్న చెట్లగుంపులో నిలబడివున్న తొండంతెగిన ఏనుగు వాణ్ణి చూసి, పెద్దగా ఘీంకరించి వాడికేసి పరిగెత్తి రాసాగింది.

అంగరక్షకుడు పాత్రను అక్కడేవదిలి, ఉగ్రదండుడూ వాళ్లువున్న చోటుకు పరిగెత్తుకుంటూ వచ్చి, "అయ్యా, తలారి భల్లూకంగారి మొండి తొండపుటేనుగు వెంటబడి వస్తున్నది," అంటూ అరిచాడు.

"ఆహాఁ, నా వాహనం యీ ప్రాంతాలనే వున్నదన్నమాట!" అంటూ తలారి భల్లూకుడు తలపక్కకుతిప్పి చూసేంతలో, ఏనుగు తొండం పైకెత్తి, ఘీంకరిస్తూ పెనుభూతంలా వాళ్ళ మీదికివచ్చి పడసాగింది.

—(ఇంకావుంది)





# భల్లూక మాంత్రికుడు

## 8

[ రాజు దుర్ముఖుడు, తన వెంటబడిన తలారిభల్లూకం నుంచి పారిపోతూ, రాక్షసుడు ఉగ్రదండుడు కంటబడగానే, భయంకొద్దీ మూర్ఛపోయాడు. ఉగ్రదండుడు అతడి మూర్ఛ పోగొట్టేందుకు, అంగరక్షకుణ్ణి వాగు నుంచి నీళ్ళు తెమ్మన్నాడు. వాగు దగ్గరవున్న మొండి తొండపుటేనుగు, వాణ్ణి చూసి రెచ్చిపోయి ఘీంకరిస్తూ పరిగెత్తి రాసాగింది. తరవాత—]

రాక్షసుడు ఉగ్రదండుడు, తమను సమీపిస్తున్న ఏనుగు కేసి ఓసారి చూసి, తలారి భల్లూకుడితో, "ఈ తొండం తెగిన ఏనుగు, నీ వాహనమా? దీని వాలకం చూస్తే, ఒట్టి అడవి ఏనుగులా వున్నది," అన్నాడు.

"అవును, అడవి ఏనుగే! అరణ్యంలో నా దారిని అడ్డగించబోతే, గండ్రగొడ్డలితో తొండం మీద కొట్టి, పైనెక్కి కూర్చుని, చెవులు మెలిపెడుతూ యిక్కడికి తీసుకు వచ్చాను," అన్నాడు తలారి భల్లూకుడు.

అంతలో ఏనుగు వాళ్ళ దాపులకు వచ్చేసింది. అది చూసి దొంగ నాగమల్లూ, అతడి ఇద్దరు అనుచరులూ గుహకేసి పరిగెత్తారు. అప్పటివరకూ మూర్ఛలో వున్న రాజు దుర్ముఖుడు తక్కున లేచి నిలబడి, బాణంలా చెట్లచాటుకు దూసుకు పోయాడు. అంగరక్షకుడు కీచుమంటూ



అరిచి, ఉగ్రదండుడి వెనక్కుపోయి నిలబడ్డాడు.

ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి, "ఒరే, ఇంతకు ముందు నువు, నాకు అంగరక్షకుణ్ణన్నావు. ఇప్పుడు నేనే, నీకు అంగరక్షకుణ్ణన్నమాట! ఛీ, పిరికివెధవా!" అని, మీదికి వస్తున్న ఏనుగు దారి నుంచి పక్కకు తప్పుకున్నాడు.

తలారిభల్లూకం గండ్రగొడ్డలి తిప్పుతూ, ఏనుగుకు అడ్డంగా పోయి, "అగు! నేనెవర్నో గుర్తించలేదా? తలారి భల్లూకుణ్ణి. నువు, నా వాహనానివి," అన్నాడు.

తలారి భల్లూకం మాట ముగించే లోపలే, ఏనుగు వాణ్ణి తొండంతో పట్టి పైకెత్తి, దూరంగా విసరబోయింది. కాని, అంతలో రాక్షసుడు ఉగ్రదండుడు పైకెగిరి, ఏనుగు చెవినొకదానిని వడిసి పట్టుకుని, రాతి గదతో దాని డొక్కల్లో గట్టిగా ఒక పోటు పొడిచాడు. ఆ దెబ్బకు ఏనుగు, తలారి భల్లూకుణ్ణి కిందికి జార్చి, దభీమంటూ నేలమీద పడిపోయింది. ఉగ్రదండుడు మెరుపులా పోయి, దాని ముందు కాళ్ళు రెండూ కలిపి పట్టుకుని పైకెత్తుతూ, "ఒరే, అంగరక్షకా! వెంటనే పోయి. అడవిచెట్ల తీగలు లాక్కురా. దీన్ని కాళ్ళు కట్టివేయాలి," అన్నాడు.

అంగరక్షకుడు చెట్లల్లోకి పరిగెత్తాడు. తలారి భల్లూకుడు దిమ్మెరపోయిన వాడిలా కళ్ళు మూసి తెరుస్తూ, "ఉగ్రదండ రాక్షసా! నా మంత్రపు గండ్రగొడ్డలి శక్తి కన్న, నీ దేహబలమే మిన్నలా వున్నది. నన్ను ప్రాణాపాయం నుంచి కాపాడావు. మెచ్చాను. ఏం కావాలో కోరుకో, యిస్తాను!" అన్నాడు.

ఉగ్రదండుడు, తలారి భల్లూకుడి కేసి చిరునవ్వుతో చూసి, "నేను కోరుకోవలసినదేమైనా వుంటే, అది నీ గురువైన భల్లూకమాంత్రికుడి నుంచి! ప్రస్తుతానికి, యీ రెచ్చిపోయిన ఏనుగు మళ్ళీ లేచి గొడవ చేయకుండా, కాస్త నాతోపాటు దీని కాళ్ళు బిగించి పట్టుకో," అన్నాడు.

తలారి భల్లూకుడు, ఉగ్రదండుడి కేసి చురచుర చూస్తూ, "ఈ నా చచ్చు వాహనం కాళ్ళు, నేను పట్టుకోవటమా? అంతకన్న అవమానం కద్దా? ఇదుగో, ఈ క్షణానే నా మంత్రపు గండ్రగొడ్డలితో, దీని తల నూరుప్రక్కలు చేయబోతున్నాను." అంటూ గండ్రగొడ్డలి ఎత్తాడు.

"ఒరే, బాబూ, కాస్త ఆగు! ఇంత కాలంగా తలారిగా బతికినవాడివి, ఇన్ని ఊకదంపుడు మాటలు ఎప్పుడు నేర్చావు? ఈ ఏనుగును చంపటం జరిగితే, ఆ తరవాత నీవు వచ్చిన పని సాధించుకుని, నీ యజమాని భల్లూకమాంత్రికుడి దగ్గిరకు ఎలా పోగలవు? ఆలోచించావా?" అని అడిగాడు ఉగ్రదండుడు.

తాను వచ్చిన పని ఉగ్రదండుడు గుర్తు చేయగానే తలారి భల్లూకుడు ఎగిరి ఒక్క గంతువేసి, "ఔనౌను, ఆ దుష్టుడు దుర్ముఖరాజెక్కడ? ఈ క్షణం వరకూ వాడిక్కడ మూర్ఛలో, నేలకరిచి వున్నాడు గదా?" అని దిక్కులు చూడసాగాడు.

కిందపడిన ఏనుగు ఉగ్రదండుడి పట్టు నుంచి బయటపడేందుకు ఘీంకరిస్తూ, నానా గొడవా చేయసాగింది. ఉగ్రదండుడు దాని కాళ్ళు వదలక, తానూ పెద్దగా హుంకరిస్తూ, "ఒరే, అంగరక్షకా, ఎక్కడ చచ్చావు? యింత ఆలస్యమా?" అంటూ కేకపెట్టాడు.

"ఉగ్రదండయ్యా, యిదె వచ్చె!" అంటూ దొంగనాగమల్లూ, అతడి యిద్దరు





అనుచరులూ పెద్ద మోకు తీసుకుని అక్కడికి వచ్చారు.

ఉగ్రదండుడు, వాళ్ళకు ఏనుగు కాళ్ళను మోకుతో బిగించి కట్టమని చెప్పి, ''ఆహాఁ, మీర్రా నిజమైన దొంగలు! ఎప్పటికి ఎలాంటి వస్తువు అవసరం కలుగుతుందో అని, అన్నీ ముందుగానే జాగర్త పరిచారు,'' అన్నాడు.

నాగమల్లు ఏనుగు కాళ్ళకు తాడు బిగిస్తూ, ''ఉగ్రందడయ్యా, మేం అరణ్య జీవులం గదా! మీ రిక్కణ్ణించి వెళ్ళేప్పుడు, మా కోర్కె ఒకటి తీర్చాలి,'' అన్నాడు.

''ఓం, తప్పక తీరుస్తాను. ఈ తలారి భల్లూకుడి చేత, మీ ముగ్గురి తలలూ నరికించమనేదే గదా, మీరు కోరేది?'' అన్నాడు ఉగ్రదండుడు.

నాగమల్లు నిలువెల్లావణికిపోతూ, ఏదో అనబోయేంతలో తలారి భల్లూకుడు, ''దిరిశెనవన, భైరవా!'' అంటూ భీకరంగా ఒక కేక వేసి, గండ్రగొడ్డలి పైకెత్తి, ''ఒరే, దారిదోపిడి వెధవల్లారా, ఆ దుర్ముఖరాజెక్కడ? వాణ్ణి ఎక్కడదాచారు? తక్షణం చెప్పకపోయారో, మీ తలలు పీకెకు బెత్తెడు కిందివరకూ తెగనరుకుతాను,'' అన్నాడు.

దొంగ నాగమల్లు గడగడలాడుతూ, ''భల్లూకయ్యా, తల సాంతం తెగిపోయేప్పుడు, అది పీకెకు బెత్తెడుపైగా అయినా లేక కిందుగా అయినా ఒకటే! ఆ దుర్జయశెట్టి నని బొంకే దుర్ముఖరాజు మూర్ఛపోయి, యీ ప్రాంతాలనే ఎక్కడో వున్నాడు గదా?'' అన్నాడు.

''అదే నేనూ అడిగేది! వాడిప్పుడు ఏమయ్యాడు? వాడితల తీసుకు పోకపోతే ఆ భల్లూక మాంత్రికుడు నా తల తీసేస్తాడు,'' అన్నాడు తలారి భల్లూకుడు ఏడ్పుముఖంపెట్టి.

ఆ సరికి నాగమల్లు అనుచరులిద్దరూ ఏనుగు ముందు కాళ్ళను తాడుతో గట్టిగా బిగించారు. అది వెనక కాళ్ళను జాడిస్తూ, లేచేందుకు నానా హైరానా పడసాగింది.

అప్పుడు అక్కడికి అంగరక్షకుడు పొడవాటి అడవి తీగలను భుజాన వేసుకుని వచ్చాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు, ఆ తీగలతో ఏనుగు వెనక కాళ్ళను కూడా బంధించమని నాగమల్లు అనుచరులతో చెప్పి, అంగరక్షకుడితో, "ఒరే, అంగరక్షకా! ఏమిటలా, నేల చూపులు చూస్తున్నావు? ఏదో రహస్యం దాచాలని ప్రయత్నిస్తున్నావు. అవునా? చెట్ల చాటుకు పారిపోయిన ఆ దుర్ముఖరాజును ఎక్కడైనా దాచి వచ్చావా ఏం?" అన్నాడు.



ఆ ప్రశ్నతో అంగరక్షకుడు ఉలిక్కిపడి, "దండ మహారాజా, నేనిప్పుడు ఆ రాజుకు కాదు; తమకుగదా అంగరక్షకుణ్ణి?" అన్నాడు.

తలారి భల్లూకుడు రెండడుగులు ముందుకువేసి, పళ్ళు కొరుకుతూ, అంగరక్షకుడితో, "ఒరే, ఆ దుర్ముఖుడు ఎక్కడ దాగివున్నదీ, నీకు తెలుసు. నీ దొంగ చూపులే అందుకు సాక్ష్యం. నిజం చెబుతావా, తల నరకమంటావా?" అంటూ గండ్రగొడ్డలి పైకెత్తాడు.

అంగరక్షకుడు కీచుమంటూ అరుస్తూ పోయి, ఉగ్రదండుడి చాటుగా నిలబడి, "దండమహారాజా, మీ అంగరక్షకుణ్ణి రక్షించుకోవలసినవారు, మీరే!" అన్నాడు.

ఉగ్రదండుడు, వాడి మెడ పట్టుకుని ముందుకు లాగి, "ఒరే, ఆ దుష్టరాజు ఎక్కడ దాగివున్నదీ నిజం చెప్పకపోతే, నీ శరీరాంగాల్లో తలను కాపాడటం మాత్రం నా తరంకాదు. అడవి తీగలు తెచ్చేందుకు వెళ్ళినప్పుడు, పారిపోతున్న ఆ రాజు నీ కంటబడ్డాడు. అతడితో ఏవో మంతనాలాడి యిక్కడికి వచ్చావు. అవునా? జరిగిందేమిటో చెప్పకపోయావో నిన్ను, యీ ఏనుగు తొండానికి అందిస్తాను," అంటూ అంగరక్షకుణ్ణి, కిందపడివున్న ఏనుగు కేసి లాగాడు.

అంగరక్షకుడు లబోదిబోమంటూ చేతులు రెండూ పైకెత్తి, "దండమహా



రాజా, శరణు! శరణు! ఆ రాజు నాకు అర్ధరాజ్యం ఆశ పెట్టాడు. ఎలాగో మీ అందరి కళ్ళూ కప్పివస్తే, ఇద్దరం కలిసి ఉదయగిరిపట్టణం చేరదామన్నాడు. ఆ తరవాత నన్ను అర్ధ రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేస్తాడట!'' అన్నాడు.

''ఆ మాటలు నువ్వు నమ్మావన్న మాట!'' అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు పెద్దగా నవ్వి, ''ఒరే, అంగరక్షకా! నువ్వు మనిషివై వుండీ, మనిషి మాటలు నమ్మటం నాకు ఆశ్చర్యంగా వుంది. ఆ పట్టణం చేరాక నీకు జరిగేది రాజ్యాభిషేకం కాదు; పట్టణం మధ్య మండుటెండలో నిలువునా కొరత. తెలిసిందా?'' అన్నాడు.

''అంతే అయుంటుంది, దండమహారాజా! నేనిక ఎక్కడికీ పోను. తమ వెంటే అంగరక్షకుడుగా మిగిలిన ఆయుర్దాయమంతా గడిపేస్తాను," అంటూ అంగరక్షకుడు వగర్చసాగాడు.

అప్పటివరకూ యీ జరిగినదంతా తలాడిస్తూ చూస్తున్న తలారిభల్లూకుడు, ''జై, భల్లూకమాంత్రికా!'' అంటూ అరణ్యం దద్దరిల్లేలా ఒక కేకపెట్టి, "ఇక యీ చచ్చు కబుర్లన్నీ కట్టిపెట్టండి. నే వచ్చినపనేమిటి? మీ వీధి భాగవతం ముచ్చట్లేమిటి? భల్లూకమహామాంత్రికుణ్ణి అవమానించిన ఉదయగిరి రాజు దుర్ముఖుణ్ణి వెంటనే తెచ్చి, నా ముందు పెట్టాలి. అలా చేయకపోయారో, మీ అందరి తలలూ వరసగా నరికి, యీ అడవి తీగలకు గుచ్చి, మెడలో వేసుకుంటాను," అన్నాడు.

ఆ మాటలకు రాక్షసుడు ఉగ్రదండుడు కోపం తెచ్చుకుని, ''తలారి భల్లూకా! నీకు ఒంటరిగా ఇందరి తలలు నరికే శక్తి వున్నదంటావా?'' అని అడిగాడు.

తలారి భల్లూకుడు నిప్పులు చెరిగే కళ్ళతో అతడికేసి చూస్తూ, గండ్రగొడ్డలి పైకెత్తి, ''ఈ గొడ్డలి భల్లూకమహా

మాంత్రికుడి వరప్రసాదితం. దీనీ ధాటికి ఎదురులేదు. ఏదీ, నీ రాతిగదతో దెబ్బ కాచుకోగలవేమో చూడు!'' అంటూ ఉగ్రదండుడి కేసి ఒకడుగు వేశాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు రెండడుగులు వెనక్కు వేసి, ''తలారి భల్లూకా, కొంచెం శాంతించు! మనిద్దరం ఒకళ్ళనొకళ్ళం చంపుకోవటం, యిక్కడ చేరిన సన్నకారు దుష్టులకు మేలవుతుందని, లోగడే ఒక సారి చెప్పాననుకుంటాను,'' అన్నాడు.

''అది సరే, రాజు దుర్ముఖుడి తల మాటేమిటి? అది వెంట లేకుండా నేను, భల్లూక మహామాంత్రికుడి దగ్గిరకు ఎలా వెళ్ళటం? ఏమని చెప్పటం?'' అన్నాడు తలారి భల్లూకుడు.

''ఆ రాజు కోసం అందరం కలిసి, యీ చుట్టుపక్కల అరణ్యమంతా గాలిద్దాం. రాజప్రాసాదాల్లో, పూలవనాల్లో తిరిగే ఆ ముచ్చువెధవ, యీ భయంకరారణ్యంలో ఒంటరిగా ఎక్కడికీ పోలేడు," అన్నాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

అందరూ కలిసి దుర్ముఖుడు పారిపోయిన వైపుకు బయలుదేరబోతున్నంతలో దూరాన్నుంచి, ఒక చావుకేకా, ఆ వెంటనే, ''ఒరే, తొందరగా బాణం కొట్టు. నేను ఉదయగిరి రాజును! అర్ధ రాజ్యం నీ కిస్తాను,'' అన్న మాటలూ వినిపించినై.

ఆ గొంతు రాజు దుర్ముఖుడిది! అంగరక్షకుడు కోపంగా అటుకేసి పరిగెత్తుతూ,



''నా కిస్తానన్న అర్ధరాజ్యాన్ని రాజు మరెవడికో ధారపోస్తున్నట్టున్నది; నేను సహించను!'' అంటూ కేక పెట్టాడు.

అంగరక్షకుడు వెళ్ళేసరికి, రాజు దుర్ముఖుడు ఒక పెద్ద చెట్టుకు ఏటవాలుగావున్న కొమ్మ చివరకు పాకిపోతున్నాడు. అతడికి కొంచెం ఎడంగా చిరుతపులి ఒకటి, కోరలుచాచి, చిన్నగా అరుస్తూ ముందుకుపోతున్నది. చెట్టు కింద ఒక ఆటవికుడు బాణం ఎక్కుపెట్టి నిలబడివున్నాడు.

అంగరక్షకుణ్ణి చూస్తూనే రాజు దుర్ముఖుడు పెద్దగా మూలిగి, ''ఒరే, అంగరక్షకా! అలా చూస్తావేం? ఈ పులి నన్ను నోటపట్టకముందే బాణం కొట్టి చంపు. ఆటవిక మందమతి వెధవ నుంచి విల్లంబులు లాక్కో.'' అన్నాడు.

ఆ మాటలకు అంగరక్షకుడు ఏమాత్రం తొణక్కుండా, ''మహారాజా! చిరుతపులిని చంపితే, అర్ధరాజ్యం యిస్తానని కేక పెట్టింది, మీరేనా?'' అని అడిగాడు.

''అవున్రా, నేనే! మీదికి దూక్కముందే పులిని బాణంతో కొట్టు,'' అని దుర్ముఖుడు కీచుమంటూ అరిచాడు.

''మా ఇద్దరికీ రాజ్యాన్ని చెరి సగం పంచేస్తే, యిక మీకు మిగిలేదేమిటి, మహారాజా?'' అన్నాడు అంగరక్షకుడు.

''ప్రాణాలురా! నిండు ప్రాణాలు!'' అంటూ రాజు పెద్దగా అరిచాడు.

ఆటవికుడు దుర్ముఖుడి కేసీ, తన పక్కనే నిలడిన అంగక్షకుడి కేసీ అమాయికంగా ఓమారు చూసి, ''నాకు రాజ్యాలూ వద్దు, అర్ధరాజ్యాలూ వద్దు, ఐదువరహాలిస్తే చాలు!'' అంటూ చిరుతపులి, దుర్ముఖుడి మీదికి దూకబోతున్నంతలో, గురిగా దానికేసి బాణం కొట్టాడు.

బాణం వచ్చి డొక్కలో తగలగానే గర్జిస్తూ చిరుతపులీ, దాని పంజాదెబ్బకు కొమ్మ పట్టువిడిచిన రాజు దుర్ముఖుడూ కలిసికట్టుగా, పై నుంచి దభీమంటూ కిందికివచ్చి పడ్డారు. —(ఇంకావుంది)





# భల్లూక మాంత్రికుడు

## 9

[ ఏనుగు వెంటబడగా, అంగరక్షకుడు పరిగెత్తుతూ ఉగ్రదండుడి వద్దకు వచ్చే సమయంలో, రాజు దుర్ముఖుడు మూర్ఛ నుంచి లేచి, అరణ్యంలోకి పారిపోయాడు. అక్కడ అతడి మీదికి ఒక చిరుతపులి దూకబోతూండగా, ఆటవికు డొకడు పులిని బాణంతో కొట్టాడు. ఆ దెబ్బకు గాయపడిన పులితోపాటు, దుర్ముఖుడు కొమ్మలమీదినుంచి కిందపడ్డాడు. తరవాత—]

రాజు దుర్ముఖుడూ, డొక్కలో బాణం గుచ్చుకున్న చిరుతపులీ కొమ్మమీది నుంచి కింద పడటం చూస్తూనే అంగరక్షకుడు ఎగిరి ఒక గంతువేసి, ఆటవికుడితో, "ఒరే, అలా చూస్తావేం? మరొక బాణం కొట్టి చిరుతపులిని చంపెయ్యి," అంటూ కేక పెట్టాడు.

. దుర్ముఖుడు చెట్టు మీది నుంది ఒక పొద మీదపడి, అక్కడి నుంచి నేలపైకి జారటం వల్ల, అతడికి బలమైన దెబ్బ లేమీ తగలలేదు.

అంగరక్షకుడు చిరుతపులి కేసి ఓమారు చూసి, "మహారాజా, బలమైన బాణం దెబ్బతిన్నా, పులి యింకా మీ మీదికి దూకే ప్రయత్నంలోనే వున్నట్టున్నది, ఇప్పుడేం చేయటం?" అన్నాడు.

రాజు దుర్ముఖుడు పులినుంచి దూరంగాపోయి, కసిగా అంగరక్షకుడి



కేసి చూస్తూ, "ఒరే, నీ కేమన్నా మతి పోయిందా ఏం! వెంటనే కత్తి దూసి దాని తల నరుకు. ఈ ఆటవికుడు మన రాజ్యం వాడేనా? ఒట్టి బుద్ధిహీనుడిలా వున్నాడు," అన్నాడు.

ఇప్పుడు చిరుతపులికి కొంచెం దాపులలో వున్నవాడు దుర్ముఖుడే. అది కోరలు చాచి ఒక్కొక్క అడుగేవేస్తూ, అతడి కేసి బయలుదేరింది. అప్పటివరకూ అంతా మౌనంగా చూస్తూ నిలబడివున్న ఆటవికుడు ఏదో గ్రహించినవాడిలా చిన్నగా నవ్వి: "నేనెంత బుద్ధిహీనుణ్ణయినా బంగారు వరహాలంటే తెలియనివాణ్ణి కాదు. నా కిస్తానన్న ఐదు వరహాల మాటేమిటి?" అని బాణాన్ని అంగరక్షకుడి కేసి ఎక్కుపెట్టి, "నువ్వీయన్ని మహారాజా అని పిలుస్తున్నావు. అదేమైనా హాస్యమా లేక ఆయన నిజంగానే మహారాజా?" అని అడిగాడు.

చిరుతపులి మరొకసారి రాజు దుర్ముఖుడి మీదికి దూకే ప్రయత్నం చేస్తున్నదని గమనించిన అంగరక్షకుడు కత్తి దూసి రాజుతో, "మహారాజా, మీరు కూడా ఒరలోంచి కత్తి లాగండి. దెబ్బ తిన్న ఆ చిరుతపులిని మనిద్దరం ఏకమై చంపటం ఏమంత కష్టం కాదు," అంటూ ఒకడుగు ముందుకు వేశాడు.

ఆ వెంటనే ఆటవికుడు బాణాన్ని అంగరక్షకుడి ముందు భూమిలో గుచ్చుకునేలా కొట్టి, మరొక బాణం తీసి అతడి కేసి ఎక్కుపెట్టి, "నేనడిగినదానికి జవాబు చెప్పావుకాదేం? నా బాణం దెబ్బ నీ ప్రాణాలు తీస్తుంది. చిరుతపులి, నువు రాజనే వాడి గొంతు కొరికి, ఏ వాగు ఒడ్డుకో పోయి గాయం బాధతో చచ్చిపోతుంది," అన్నాడు.

రాజు దుర్ముఖుడు కత్తి దూసి చిరుతపులి కేసి ఒకడుగు వేయబోయినవాడల్లా ఆఖరిక్షణంలో భయపడి, వెనక్కు నడుస్తూ, "ఒరే, ఆటవికుడా! నేను ఉదయగిరి రాజునైన దుర్ముఖుణ్ణి. విధి

వక్రించి యిలా అరణ్యాలు పట్టి యాతనల పాలయాను. నీ బాణం దెబ్బ చిరుతపులి ఆయువుపట్టులో తగిలినట్టు లేదు. మరొక బాణంతో దాన్ని చంపు.'' అన్నాడు.

''ముందే అలా సెలవిచ్చారుకాదేం? సైన్యం వెంట లేకుండా అరణ్యంలోకి రావటం పెద్ద పొరబాటు, మహారాజా!'' అంటూ ఆటవికుడు బాణాన్ని అంగరక్షకుడి దిక్కునుంచి, చిరుతపులి కేసి తిప్పి వదలబోయేంతలో అది, గట్టిగా ఖాండ్రించి రాజు కేసి దూకింది. ఆటవికుడు వదిలిన బాణం గురి తప్పి, చెట్టు బోదెకు గుచ్చుకున్నది.

రాజు దుర్ముఖుడు పులి తన మీదికి లంఘించబోయేంతలో ఒక చావు కేక పెట్టి, వెనుదిరిగి పరుగు పుచ్చుకున్నాడు. చిరుతపులి అతడి వెంట బడింది. అలా వాళ్లు చెట్లల్లో కొద్ది దూరం పరిగెత్తేంతలో, అటుకేసి వస్తున్న రాక్షసుడు ఉగ్రదండుడు చప్పున రాజును ఒక చేత్తో పట్టుకుని ఆపి, ''వెధవ చిరతపులిని చూసి భీరువులా పరిగెత్తుతున్నావా? నీ వేమన్న రాజువు?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు నిలువెల్లా వణికిపోతూ ఏదో అనబోయేంతలో గాయం బాధతో రెచ్చిపోయి వున్న పులి వేగంగా



అతణ్ణి సమీపించింది. ఉగ్రదండుడు చిరుతపులిని కాలితో పైకి ఎగిరేలా తన్ని, అది కిందపడబోయేంతలో దాని మెడ పట్టుకుని, ''దేశాన్ని పాలించే నీ కన్న అరణ్యాల్లో తిరిగే యీ క్షుద్రజంతువే ఎక్కువ ధైర్యశాలిలా వున్నది,'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు, రాక్షసుడి పట్టు నుంచి బయట పడేందుకు గింజుకుంటూ, ''అవును, ఉగ్రదండా, ఇందులో ఆశ్చర్యమేమున్నది? నేను రాజును, అది నీ వన్నట్టు కేవలం క్షుద్రజంతువు,'' అన్నాడు.

ఆ మరుక్షణం దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి ఇద్దరు అనుచరులూ,

బతికున్నంతవరకూ యిలా భల్లూకంగానే వదిలివేయటమో చేసి తీరుతాడు. అప్పుడు నేనేం కాను?'' అన్నాడు.

''అదీ నిజమే! మరి దారేమిటి?'' అన్నాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

అంగరక్షకుడు వణుకుతూ ఉగ్రదండుడి ముందుకు వచ్చి నిలబడి, ''దండ మహారాజా, నా సలహా ఒకటున్నది. మహారాజుగారిని ప్రాణాలతోనే ఆ మాంత్రికుడి దగ్గిరకు తీసుకుపోవటం బావుంటుంది. ఆ తల సంగతేదో అక్కడ ఆ మాంత్రికుడే చూసుకుంటాడు,'' అన్నాడు.



''ఈ ఆలోచన మహబావుంది. తలారి భల్లూకా, ఏమంటావు?'' అని అడిగాడు ఉగ్రదండుడు.

''ఇంత మహారణ్యం దాటించి, యీ రాజును భల్లూకమాంత్రికుడి దగ్గిరకు తీసుకుపోవటం అంత తేలిగ్గాదు. ఇతడు ఏక్షణాన్నయినా, నా నుంచి పారిపోవచ్చు. ఇంతకుముందే అలాంటి ప్రయత్నం చేసి, చిరుతపులి పుణ్యమా అని మళ్ళీ దొరికాడు. ఇక యితణ్ణి వదలను,'' అంటూ తలారి భల్లూకుడు రాజు దుర్ముఖుడి కేసి ఒకడుగు వేశాడు.

దుర్ముఖుడు కీచుమంటూ అరిచి, ఉగ్రదండుడి వెనక్కుపోయి నిలబడుతూ, ''ఉగ్రదండ మహాప్రభో శరణు! శరణు!'' అన్నాడు.

''అభయం యిచ్చాను భయపడకు!'' అని, ఉగ్రదండుడు, తలారిభల్లూకుడితో, ''భల్లూకా, యీ రాజును నీ వెంట మాంత్రికుడి దగ్గిరకు తీసుకు రావటానికి నేను బాధ్యత వహిస్తాను. నువ్వు, నీ వాహనమైన మొండి తొండపు ఏనుగు మీద బయలుదేరు. ఈ రాజుతోపాటు వెంట నేను నడుస్తాను,'' అన్నాడు.

''ఘాట తప్పవుగదా, ఉగ్రదండా? ఇదే పోయి, నా వాహనానికి కట్టిన తాళ్ళు నరికి, యిక్కడి కొస్తాను,'' అంటూ తలారి భల్లూకుడు బయలుదేరాడు.



అతడికి వెనగ్గా ఆటవికుడు విల్లుకు అంబు తొడిగి గబగబా నడుస్తూ, "ఓయ్, తలారి భల్లూకం! తొందరపాటులో అజాగ్రత్తగా ఆ ఏనుగును సమీపించకు. మాటల ధోరణిలోపడి, ఆ ఏనుగూ, ఒక సింహం చిన్నగా ఘీంకార, గర్జనలు చేస్తూండటం మీరు వినలేదు. ఈ పాటికి ఏనుగు కుంభస్థలాన్ని సింహం బదాబదలు చేసినా చేసి వుండొచ్చు," అన్నాడు.

"నిజమా!" అంటూ తలారిభల్లూకుడు అదిరిపడి, పరుగు పరుగున ఏనుగు వున్న చోటుకు చేరేంతలో, ఆటవికుడు చెప్పినట్టుగానే, కాళ్లు బంధింపబడిన ఏనుగు మీద పడేందుకు సింహం ఒకటి, దాని చుట్టూ గిరికీలు తిరుగుతూ, మధ్య మధ్య పంజాతో ఏనుగు తలమీద కొట్టేందుకు ప్రయత్నిస్తున్నది. ఏనుగు ఘీంకరిస్తూ తెగిన తొండాన్ని సింహంకేసి చాచి, కాళ్ల బంధాలను తెంచుకునేందుకు నానా తంటాలూ పడుతున్నది.

తలారి భల్లూకుడు యిది చూస్తూనే రౌద్రంగా ఒక కేకపెట్టి, "ఆహా, నా అంత వాడి వాహనాన్నే తిన చూస్తున్నావా?" అంటూ గండ్రగొడ్డలి ఎత్తి సింహం మీదికి దూకాడు.

సింహం యీ వింత ఎలుగుబంటును చూసి, చిన్నగా బెదిరి పక్కకు రెండడుగులు వేసింది. కాని అంతలోనే తలారి భల్లూకుడు గండ్రగొడ్డలితో వేగంగా వచ్చి పైబడబోయేంతలో, కోపంతో రెచ్చిపోయి, గర్జిస్తూ అతడి మీదికి ఎగిరింది. ఆ సమయంలో తలారి భల్లూకుడు విసిరిన గండ్రగొడ్డలి దెబ్బ గురితప్పి దాని వెనక కాళ్ళలో ఒకదానికి తగిలింది. వెంటనే సింహం కిందపడి లేచి, మరొకసారి తలారి భల్లూకుడి మీదికి లంఘించబోయేంతలో వెనక వున్న ఆటవికుడు గురిగా దాని గుండెల్లో తగిలేలా బాణం వదిలాడు.

బాణం దెబ్బ తింటూనే సింహం పక్కకు పడిపోయింది. అది భీకరంగా

గర్జిస్తూ తిరిగి లేవబోయేంతలో తలారి భల్లూకుడు, గండ్రగొడ్డలితో దాని కంఠం మీద బలంగా కొట్టాడు.

సింహం లేచినిలబడే ప్రయత్నం చేసి, కంఠం సగం తెగిపోవటంతో పక్కకు పడిపోయి గిలగిలా తన్నుకో సాగింది. గొడ్డలి ఎత్తి మరోసారి కొట్ట బోతున్న తలారి భల్లూకుడి చేయి పట్టు కుని అటవికుడు, "అహా, భల్లూకయ్యా, ఏమి నీ సాహసం! సింహం చచ్చిన దాని కిందే లెక్క. మరోసారి గండ్రగొడ్డలితో కొట్టి, దాని చర్మం పాడుచెయ్యకు. దాని జూలూ, చర్మం నాక్కావాలి," అన్నాడు.



తలారి భల్లూకుడు ఆయాసపడుతూ అటవికుడి కేసి చూసి, "నీ బాణం గురి కూడా అమోఘమైనది. నీవు ఒంటరిగాడి వైతే, యీ అరణ్యం వదిలి నా వెంట చంద్రశిలానగరం రారాదా! అక్కడ నీకు రాజుగారితో చెప్పి, నా కింద ఉపతలారి నౌకరీ యిప్పిస్తాను," అన్నాడు.

అటవికుడు తలవంచి, "నేను, నీ వెంట నగరానికి వస్తాను. చేస్తే, నీలాంటి మహాసాహసి దగ్గిరే ఉద్యోగం చేయాలి," అన్నాడు.

తలారి భల్లూకుడు ఏదో అనబోయేం తలో రాక్షసుడు ఉగ్రదండుడు, మిగతా వాళ్ళతో కలిసి అక్కడికి వస్తూ, "ఇక్కడ యింత గొడవ జరిగిపోయిం దన్నమాట! తలారి భల్లూకుడికి తగిన సేవకుడే దొరికాడు," అన్నాడు.

ఆ మాటలకు ఉబ్బొంగిపోయిన తలారి భల్లూకుడు గండ్రగొడ్డలి పైకెత్తి, "ఒరే, అడవిదొంగ నాగమల్లూ! నువ్వూ, నీ నేస్త గాళ్ళూ కలిసి తక్షణం నా వాహనం కాళ్ళకు కట్టిన తాళ్ళు ఊడదీయండి," అన్నాడు.

"తలారి భలూక దొరా, అలాగే చేస్తాం. కాని, ఏనుగు కట్లు పూడగానే మమ్మల్ని తొక్కి చంపకుండా కాపాడే బాధ్యత మీది," అన్నాడు దొంగల నాయకుడు నాగమల్లు.

''నా చెప్పుచేతల్లో వున్న వాహనం, నా అనుమతి లేకుండా యితర్లకు హాని కలిగించటమా?'' అంటూ తలారి భల్లూకుడు, అడవి దొంగలు ఏనుగు కాళ్ళ కట్లు విప్పుతూండగానే, ఆ తాళ్లతో దాని మెడకు గట్టిగా ఉచ్చు బిగించి, దాని వీపు మీద ఎక్కి కూర్చున్నాడు.

మొండి తొండపు ఏనుగు తన బంధపు తాళ్ళన్నీ ఊడిపోగానే ఘీంకరిస్తూ లేచి నిలబడింది. తలారి భల్లూకుడు, ఆటవి కుణ్ణి చేయెత్తి పిలుస్తూ, ''ఒరే, ఆటవిక సేవకా, నువ్వీ అరణ్యమార్గాలన్నీ బాగా ఎరిగినవాడివిగదా? వచ్చి, నా వాహనం కుంభస్థలం మీద కూర్చుని, చంద్రశిలా నగరానికి దారి తియ్యి,'' అని రాక్షసుడు ఉగ్రదండుడితో, ''ఆ రాజు దుర్ముఖుణ్ణి పారిపోకుండా, నా వెంట తెచ్చే బాధ్యత నీది, అవునా?'' అని అడిగాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు తల ఊపుతూ, ''నాకూ, నువ్వనే భల్లూక మాంత్రికుడితో పని వున్నది. మొండి ఏనుగు మీద ముందుండి దారి తియ్యి. ఇక్కడవున్న వాళ్ళం అందరం నీ వెంట వస్తాం. ఇష్టం లేనివాళ్ళు అరణ్యం దాటగానే, ఎవరి దారిన వాళ్ళు వెళ్ళి పోవచ్చు,'' అన్నాడు.

''భేషైన మాట! రాజు దుర్ముఖుడు తప్ప, మిగతా వాళ్ళందరికీ యీ క్షణానే స్వేచ్ఛ యిస్తున్నాను; కావాలంటే యిక్కడి అరణ్యమృగాల మధ్య హాయిగా బతకవచ్చు,'' అంటూ తలారి భల్లూకుడు ఏనుగును అదిలించి, ముందుకు పరిగెత్తించాడు.

మొండితొండపు ఏనుగు అలా పరుగు పుచ్చుకోవటంతో, ఉగ్రదండుడూ మిగతా వాళ్ళూ కొంచెం వెనకబడిపోయారు. తలారి భల్లూకుణ్ణి, హఠాత్తుగా చెట్ల చాటునుంచి వచ్చిన రెండు ఏనుగులు అడ్డగించినై. వాటి మీద వున్న నలుగురు సైనికులు, ''ఉదయగిరి మహారాజుకూ, జై!'' అంటూ అతడి కేసి బాణాలు వదలసాగారు. —(ఇంకా వుంది)






## 10

[ తలారి భల్లూకుడు, రాజు దుర్ముఖుడి తల నరక్కుండా, ఉగ్రదండుడు కాపాడి, అతణ్ణి మాంత్రికుడి దగ్గిరకు తీసుకువచ్చే బాధ్యత తన మీద పెట్టుకున్నాడు. ఆటవికుడు, తలారి భల్లూకుడి వెంట చంద్రశిలానగరం రావటానికి ఒప్పుకున్నాడు. ముందు పోతున్న తలారి భల్లూకుణ్ణి, ఏనుగుల మీద వచ్చిన నలుగురు అడ్డగించి, బాణాలు కొట్టసాగారు. తరవాత—]

తలారి భల్లూకుడు తన మీదికి వచ్చి పడుతున్న బాణాలను గండ్రగొడ్డలితో అడ్డి, ఎగిరి దూరంగా పోయి పడేలా కొడుతూ, మొండి తొండపు ఏనుగును తనకు సమీపానికి వచ్చిన సైనికుల ఏనుగు పైకి తోలాడు. రెండు ఏనుగులూ ఒకదాని నొకటి ఎదుర్కొని, పెద్దగా ఘీంకరిస్తూ, తొండాలతో కొట్టుకుంటూ, దంతాలతో కుమ్ముకోబోయే సమయంలో, "జై, దిరిసెనవన భైరవా!" అంటూ గండ్రగొడ్డలిని, సైనికుడి ఏనుగు దంతాల పైకి విసిరాడు. గొడ్డలి దెబ్బకు ఏనుగు దంతం ఒకటి అరటి ఊచలా ఫెళ్ళుమంటూ తెగి, అంత దూరాన పోయి పడింది. ఈ గొడవలో ఆటవికుడు ఏనుగు మీది నుంచి కిందపడిపోయాడు.

దంతం విరిగిన ఏనుగు, భల్లూకుడి ఏనుగు ధాటికి తట్టుకోలేక వెనుదిరిగి



పారిపోబోయేంతలో, రెండవ ఏనుగు పైన వున్న సైనికులు ప్రాణ భీతితో పెద్దగా అరిచి, "ఒరే, మనం ఏనుగు మీద వున్న వాడు, ఎలుగుబంటి వేషం వేసిన హాస్యగాడో, వీధిభాగవతుడో అనుకున్నాం. ఇదేదో యుద్ధవిద్యలు నేర్చిన నిజమైన ఎలుగుబంటులాగే వుంది," అంటూ తమ ఏనుగును అదిలించి, వెనక్కు తిప్పారు.

తలారి భల్లూకుడు దిమ్మెరపోయి కింద పడివున్న ఆటవికుడి కేసి ఒకసారి చూసి, తన వాహనాన్ని వేగంగా ముందుకు పరిగెత్తించి, పారిపోజూస్తున్న రెండు ఏనుగులనూ అడ్డగించి, "ఒరే, నేను నిజమైన ఎలుగుబంటునే కాదు; తలలు నరకటమే వృత్తిగా గల తలారి భల్లూకుణ్ణి! కొంచెం సేపైనా మీ ప్రాణాలు నిలవాలంటే, పారిపోయే ప్రయత్నం మాని, నేనడిగేదానికి జవాబు లివ్వండి," అన్నాడు.

సైనికులు తలారి భల్లూకుడి రూపంతో పాటు, వాడి భీకరమైన కంఠ స్వరం కూడా విని, నిలువెల్లా వణికిపోసాగారు.

భల్లూకుడు తన మొండితొండపు ఏనుగును, సైనికుల ఏనుగుల చుట్టూ రెండుసార్లు గిర్రున తిప్పి, గండ్రగొడ్డలితో ఒక ఏనుగు తలను తాకి, సైనికులతో, "ఒరే, ఇప్పుడు చెప్పండి. మీరెవరు? దుర్ముఖ మహారాజుకూ, జై అంటూ అరిచారు. ఆ రాజు తల నాకు తాకట్టులో వున్నది. ఒకవేళ మీరనే దుర్ముఖరాజు రాజ్యం పాలించేవాడుకాక, ఏదైనా పొలం పనులు చేసుకు బతికే అదే పేరు గలవాడా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సైనికుల్లో ఒకడు తల వంచి తలారి భల్లూకుడికి దణ్ణం పెట్టి, "భల్లూక మహారాజా! మేం జేజేలు కొట్టిన రాజుగారు ఉదయగిరిని పాలించే దుర్ముఖులవారు. అయన్ని యీ అరణ్యంలో ఏనుగు వాహనం గల ఎవరో పట్టుకుని బంధించారని తెలిసి, వెతుక్కుంటూ యిటువచ్చాం," అన్నాడు.



ఆ జవాబుకు తలారి భల్లూకుడు ఆశ్చర్యపోతూ, "మీరనే అంత గొప్ప రాజును శత్రువుల నుంచి కాపాడేందుకు నలుగురంటే నలుగురు సైనికులు యింత మహారణ్యం ప్రవేశించారా?" అన్నాడు.

సైనికులు నలుగురూ వెలవెలపోతూ ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు. తలారి భల్లూకుడు యీసారి తన గండ్రగొడ్డలిని దంతం తెగిన ఏనుగు తలపై అనించి, "ఒరే, నిజం చెప్పకపోయారో ముందు యీ ఏనుగు కుంభస్థలం, నా గండ్రగొడ్డలి దెబ్బకు రెండుగా చీలిపోతుంది. తరవాత మీ నలుగురి తలలకూ అదే ఖర్మ పట్టిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే సైనికుల్లో ఒకడు, "భల్లూక మహారాజా! దుర్ముఖరాజుగారి కోటను, సూర్యభూపతి అనే సామంత రాజు ఆక్రమించాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో బతికి బయటపడిన మేము, రాజుగారిని వెతుక్కుంటూ యీ అరణ్య ప్రాంతాలకు వచ్చాం," అన్నాడు.

"ఒరే, మీ రాజభక్తి మెచ్చదగిందే! కాని, మీరెవరికోసం యింత శ్రమపడ్డారో, ఆ రాజు దుర్ముఖుడు, చంద్రశిలా నగరాన్ని ఆక్రమించాలని బయలుదేరి, దారిలో ఒక గొప్ప మాంత్రికుణ్ణి, కాళీవర్మ అనే మహావీరుణ్ణి అవమానించి చిక్కుల్లో పడిపోయాడు. అతడు ప్రాణాలతో ఉదయగిరి నగరం చేరటం అసంభవం. మీరు పోయి మరే రాజు కొలువులోనైనా చేరండి," అన్నాడు తలారి భల్లూకుడు.

ఆ మాటలు అర్థంకాక సైనికులు ఆశ్చర్యపోతున్నంతలో, దుర్ముఖ రాజు అంగరక్షకుడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "తలారి భల్లూక ప్రభో! వెనక వస్తున్న మేమంతా ఏనుగుల ఘీంకారాలు విని, తమ మొండి తొండపు ఏనుగును ఏవైనా అడవి ఏనుగులు అడ్డగించినయ్యేమో అనుకున్నాము," అంటూ నేలమీద భోర్లా పడివున్న ఆటవికుడి కేసి చూసి, "ప్రభో, తమ ఆటవిక సేవకుణ్ణి



ఏనుగులు తొక్కి చంపినట్టుందే!'' అన్నాడు.

తలారి భల్లూకుడు, ఆటవికుడి దాపులకు ఏనుగును నడిపి, ''వాడు చచ్చాడనుకోను. ఏనుగు కుంభస్థలం పైనుంచి పడ్డ పాటుకు మూర్ఛపోయి వుంటాడు. గట్టిగా వీపు మీద చరిచి చూడు,'' అన్నాడు.

అంగరక్షకుడు, ఆటవికుడి వీపు మీద అరచేతితో గట్టిగా కొడుతూ, ''మూర్ఛ నుంచి బయటపడు. నీ యజమాని పిలుస్తున్నాడు,'' అంటూ కేక పెట్టాడు.

ఆ వెంటనే ఆటవికుడు తుళ్ళిపడి లేచి, పక్కనే వున్న విల్లంబులను చేతికి తీసుకుంటూ, ''భల్లూకయ్యను అడ్డగించిన వాళ్ళెక్కడ?'' అంటూ సైనికుల కేసి బాణం ఎక్కుపెట్టాడు.

''అయ్యా, అంగరక్షకా! రక్షించు! రక్షించు!'' అంటూ సైనికులు ఏనుగుల మీదినుంచి కిందికి దూకేశారు.

అంగరక్షకుడు ఆశ్చర్యపోతూ సైనికుల కేసి పరీక్షగా చూసి, ''మీరా! నగరం వదిలి అరణ్యాని కెందుకొచ్చారు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు తలారి భల్లూకుడు పెద్దగా నవ్వి, ''అదంతా పెద్ద కథ. మీ దుర్ముఖరాజు కోటను ఎవడో సామంతుడు ఆక్రమించేశాడు. అయినా, కొద్ది సేపట్లో తలనే పోగొట్టుకోపోతున్న వాడికి, రాజ్యం వుండి మాత్రం ప్రయోజనం ఏమిటి?'' అన్నాడు.

అంతలో అక్కడికి ముందు దుర్ముఖ రాజూ, వెనకగా రాక్షసుడు ఉగ్రదండుడూ, అడవి దొంగలూ వచ్చారు. దుర్ముఖుడు వస్తూనే తన సైనికులను గుర్తించి, ''ఒరే, మీరీ అరణ్యాని కెందు కొచ్చారు?'' అని అడిగాడు.

సైనికులు జవాబివ్వబోయేంతలో తలారి భల్లూకుడు ఏనుగు మీదినుంచి దిగి, దుర్ముఖుడితో, ''దుర్ముఖా! ఇదే ప్రశ్న నీ అంగరక్షకుడూ వాళ్ళను



అడిగాడు. ఏమంత విచారించవలసిన సంగతి కాదు. నీ కోట సామంతరాజు వశమైపోయింది!'' అన్నాడు.

''ఎవడా సామంతుడు?'' అంటూ రాజు దుర్ముఖుడు కత్తి దూసి, సైనికులతో, ''నాకున్న సామంతుడొకడేకదా, సూర్యభూపతి! వాడే నా, కోట ఆక్రమించింది? కోటను మరొకళ్ళ పరంచేసి, పిరికిపందల్లా పారిపోయి వచ్చినందుకు, మీ తల లిప్పుడే నరకబోతున్నాను,'' అంటూ సైనికుల కేసి దూకబోయాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు చప్పున ఒకడుగు ముందుకు వేసి, దుర్ముఖుడి చేయి పట్టుకుని ఆపి, ''దుర్ముఖా, తొందర పడకు. ముందు తలారి భల్లూకుణ్ణించీ, మాంత్రికుణ్ణించీ నీ తల కాపాడుకునే ప్రయత్నం చెయ్యి. ఆ తరవాత నీ కోట, నీ వశమయేందుకు, మేం అందరం సాయం చేస్తాం,'' అన్నాడు.

ఆ మాటలతో దుర్ముఖుడు స్థిమితపడి, ఉగ్రదండుడి రెండు చేతులూ పట్టుకుని, ''ఉగ్రదండ మహాప్రభో! నాకు చావే తప్పకపోతే, నన్ను రాజ్యం ఏలే రాజుగానే చావనివ్వండి. మీ సాయంతో దుష్టుడైన ఆ సామంతుడి తలను కోట బురుజుకు వేళ్ళాడదీసి, సంతోషంగా తల నరికించుకునేందుకు ఆ భల్లూక మాంత్రికుడి దగ్గిరకు వస్తాను,'' అన్నాడు.

దుర్ముఖుడి దుఃఖం చూసి రాక్షసుడు ఉగ్రదండుడికి చాలా జాలి కలిగింది. అతడు తలారి భల్లూకుణ్ణి సమీపించి, "ఏం, తలారి భల్లూకా! దుర్ముఖుడు కోరిందాంట్లో తప్పేంలేదు, అలాగే చేద్దామంటావా?'' అని అడిగాడు.

తలారి భల్లూకుడు రెండు మూడు క్షణాలపాటు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత అక్కడ వున్న వాళ్ళందరి కేసీ ఓసారి కన్నార్పకుండా చూసి, ''మీరందరూ కలిసి నన్ను మోసపుచ్చాలని చూడటం లేదుకదా?'' అంటూ వేళ్ళతో



గొడ్డలి పదునును పరీక్షించి చూడ సాగాడు.

భల్లూకుణ్ణి కోపంతో ఒళ్ళు మరిచిపోక ముందే శాంతపరచటం మంచిదని, ఉగ్రదండుడు చిరునవ్వు నవ్వుతూ అతడి భుజం మీద చేయి వేసి, "తలారి భల్లూకా, నీ గండ్రగొడ్డలి పదునెలాంటిదో మేం అందరం ఎరిగిందే! భల్లూక మాంత్రికుడు తెమ్మన్న తల, రాజు దుర్ముఖుడిదా లేక రాజ్యం పోగొట్టుకున్న దుర్ముఖుడిదా?" అని అడిగాడు.

తలారి భల్లూకుడు ఆ ప్రశ్న అర్థం కాని వాడిలా విసుగ్గా తలాడిస్తూ, "ఉగ్ర దండా, నువ్వేదో మడత పేచీ మాటలతో, ధర్మ సందేహాలేవో రేపుతున్నట్టున్నది. అవునా? చెప్పదలిచిందేమిటో సూటిగా చెప్పు." అన్నాడు.

"అయితే విను, భల్లూకా! ఈ దుర్ముఖ రాజును రానున్న ప్రాణగండంకన్న, పోయిన రాజ్యాన్ని గురించిన చింత ఎక్కువగా బాధిస్తున్నది. కనక, ద్రోహి అయిన ఆ సామంతు సూర్యభూపతిని కోటలోనుంచి వెళ్ళగొట్టి, లాంఛన ప్రాయంగా కోటా, దానితోపాటు ఉదయ గిరిరాజ్యం రాజు దుర్ముఖుడిదే అనిపించి, ఆ తరవాత అతణ్ణి మాంత్రికుడి దగ్గిరకు తీసుకుపోదాం," అన్నాడు.

రాజు దుర్ముఖుడు చేతులు రెండూ జోడించి, "తలారి భల్లూక ప్రభో! కొద్ది గంటల కాలంలో యీ లోకం విడవనున్న, నా ఆఖరి కోర్కెను కాదనకండి," అన్నాడు.

తలారి భల్లూకుడు అంగీకార సూచకంగా తలాడించేంతలో, ఆటవికుడు అంబు నొకదాన్ని చెట్టు బోదెకు ఠక్ మంటూ తగిలేలా వదిలి, "ఆహాఁ, భల్లూకయ్యా, ఆ సామంతును నా బాణం దెబ్బకు వదలండి. అరణ్యంలో వేటాడి బతికే నాబోటివాళ్ళనుంచి కొట్టినపిట్టకూ, జంతువుకూ, వాడు పన్ను వసూలు చేశాడు," అన్నాడు.

ఆ వెంటనే దొంగల - నాయకుడు నాగమల్లు కత్తి దూసి పైకెత్తి పట్టుకుని, "ఆ సూర్యభూపతి అనే సామంతు, అన్నిటికీ తెగించి అరణ్యంలో దారులు కొట్టుకుని బతికే మానుంచి కూడా, దోపిడీ సొమ్ములో సగభాగం వసూలు చేసుకు రమ్మని తన సైనికుల్ని పంపుతూండేవాడు. ఆ దుర్మార్గుడితో పోల్చితే, యీ దుర్ముఖ రాజుగారు ధర్మరాజంతవారు," అన్నాడు.

"పదండి! ఇంతకూ ఆ ఉదయగిరి నగరం ఎంత దూరంలో వున్నది?" అన్నాడు తలారి భల్లూకుడు.

"అడ్డ దారిన అంతా అరగంట ప్రయాణం. నే ముందుండి దారి తీస్తాను. మన మొండితొండపు ఏనుగు కుంభస్థలం మీద ఎక్కి కూర్చోమని సెలవా, తలారి భల్లూకయ్యా?" అన్నాడు ఆటవికుడు.

తలారి భల్లూకుడు సరే అంటూ తల వూపి, ఏనుగు పైన ఎక్కి కూర్చున్నాడు. రాక్షసుడు ఉగ్రదండుడు, రాజు దుర్ముఖుణ్ణి భుజాలు పట్టుకుని పైకెత్తి, దంతం విరిగిన ఏనుగు పైన కూర్చోబెడుతూ, భల్లూకుడితో, "తలారి భల్లూకా, నీ అనుమతితో దుర్ముఖుణ్ణి ఏనుగు మీద ఎక్కిస్తున్నాను. కొద్ది క్షణాలపాటైనా తిరిగి రాజు కానున్నవాడికి, ఆ మాత్రం మర్యాద అవసరంగదా!" అన్నాడు.



రాజు దుర్ముఖుడితో పాటు యిద్దరు సైనికులు ఒక ఏనుగు మీదా, దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి అనుచరులూ, మిగిలిన ఇద్దరు సైనికులూ మరొక ఏనుగు మీదా ఎక్కి, ఆటవికుడు దారి తీయగా అందరూ ఉదయగిరి నగరం కేసి బయలుదేరారు. రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను భుజాన పెట్టుకుని పెద్ద పెద్ద అంగలు వేస్తూ, వాళ్ళ వెనకగా నడవసాగాడు.

అరగంట తరవాత అరణ్యం దాటి వాళ్ళు ఒక పెద్ద మైదాన ప్రదేశంలో ప్రవేశించారు. ఎదురుగా ఒక పెద్ద కోటా, దానికి వెనకగా మేడలూ, మిద్దెలతో

నగరం వాళ్ళ కంటబడింది. కోటను చూస్తూనే రాజు దుర్ముఖుడు విచారంగా ముఖం పెట్టి, తలారి భల్లూకుడితో, "భల్లూక ప్రభో! ఆ సామంతు దుర్మార్గుడి దగ్గిర యిప్పుడు కొంత అశ్వసేనా, కాల్బలం వుంటుందిగదా? అంత సేనను, మనమంతా కలిసి పదిమందిమైనా లేము —ఎలా జయించటం?" అన్నాడు.

"ఆహాఁ, ఆ అనుమానం యిప్పుడా నీకు కలగటం!" అంటూ తలారి భల్లూకుడు వెనక వస్తున్న ఉగ్రదండుణ్ణి కేకవేసి పిలిచి, దుర్ముఖుడి కలిగిన సందేహాన్ని గురించి చెప్పాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను గట్టిగా నేలకు కొట్టి, "తలారి భల్లూకా! నీ గండ్రగొడ్డలీ, నా రాతిగదా ఎంతమంది శత్రుసైనికులనైనా హతమార్చగలవు. కాని, ఎక్కువ రక్తపాతం లేకుండా, ఆ కోట నాక్రమించిన సామంతుణ్ణి పట్టుకుని తలకొట్టే పథకం ఏదైనా వుంటే బాగుండును," అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించే లోపలే దొంగ నాగమల్లు ఏనుగు మీద లేచి నిలబడి, "అయ్యా, అలాంటి పథకం గురించి యిందాకటినుంచీ నేనాలోచిస్తూనే వున్నాను. నేనూ, నా అనుచరులిద్దరం ముందు పోయి, దుర్ముఖరాజు గారిని బందీగా పట్టుకొస్తున్నాం, ఏం బహుమతి యిస్తారని, ఆ సామంతును అడుగుతాం. అప్పుడు అతడే స్వయంగా కొద్దిమంది అంగరక్షకులతో మన దగ్గిరకు రావచ్చు," అన్నాడు.

"ఓఁ, భేషైన ఉచ్చు అల్లావు, నాగమల్లూ! ఊఁ, బయలుదేరు," అన్నాడు ఉగ్రదండుడు.

దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి అనుచరులూ ఏనుగును దౌడు తీయిస్తూ, కోట కేసి కొద్ది దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా కోట ద్వారం బార్లా తెరుచుకున్నది. లోపలినుంచి బిలబిలమంటూ కొందరు అశ్వికులూ, సైనికులూ బయటికి వచ్చారు. —(ఇంకా వుంది)






## 11

[రాజు దుర్ముఖుడు అరణ్యాలు పట్టి తిరుగుతూండగా, అతడి కోటను సామంతరాజు ఆక్రమించేశాడు. తన తల భల్లూకమాంత్రికుడి పరం అయేముందు కొద్ది క్షణాలపాటైనా, తాను తిరిగి రాజు కావాలని అతడు కోరాడు. తలారి భల్లూకుడూ, ఉగ్రదండుడూ వెళ్లేసరికి, కోట లోపలినుంచి కొందరు అశ్వికులూ, సైనికులూ బయిటికి వచ్చారు. తరవాత—]

ఈటెలు పైకెత్తి పట్టుకుని వస్తున్న అశ్వికుల్నీ, వాళ్ళ పక్కనే కత్తులు దూసి నడుస్తున్న కాల్బల సైనికుల్నీ చూసి దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి యిద్దరు అనుచరులూ భయకంపితులై పోయారు. వాళ్ళతో పాటు ఏనుగు మీద వున్న దుర్ముఖుడి సైనికులు మాత్రం ఒక క్షణకాలం నివ్వెరపోయి, ఏమి చేయటమా అని గుసగుసలు ప్రారంభించారు.

నాగమల్లు అంతలోనే తేరుకుని, తన అనుచరులతో, "ఒరే, యింతమంది సామంతుడి సైనికులు యుద్ధసన్నద్ధులై ఒక్కసారిగా మనమీదికి వస్తారనుకోలేదు. అయినా, మనకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు, నా మాట నమ్మండి. తలారి భల్లూకుడూ, మహారాక్షసుడు ఉగ్రదండుడూ మన వెన్నుకాచే వున్నారు," అన్నాడు.



"మరి, ఏనుగును వెనక్కు తిప్ప మంటావా, మల్లూ?" అని దొంగల్లో ఒకడు అడిగాడు.

"ఊహుం, అలా చేస్తే అందరి దృష్టిలో మనం ఒట్టి చవట వెధవలమైపోతాం. నేను వేసిన పథకం ఏమాత్రం పారుతుందో ప్రయత్నం చేసి చూస్తాను. వికటిస్తే మనను కాపాడేందుకు భల్లూకుడూ, రాక్షసుడూ వుండనే వున్నారు గదా," అన్నాడు నాగమల్లు.

"అయితే, ఆ సామంతుడి సైనికులు సమీపించకముందే ఏదో ఒకటి చేసెయ్యి," అని ఒక దొంగ గుసగుసలాడుతున్న సైనికులతో, "ఒరే, ఏమిటి మీ మంతనాలు! పారిపోయి శత్రుపక్షంలో చేరాలనుకుంటున్నారా? డొక్కలు చీరేయగలను," అంటూ కత్తి ఎత్తాడు.

నాగమల్లు కోపంగా ఒకసారి ఏనుగు మీద వున్న సైనికు లిద్దరికేసీ చూసి, చప్పున తలపాగా విప్పి, గాలిలో రెపరెపలాడిస్తూ, తమ కేసి వస్తున్న సామంతుడి సైనికులతో, "మిత్రుడుగా వస్తున్నాను. మీరున్న చోటనే ఆగండి! మీ రాజుగారెక్కడ? మేం పాతరాజు దుర్ముఖుణ్ణి ప్రాణాలతో బంధించి తెచ్చాం. ఏదైనా మంచి బహుమానం యిస్తే, అతణ్ణి ఒప్పచెప్పి, మా దారిన మేం పోతాం," అన్నాడు.

ఆ మాటలు వింటూనే, వాళ్ళను సమీపిస్తున్న అశ్వికులూ, సైనికులూ ఆగిపోయారు. అశ్వికుల నాయకుడు మిగతా వాళ్ళనుంచి వేరుపడి, కొంచెం ముందుకు వచ్చి, "ఇందులో ఏదైనా మోసం లేదు గదా? కోట గోడల మీదినుంచి మీరంతా అరణ్యం దాటి రావటం మా రాజుగారూ, మంత్రిగారూ చూస్తూనే వున్నారు," అన్నాడు.

"మోసం చేయదలిస్తే, పట్టపగటివేళ యింత కొద్దిమందిమి, మీ కోటకేసి రాగలమా? మీరాక్రమించిన కోట పాత యజమాని అయిన దుర్ముఖరాజు బతికి

వుండటం, మీ రాజుకు ఏనాటికైనా ప్రమాదమే. ఆయన ఒకవేళ మాకు తగిన బహుమతి యిచ్చి, దుర్ముఖుణ్ణి కొనటం జరక్కపోతే, తిరిగి అరణ్యం లోకి పోతాం,'' అన్నాడు దొంగ నాగమల్లు.



ఆ మాటలతో అశ్వికుల నాయకుడు ఏమి చేయటమా అన్న ఆలోచనలో ఒకటి రెండు క్షణాలపాటు తల గోక్కుని, అది వీరలక్షణం కాదని గుర్తు రాగా, గట్టిగా ఖాండ్రించి, మీసం మెలితిప్పి, కత్తి పైకెత్తి, ''ఇంతకూ నీవెవరివి? నీ పేరే మిటో చెప్పావు కాదు,'' అన్నాడు ఏమి చేయటమా అని యింకా ఆలోచిస్తూనే.

వీడేదో చురుకు తక్కువ, కొంచెం మందమతి కూడా అయివుంటాడు, అనుకుంటూ నాగమల్లు, తలపాగా గట్టిగా బిగించి, ''నా పేరు నాగమల్లు. అందరూ నన్ను నాగమల్లు దొర అంటూంటారు. అరణ్యంలో కనిపించే ఖరీదైన జంతువుల్నీ, విలువైన మనుషుల్నీ పట్టుకుని, కొనగలవాళ్ళకు అమ్ముతూండటం, నా వృత్తి,'' అన్నాడు.

''అలా చెప్పవేం! నువు చెప్పిన సంగతేదో మా రాజుగారికి విన్నవిస్తాను,'' అంటూ అశ్వికుల నాయకుడు గుర్రాన్ని వెనక్కు తిప్పబోయినవాడల్లా ఆగి, ''నీ వెనక దూరంగా గుంపు కట్టివున్న వాళ్ళల్లో రాక్షసుడిలాంటివాడూ, గొడ్డలి పట్టిన ఎలుగుబంటూ వున్నారు. వాళ్ళు నిజమైన రాక్షసుడూ, ఎలుగుబంటూ ఏనా లేక మా మంత్రిగారన్నట్టు వేషగాళ్లా?'' అని అడిగాడు.

''ఆ సంగతి తెలియాలంటే, మీ రాజుగారే స్వయంగా యిక్కడికి రావటం మంచిది. వారి చేతి మీదుగానే బహుమతి డబ్బు తీసుకుని, పాత దుర్ముఖరాజును వారికి ఒప్పచెప్పి, రాక్షస, ఎలుగుబంటు వేషధారుల్ని వారికి పరిచయం చేస్తాను,'' అన్నాడు నాగమల్లు చిరునవ్వు నవ్వుతూ.

అశ్వికుల నాయకుడు తృప్తిగా ఓసారి తలాడించి, కత్తి పైకెత్తి సైనికులతో



అశ్వికుల నాయకుడు వాళ్ళకు సంగతంతా చెప్పి, "ఏదో కొంత ధనం బహుమతి యిస్తే, దుర్ముఖరాజును మన పరం చేస్తామంటున్నారు, మహారాజా," అన్నాడు.

దుర్ముఖుడి పేరు వింటూనే సామంతుడు అదిరిపడి, "ఆ రాజు యింకా బతికే వున్నాడా! అరణ్యంలో ఏదో క్రూర మృగానికి ఆహారమైపోయాడని మన వేగులవాళ్ళు తెచ్చిన వార్త అబద్ధం అన్నమాట. మహామంత్రీ, నువు తక్షణం ఆ వేగులవాళ్ల తలలు తీయించెయ్యి," అన్నాడు కోపంగా.

మంత్రి విచారంగా ముఖం పెట్టి, "మహారాజా, ఆ వేగులిద్దరూ ప్రస్తుతం కోటలో లేరు, మళ్ళీ అరణ్యానికి పంపాను. మరో విషయం. దీర్ఘంగా తరిచి చూడగా, వాడు నిజమైన రాక్షసుడనీ, ఆ ఎలుగుబంటు యుద్ధవిద్యలు నేర్చినదై వుంటుందనీ అనుమానం కలుగుతున్నది. అన్నిటికంటె పెద్ద సంశయం ఏమంటే; వాళ్లు బంధించి తెచ్చామనేవాడు రాజు దుర్ముఖుడు కాకపోవచ్చని," అన్నాడు.

ఆ మాటలతో సామంతుడు సూర్యభూపతి కోపంకొద్దీ నిలువెల్లా వణికిపోతూ, "ఈ కోట ఆక్రమించిన తరవాత నిన్ను సలహాదారు పదవి నుంచి

"ఒరే, మీరున్న చోటునుంచి ఒక్క అడుగు ముందుగ్గాని, వెనక్కుగాని వేశారో తలలు నేల రాలగలవు. మంత్రిగారు ఊహించినట్టు వాళ్ళు వేషగాళ్ళే. నే నిప్పుడే పోయి రాజుగారికి సంగతి సందర్భాలు చెప్పి వస్తాను," అంటూ గుర్రాన్ని తెరిచివున్న కోట ద్వారం కేసి పరిగెత్తించాడు.

కోట బురుజు పక్కన నిలబడి అంతా గమనిస్తున్న సామంతుడు సూర్యభూపతీ, అతడి మంత్రీ అశ్వికనాయకుడు తమ దగ్గిరకు రాగానే, "శత్రువుల మీద దాడి చేయటం మాని, వాళ్ళతో మంతనాలాడుతున్నావేమిటి?" అని అడిగారు కోపంగా.

మంత్రి పదవిలాంటి ఉన్నత స్థాయికి తేవటం నాదే పొరపాటు. ఏ సామంత రాజుకో తప్ప, రాజుకు సలహాలివ్వటానికి నువ్వు అర్హుడివి కాదు," అని అశ్విక నాయకుడితో, "మహా సేనానీ! పది మందైనా లేని ఆ చచ్చు వెధవలతో మనకు రాయబారాలేమిటి? మర్యాదగా లొంగిపొమ్మని హెచ్చరించి, లొంగకపోతే చుట్టు ముట్టి పట్టుకుని, కోటలోకి ఈడ్చుకు రా. బహుమానాల సంగతి తర వాత ఆలోచిద్దాం," అన్నాడు.

"వాడు నిజమైన రాక్షసుడైతే ప్రమాదం గద, మహారాజా!" అన్నాడు అశ్వికనాయకుడు బొంగురు పోయిన గొంతుతో.

సూర్యభూపతి గట్టిగా ఓ మారు పళ్లు కొరికి, "నీ వెంట వున్న సైన్యంతో ఒక్క రాక్షసుణ్ణి కాదు, నూరు మంది రాక్షసుల నైనా పట్టి బంధించవచ్చు. నేనే స్వయంగా వస్తాను. ఎక్కడ నా యుద్ధాశ్వం?" అంటూ బురుజు మీది నుంచి గబగబా కిందికి దిగాడు.

సేవకుడొకడు గుర్రాన్ని తీసుకురాగానే సూర్యభూపతి ఎగిరి దాని వీపు మీద కూర్చున్నాడు. మంత్రి అందుబాటులో వున్న మరో గుర్రాన్ని ఎక్కాడు. ముందు సామంతుడూ, పక్కలన మంత్రీ, సేనానీ



బయలుదేరి, కోట ద్వారం దాటి మైదాన ప్రదేశానికి వచ్చారు.

వాళ్ళు రావటం చూస్తూనే దొంగ నాగ మల్లు పట్టలేని ఉత్సాహంతో, "ఆహా, నా పథకం పారింది! రాజైన సామంతుడూ, మంత్రీ, సేనానీ మన వలలో చిక్కబోతున్నారు," అన్నాడు.

"ఈ ముగ్గుర్నీ పట్టినందుకు రాజు దుర్ముఖుడు మనకేదైనా మంచి బహుమానం యిస్తాడంటావా, మల్లూ?" అని అడిగారు దొంగలిద్దరూ.

"బహుమానం ఏమిటి? మీకు దుర్ముఖరాజుగారు ఒక సంస్థానమే ఇచ్చేస్తారు." అంటూ సైనికులిద్దరూ ఒరల్లో



నుంచి కత్తులు దూయబోయి, నాగమల్లు హెచ్చరించటంతో ఆగిపోయారు.

సామంతుడు సూర్యభూపతి, నాగమల్లు ఏనుగును సమీపించి, ''ఒరే, నువు చెప్పినదంతా, మా మహాసేనాని విన్నవించగా, చిత్తగించాను. నా రాజ్యంలో, నా కోట ముందు చేరి, మహారాజునైన నాతో బేరసారాలాడ చూస్తావా? వెంటనే పోయి, ఆ ఏనుగుల మీద వున్న దుర్ముఖుడితో పాటు, వేషగాళ్ళను కూడా పిలుచుకురా. కోట ప్రవేశించాక, నీకూ, ఆ రాక్షస, ఎలుగుబంటి వేషాలు కట్టిన వాళ్ళకూ తగిన బహుమతు లిస్తాను. దుర్ముఖుడి తల కోట కొమ్ముకు కట్టాలో, ద్వారానికి వేళ్ళాడదీయాలో తరవాత నిర్ణయిస్తాను,'' అన్నాడు.

సామంతరాజు ఇలా అనేసరికి, దొంగ నాగమల్లుకు తను వేసిన పథకం పారే అవకాశం లేదని తెలిసిపోయింది. వాడికి అటు దుర్ముఖరాజు మీదగాని, యిటు అతడి కోట ఆక్రమించిన సూర్యభూపతి పైన గాని ప్రత్యేకించి ద్వేషం, గౌరవ భావాలంటూ ఏమీలేవు. సూర్యభూపతి అహంకారంకొద్దీ రాక్షసుడు ఉగ్రదండుణ్ణి గాని, తలారి భల్లూకుణ్ణిగాని అవమానించటం జరిగితే, పెద్ద రక్తపాతం జరిగిపోతుంది. అది జరగటం దొంగ నాగమల్లుకు యిష్టం లేదు.

నాగమల్లు జవాబేమివ్వటమా అని ఆలోచించేంతలో, ఏనుగు మీద వున్న దుర్ముఖుడి సైనికులిద్దరూ చప్పున కత్తులు దూసి, "దుర్ముఖ మహారాజుకూ, జై!'' అంటూ లేచి నిలబడి, సామంతుడితో, ''ఓయ్, సూర్యభూపతీ! నీకు చావు తప్పదు. దుర్ముఖ మహారాజుకు సాయంగా వచ్చిన వాళ్ళు నిజమైన రాక్షసుడూ, మంత్రశక్తులు గల తలారి భల్లూకుడూ!'' అంటూ కేకపెట్టారు.

దుర్ముఖ మహారాజుకూ, జై! అన్న కేక వింటూనే కోపోద్రేకంలో మతిపోగొట్టుకున్న సామంతుడు సూర్యభూపతి,

సైనికులు చెప్పిన తక్కిన మాటలేవీ విని పించుకోకుండా, పక్కనవున్న మంత్రి, సేనానాయకులతో, "ఈ పొగరుబోతులకూ, ఆ వెనక నిలబడి వినోదం చూస్తున్న వేషగాళ్ళకూ నా శక్తి ఎలాంటిదో తెలియజెప్పాలి. వెంటనే కొందరు అశ్వికుల్నీ, కాల్బల సైనికుల్నీ పిలిచి, వీళ్ళను తిరిగి అరణ్యంలోకి పారిపోకుండా చుట్టుముట్టమనండి," అంటూ అరిచి, కత్తి పైకెత్తి, దొంగ నాగమల్లు వున్న ఏనుగుకేసి గుర్రాన్ని ఉరికించాడు.

రానున్న ప్రమాదాన్ని క్షణంలో గుర్తించిన నాగమల్లు, చప్పున ఏనుగును అదిలించి వెనక్కు తిప్పి, ఉగ్రదండుడూ, తలారి భల్లూకుడూ వున్న చోటుకు దాన్ని పరిగెత్తిస్తూ, "తలారి భల్లూక ప్రభో! నా పథకం బెడిసికొట్టింది! సామంతుడు మన మీదికి మొత్తం సైన్యాన్ని ఉసిగొల్పుతున్నాడు," అంటూ పెద్ద కేక పెట్టాడు.

రాజు అవమానించినా, తనలో రాజభక్తి కొరవడ లేదని నిరూపించేందుకు యిదే అవకాశం అనుకుంటూ మంత్రి, గుర్రాన్ని గట్టిగా కొట్టి, నాగమల్లు ఏనుగు వెనక పరిగెత్తిస్తూ, "ఒరే, దేశద్రోహులారా, ఆగండి! మీ అందరినీ సూర్యభూపతి మహారాజు శిరశ్ఛేదాలు చేయించి



గాని వదలరు!" అంటూ వెర్రిగా అరవసాగాడు.

ఈ లోపల సేనానాయకుడు దూరంగా వున్న సైన్యాన్ని ముందుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు. అంతలో ముందు మంత్రీ కొంచెం వెనకగా సామంతుడు సూర్యభూపతీ; ఉగ్రదండుడూ, తలారి భల్లూకుడూ వున్న చోటు చేరారు.

తన కోట ఆక్రమించిన సూర్యభూపతిని చూస్తూనే రాజు దుర్ముఖుడు ఉగ్రుడైపోయి, కత్తి దూసి ఏనుగు మీద నిలబడి, "ఒరే, సామంతు భూపతీ! నేను పరరాజ్యాలను జయించటానికి వెళ్ళిన అదను చూసి, నా కోటనే ఆక్రమిస్తావా?

ఇదుగో, నీ తల నిలువునా నరకబోతున్నాను," అంటూ పక్కనవున్న సైనికులు వారిస్తున్నా వినకుండా, ఏనుగు మీది నుంచి, సామంతుడి గుర్రం మీదికి దూకే ప్రయత్నంలో నేలమీద బోర్లా పడుతూనే, చప్పున లేచి నిలబడ్డాడు.

అది చూస్తూనే తలారి భల్లూకుడు గట్టిగా చప్పట్లు చరుస్తూ, "ఆహా, ఏమి సాహసం! అరణ్యంలో చిరుతపులిని ఎదిరించి నిలబడలేని రాజు దుర్ముఖుడు, యిప్పుడు తన కోట కంటబడి, సింహాసనం గుర్తుకు రాగానే, శత్రువుల మీదికి కుప్పించి దూకుతున్నాడు," అన్నాడు.

తన శత్రువు కిందపడటం చూస్తూనే, సామంతుడు, "ఆహా, వ్రణశేషం, శత్రుశేషం ప్రాణాపాయకరం అన్నారు, పెద్దలు. ఇదె, నీ తల తెగిపడబోతున్నది!" అంటూ కత్తి చాచి, దుర్ముఖుడి కేసి గుర్రాన్ని దూకించాడు.

అదే సమయంలో ఏనుగు మీద తలారి భల్లూకుడి ముందు కూర్చునివున్న ఆటవికుడు బాణం ఎక్కుపెట్టి, "తలారి భల్లూకయ్యకూ, జే!" అంటూ సామంతుడి కేసి వదిలాడు. బాణం గురి తప్పి సామంతు డెక్కివున్న గుర్రం నుదుట గుచ్చుకున్నది. గుర్రం పెద్దగా సకిలిస్తూ వెనక కాళ్ళ మీద లేచింది.

సామంతు సూర్యభూపతి కింద పడబోయిన వాడల్లా, కళ్ళాలు గట్టిగా పట్టుకుని ప్రమాదం తప్పించుకున్నాడు. ఈ లోపల దుర్ముఖుడు, మంత్రిని ఒక్క పిడికిలిపోటుతో గుర్రం మీదినుంచి కిందికి పడగొట్టి, అతడి గుర్రాన్ని ఎక్కి, సామంతుడి కేసి పరిగెత్తించాడు.

తాను శత్రువుల మధ్య చిక్కుకుపోయానని గ్రహించిన సామంతుడు, గుర్రాన్ని కోటకేసి పరిగెత్తిస్తూ, సైనికులను హెచ్చరించసాగాడు. రాజు దుర్ముఖుడు గుర్రాన్ని గట్టిగా అదిలించి, కత్తి పైకెత్తి, "ఒరే, సామంతు భూపతీ, పిరికిపందా, ఆగు! ఆగు!" అంటూ వెంటబడ్డాడు. —(ఇంకావుంది)






## 12

[దుర్ముఖరాజు కోటను ఆక్రమించిన సామంతుడు, తలారి భల్లూకుడూ వాళ్ళ పైకి, సైనికుల్ని పంపాడు. దొంగ నాగమల్లు సేనానాయకుడికి, తాను రాజు దుర్ముఖుణ్ణి బంధించి తెచ్చినట్టు చెప్పాడు. సామంతుడు తలారి భల్లూకుడి దగ్గిరకు వచ్చాడు. రాజు దుర్ముఖుడు ఉగ్రుడైపోయి, సామంతుడి మీదికి దూకాడు. సామంతుడు పారిపోసాగాడు. తరవాత—]

సామంతు భూపతి తన గుర్రాన్ని ఆపి, వెనుదిరిగి, వెంటబడి తరుముకు వస్తున్న రాజుదుర్ముఖుణ్ణి ఎదిరించే ప్రయత్నం చేయకుండా, తెరిచివున్న కోట ద్వారాల కేసి గుర్రాన్ని దౌడు తీయించసాగాడు. తమ రాజు అలా శత్రువుకు వెన్నిచ్చి పారిపోవటం చూసిన సేనాని కూడా, తన వెంటవున్న సైనికులను హెచ్చరించి, కోటవైపుకు గుర్రాన్ని తిప్పాడు.

సేనాని అలా పారిపోయే ప్రయత్నం చేస్తున్నంతలో, అతడి వెంటవున్న ధైర్యవంతులైన ఇద్దరు సైనికులు, అతడితో, "అయ్యా, మనపైకి దాడి వచ్చిన శత్రువులు పదిమంది అయినా లేరు. కొత్తగా రాజైన సామంతుణ్ణీ, పాతరాజు దుర్ముఖుణ్ణీ అలా ఒకరినొకర్ని కత్తులతో నరుక్కోనిద్దాం. ఈ లోపల మనం యీ కొద్దిమంది శత్రువులను చుట్టుముట్టి హతం



చేయవచ్చు. ఆ తరవాత పాత, కొత్త రాజుల ప్రమేయం లేకుండా, మీరే ఉదయగిరికి రాజై పోవచ్చు.'' అన్నారు.

సైనికులు యిలా అనగానే సామంతుడి సేనానికి ఒక కొత్త ఆశ పుట్టింది. అతడు గుర్రాన్ని వెనుదిప్పి, ఏనుగుల మీద వున్న తలారి భల్లూకుడు వాళ్ళకేసి చూశాడు. భల్లూకుడు గొడ్డలి పైకెత్తి, దొంగ నాగమల్లూ, అతడి అనుచరుల్నీ; దుర్ముఖుడి అంగరక్షకుల్నీ హెచ్చరిస్తూ, ''ఒరే, దుస్సాహసానికి పోయి రాజు దుర్ముఖుడు రాజ్యంతోపాటు ప్రాణాలు కూడా పోగొట్టుకునేలా వున్నాడు. మనం పక్కన లేకుండా అతడు, అంతమంది శత్రువుల మధ్యకు పోవటం చావు కోరి తెచ్చుకోవటమే. ఇక కదిలి, అడ్డం వచ్చిన శత్రువులను నరుక్కుంటూపోతే తప్ప, లేకపోతే ఆ దుర్ముఖుణ్ణి రక్షించలేం," అన్నాడు.

ఆ మాటలు వింటూనే రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను పైకెత్తి, ప్రళయ భయంకరంగా హుంకరించి, "హేయ్, సామంతు సూర్యభూపతి సైనికుల్లారా, జాగ్రత్త! రాజు దుర్ముఖుడికి, మీలో ఎవరివల్లనైనా హాని జరిగిందో, మీ అందర్నీ చిత్రవధ చేస్తాను,'' అంటూ కోటవైపుకు బయలుదేరాడు.

ఉగ్రదండుడు అలా కదలటం చూస్తూనే, రాజు కావాలనే దురాశతో ఏమిచేయటమా అని ఆలోచిస్తున్న సేనాని చప్పున గుర్రాన్ని వెనుదిప్పి, ''ఒరే, మనం రాక్షసుల్నీ, గండ్రగొడ్డళ్ళు పట్టిన ఎలుగుబంట్లనూ ఎదిరించి బతకలేం. కోట గోడలే మనకు శరణ్యం. రండి, కోట ప్రవేశిస్తూనే, ద్వారాలు బంధిద్దాం,'' అంటూ పారిపోసాగాడు.

సేనాని కోటకేసి పారిపోవటం చూస్తూనే చాలామంది సైనికులు అతణ్ణి అనుసరించారు. తలారి భల్లూకుడు, మొండి తొండపు ఏనుగు కుంభస్థలం మీద వున్న ఆటవికుడితో, ''ఒరే, ఆటవిక సేవకా! నీ అలవాటు ప్రకారం, ఏదో

పిట్టలను బాణాలతో కొట్టినట్టు, పారిపో తున్న సైనికులపై బాణాలు వదిలి, వాళ్ళను చంపకు. మనం దుర్ముఖ రాజును కొద్ది క్షణాలపాటు పోయిన సింహాసనం మీద కుర్చోపెట్టి, అతడి తల తీసుకుని, భల్లూక మాంత్రికుడి దగ్గిరకు పోదాం. అనవసర రక్తపాతం ఎందుకు?'' అన్నాడు.

ఏనుగుల పైన వున్న తలారి భల్లూకుడూ, దొంగ నాగమల్లూ, దుర్ముఖుడి అంగరక్షకులూ; రాక్షసుడు ఉగ్రదండుడి వెనక తమ వాహనాలను పరిగెత్తిస్తూ, కోట ద్వారాలను చేరేంతలో, సామంతు సేనాని కొందరు సైనికులతో కోట ప్రవేశించి, ద్వారాలను చప్పున మూయించాడు. అప్పటికింకా కోట ద్వారాలను సమీపించని కొందరు అశ్వికులూ, సైనికులూ ప్రాణభయంతో హాహాకారాలు చేస్తూ, కోట గోడల వెంట చెల్లాచెదురుగా పారిపోయారు.

రాక్షసుడు ఉగ్రదండుడు ముందుగా కోట ద్వారాలను సమీపించి, రాతి గదతో వాటి మీద గట్టిగా రెండుసార్లు పొడిచి, అవేమాత్రం బెసకక పోవటంతో ఆశ్చర్య పోతూ, అక్కడి కొచ్చిన తలారి భల్లూకుడితో, ''తలారి భల్లూకా! యీ సామంతు సేనాని ఎంత పిరికివాడో, అంత జిత్తుల



మారి ఘటం. ఇప్పుడేం చేయటం? రాజు దుర్ముఖుడు కోటలో ఒంటరిగా శత్రువుల మధ్య చిక్కుకుపోయాడు. అతగాడి ప్రాణాల మాటకేంగాని, భల్లూక మాంత్రికుడికి నువ్వు సమర్పించుకోవలసిన అతడి తల ఏమైపోతుందో అని నాకు దిగులుగా వున్నది. కోటద్వారాలు బద్దలు కొట్టటం ఎలా?'' అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు యిలా అనగానే తలారి భల్లూకుడికి నిలువెల్లా కంపరం ఎత్తిపోయింది. దుర్ముఖుడి తల తీసుకుపోకపోతే, ఆ మాంత్రికుడు తనను బతికినన్నాళ్ళూ, యిలా భల్లూకంగా నే వదిలేస్తాడు. మనిషిగా పుట్టి, ఎంతో కాలం



మనిషిగా జీవించిన తను, అరణ్యాలు పట్టి, ఏ తేనెపట్టులో తింటూ జీవించటం కన్న నీచం మరొకటున్నదా!

తలారి భల్లూకుడు యిలా అనుకుని, ఎలా అయినా సరే రాజు దుర్ముఖుడి ప్రాణాలు కాపాడాలన్న ఆవేశంతో గండ్రగొడ్డలి పైకెత్తి, "దిరిశెనవన, భైరవా!" అంటూ కేకపెట్టి, కోట ద్వారాల మీద బలంగా కొట్టాడు. గట్టి కొయ్యతో చేసిన తలుపుల మీద, బలమైన ఇనుప రేకు తాపడం చేసిన ద్వారాలు. ఆ దెబ్బకు చెక్కుచెదరకపోగా, వాటి తాకిడికి తలారి భల్లూకుడి చేతిలోని గండ్రగొడ్డలి ఎగిరి అంత దూరం పోయి కింద పడింది.

ఏనుగు మీద ముందు కూర్చున్న ఆటవికుడు ఎగిరి కిందికి దూకి, పరిగెత్తి పోయి గండ్రగొడ్డలిని చేతికి తీసుకుని, "భల్లూక దొరా, అనవసరంగా ఆవేశ పడి, భల్లూక మాంత్రికుడి మహత్తుగల గండ్రగొడ్డలిని విరగ్గొట్టకు. కోటలో మనం జొరబడాలంటే, యీ మూసిన ద్వారాలను కాల్చి బూడిద చేయటం ఒక్కటే మార్గం." అన్నాడు.

"ఒరే, ఆటవిక సేవకా, ఆలోచన బాగానే వున్నది. కాని, యీ లోపల సామంతు సూర్యభూపతి, రాజు దుర్ముఖుణ్ణి చంపితే, అప్పుడు నా గతేంకాను?" అన్నాడు తలారి భల్లూకుడు కోపంగా.

"ఆ మాటా నిజమే!" అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి, నాలుగైదడుగులు వెనక్కువేసి, దూకుతూ పోయి కోటద్వారాల మీద బలంగా ఒక దెబ్బ కొట్టాడు.

రాక్షసుడి బలమైన గద దెబ్బకు ద్వారాలైతే విరగలేదుగాని, నెర్రెలు వారి వున్న వాటిపై కోటగోడ భాగం కొంత విరిగి, రాళ్ళూ రప్పలతో దభీమంటూ కింద పడింది. మొత్తం గోడ కూలుతున్నదేమో అన్న భయంతో ఉగ్రదండుడూ, తలారి భల్లూకుడూ, కోటద్వారాల దగ్గిరనుంచి దూరంగా పరిగెత్తి, తలలెత్తి చూశారు.

కోటగోడ మీద వాళ్ళ కంటబడిన దృశ్యం, అందరికీ ఆశ్చర్యంతోపాటు, భయం కూడా కలిగించింది. నల్లని దుస్తులు ధరించిన పెద్ద కోతి ఆకారం ఒకటి గోడ మీద కూర్చుని వున్నది. దాని చేతిలో పొడవాటి మంత్రదండం వున్నది. దాని పిడిమీద ఒకే వజ్రంలో మలిచిన ఎలుగు బంటి తల. సూర్యకాంతిలో మిలమిల మెరుస్తున్నది.

ఆ కోతి రూపాన్నీ, దాని చేతిలో వున్న మంత్రదండాన్నీ చూసి తలారిభల్లూకుడు గట్టిగా పళ్ళుకొరికి, పెద్దగా గొంతెత్తి, "ఒరే, కోతి రూపంలో వున్న నీవు, నిజంగా కోతివా లేక ఏదైనా పిశాచానివా? మహా శక్తిసంపన్నుడైన భల్లూకమాంత్రికుడి మంత్రదండం నీకెలా దొరికింది?" అన్నాడు.

ఆ ప్రశ్నకు కోతి రూపం కర్ణకఠోరంగా కిచకిచమని, "అరె ఒరే! భల్లూక రూపంలోవున్న నువ్వు, నిజంగా భల్లూకానివా లేక ఏదైనా పిశాచానివా?" అని అడిగింది.

తలారి భల్లూకుడు ఆ ప్రశ్న వింటూనే కోపం పట్టలేక గండ్రగొడ్డలి విసర బోయేంతలో, రాక్షసుడు ఉగ్రదండుడు అతణ్ణి ఆగమని, చిన్న గొంతుతో, "తలారి భల్లూకా, తొందరపడకు! నువ్వనే



ఆ భల్లూకమాంత్రికుడు ఏదో పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నాడని, నా అనుమానం. ముందు, యీ పిశాచికోతి నుంచి, మంచి మాటలతో, ఏం జరిగిందో తెలుసుకుందాం," అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించే లోపలే, చాటునుంచి ఆటవికుడు గురిపెట్టి వదిలిన బాణం రివ్వుమంటూ పిశాచికోతి కేసి పోయింది. కోతి యీసారి కిచకిచా అని నవ్వుతూ, ఉన్న చోటునుంచి కదలకుండానే, బాణాన్ని చప్పున ఎడమ చేతితో వడిసిపట్టుకుని, కుడిచేతిలో వున్న మంత్రదండాన్ని పైకెత్తి, "ఒరే, కుంతాగ్రేసరులారా! నా శక్తి ఎలాంటిదో చూశారు



గదా? నేను మాయా మర్కటాన్ని! తెలిసిందా?'' అన్నది.

తలారి భల్లూకుడు రెండు చెవులూ ఒకసారి మూసుకుని, రాక్షసుడు ఉగ్ర దండుడితో, "ఉగ్రదండా! ఇక, యీ చచ్చు మర్కటంతో మాటలు పెంచి ప్రయోజనం లేదు. కోట లోపల రాజు దుర్ముఖుడు యింకా బతికే వున్నాడో లేక సామంతుడి చేతిలో హతమైపోయాడో తెలియటం లేదు. కోట తలుపులు బద్దలు కొట్టలేక పోతే, గోడలైనా ఎక్కి మనం లోపల ప్రవేశించాలి. మార్గం ఏమిటి?" అన్నాడు.

ఉగ్రదండుడు ఆశ్చర్యపడుతున్న వాడిలా, తలారి భల్లూకుడి కేసి చూసి, ''తలారి భల్లూకా, నీ కింకా సంగతి సందర్భాలు బాగా అర్థమైనట్టు లేదు. ఈ మాయా మర్కటాన్నే దుర్మార్గుడు, భల్లూకమాంత్రికుడి మంత్రదండాన్ని చేజిక్కించుకోగలిగాడంటే, నిశ్చయంగా ఆ మాంత్రికు డీసరికి ప్రాణాలు పోగొట్టు కుని వుండాలి. అలాంటి స్థితిలో నువ్వు, రాజు దుర్ముఖుడి కోసం అనవసరమైన చిక్కుల పాలవటం ఎందుకు? పద, ఇద్దరం అరణ్యంలోని కొండ ప్రాంతాల కాలక్షేపం చేద్దాం,'' అన్నాడు.

''రాక్షసుల వారిది, బహు మంచి సలహా, తలారి భల్లూక ప్రభో!'' అంటూ దొంగ నాగమల్లు ఏనుగు మీది నుంచి కిందికి దూకి, తన అనుచరులిద్దర్నీ, అంగరక్షకుల్నీ కూడా ఏనుగుమీది నుంచి కిందికి దిగమని, ''ఉగ్రదండులవారి ఆలోచన ఎలావున్నది? అందరం ఏకంగా అరణ్యంలో ఒకేచోట గుంపు కట్టివుంటే, మన దారిదోపిడీలను అడ్డగలవాళ్ళు, యీ భూప్రపంచంలో ఎవరుంటారు?'' అన్నాడు ఉత్సాహంగా.

తలారి భల్లూకుడు కోపంతో కళ్ళెర్ర చేసి, ఆటవికుడితో, ''ఒరే, ఆటవిక సేవకా! ఈ దొంగ నాగమల్లు పారి పోకుండా బాణం ఎక్కుపెట్టు,'' అని, మిగతా వాళ్ళందరితో, ''భల్లూక

మాంత్రికుడూ, మహా శౌర్యవంతుడైన కాళీవర్మ అనే యువకుడూ ఏ మయ్యారో వెతికేందుకు, నా వెంట వచ్చే వాళ్లెవరు? చేతు లెత్తండి? '' అన్నాడు.

ఒక్క రాక్షసుడు ఉగ్రదండుడు తప్ప, అందరూ అంగీకార సూచకంగా చేతు లెత్తారు. ఆటవికుడు అనుమానంగా, '' తలారి భల్లూకయ్యా, ఈ దొంగ నాగ మల్లూ, అతడి నేస్తగాళ్ళూ మన వెంట వస్తామంటున్నారు. వాళ్ళను నమ్మటం ఎట్లా? '' అన్నాడు.

'' వాళ్ళను నమ్మటం మంచిది కాదను కుంటే, యిక్కడే తలలు నరికేస్తాను. ఉగ్రదండా, నీ సంగతేమిటి? ఆ భల్లూక మాంత్రికుడితో ఏదో పనివున్నట్టు లోగడ చెప్పావు గదా? '' అన్నాడు తలారి భల్లూకుడు.

'' ఆ మాంత్రికుడు సజీవుడైతే గదా, నాకు పని! '' అన్నాడు ఉగ్రదండుడు.

అంతలో మాయామర్కటం కోటగోడ మీద కీచుమంటూ పెద్దగా అరిచి, ''ఆహాఁ, ఈ కోటలో జరుగుతున్నది యుద్ధమా లేక దాగుడు మూతలాటా? సైనికులు రెండు భాగాలుగా చీలిపోయి కొందరు పాతరాజు దుర్ముఖుణ్ణీ, మరి కొందరు సామంతు సూర్యభూపతినీ గెలిపించాలని చూస్తున్నారు. పిరికి



వెధవలు ముఖాముఖి యుద్ధం చేయ కుండా, స్తంభాల చాటునా, చెట్ల చాటునా పొంచివుండి కవ్వించుకుంటారెందుకు?" అన్నది.

ఆ మాటలతో తలారి భల్లూకుడు కొంచెం స్థిమితపడి, '' ఉగ్రదండా, రాజు నాకు ప్రాణాలతో దొరికే ఆశవున్నదన్న మాట! ఈ భల్లూకరూపం నుంచి నాకు త్వరలోనే విముక్తి కలుగుతుంది,'' అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు చీదరించు కుంటున్నట్టు రాతిగదను నేలకు వేసి గట్టిగా కొట్టి, ''ఓయ్‌ఁ, తలారి భల్లూకా, నువ్వింకా పాతపాటే పాడుతున్నావు.

భల్లూక మాంత్రికుడు ప్రాణాలతో వుండగా, అతడి మంత్రదండాన్ని ఎవరైనా చేజిక్కించుకో గలరా?'' అని, మాయా మర్కటాన్ని చప్పట్లుచరిచి పిలిచి, "ఓయ్, మర్కటం! భల్లూక మాంత్రికుడి మంత్ర దండాన్ని తెచ్చావు బాగానేవుంది. మరి, అతడి శవాన్ని ఏం చేశావు?'' అని అడిగాడు.

''ఆ శవాన్ని నరికి కాకులకూ, గద్ద లకూ ఆహారంగా వేశాను. కాని, ఆ పక్షులు ముట్టకుండా కాళీవర్మ అనే వాడి శిష్యుడు కాపలాకాస్తున్నాడు,'' అంటూ మంత్ర దండాన్ని గోడమీద నిలువునా ఆనించి, దానిమీదికెక్కి దూరంగాచూస్తూ, ''అరె, అరే! ఆ భల్లూక మాంత్రికుడు ఏ సంజీ వనీ విద్యవల్లో తిరిగి బతికాడన్నమాట! వాడు ఎనుబోతు మీదా, పక్కన గుర్రం మీద కాళీవర్మ అనేవాడూ—యిటే వస్తున్నారు. వాళ్ళను పట్టుకునేందుకు చంద్రశిలా నగరరాజు జితకేతుడి మంత్రి సైన్యంతో వెంబడిస్తున్నాడు. వాళ్ళిద్దరి శిరశ్ఛేదం కళ్ళారా చూసిగాని, నేనిక్క ణ్ణుంచి కదలను,'' అన్నది.

మాయామర్కటం యిలా అనగానే తలారిభల్లూకం, ''దిరిశెనవన భైరవా!'' అంటూ పెద్దగా అరిచి, ''ఒరే, చచ్చుకోతి వెధవా! ఇందాకటి నుంచి చూస్తున్నాను, నువు మాట్లాడేదేమిటి? నీకేమైనా వెర్రా లేక మాకు వెర్రెత్తించాలని చూస్తు న్నావా?'' అన్నాడు.

తలారి భల్లూకం మాట పూర్తి చేసే లోపలే, వేగంగా ముందు గుర్రం మీద కాళీవర్మా, వెనకగా ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ అక్కడికి వచ్చి, కోటగోడ మీదవున్న మాయామర్కటాన్ని చూస్తూనే, ''తలారి భల్లూకా! మంత్ర దండాన్ని దొంగిలించిన, యీ మాయా మర్కటాన్ని ప్రాణాలతో వదలగూడదు,'' అన్నారు.

ఆ మరుక్షణం మర్కటం కిచకిచా అంటూ నవ్వి, ఛెంగున ఎగిరి కోటలోపలికి దూకేశింది. —(ఇంకావుంది)






## 13

[ రాజు దుర్ముఖుడు అన్నిటికీ తెగించి, తన రాజ్యాన్ని ఆక్రమించిన సామంతుణ్ణి తరుముతూ కోట ప్రవేశించాడు. కోట తలుపులు బద్దలు కొట్టేందుకు భల్లూకుడూ, ఉగ్రదండుడూ ప్రయత్నిస్తూండగా, మాయామర్కటం ఒకటి అక్కడికి వచ్చి; కాళీవర్మా, భల్లూక మాంత్రికుడూ రావటంచూస్తూనే, కోటగోడ మీది నుంచి లోపలికి దూకేసింది. తరవాత— ]

కాళీవర్మనూ, భల్లూక మాంత్రికుణ్ణీ చూసిన ఉత్సాహంలో తలారి భల్లూకుడు ఎగిరి గంతు వేసి, గండ్రగొడ్డలిని గిరగిరా తిప్పుతూ, "అహఁ, అయ్యలారా, ఎన్ని రోజుల తరవాత మీ యిద్దరి దర్శన భాగ్యం కలిగింది. ఇక నా కష్టాలు గట్టెక్కినట్టే!" అన్నాడు.

భల్లూక మాంత్రికుడు ఎనుబోతు మీది నుంచి దిగి, తలారి భల్లూకుణ్ణి సమీపించి, "ఒరే, భల్లూకా, అంతగా ఆనంద పడిపోకు! ఆ వింత కోతిరూపంలో వచ్చినవాడు, నిజంగా కోతికాదు. వాడు మిథ్యామిశ్రు డనే తాంత్రికుడి శిష్యుడైన భ్రాంతిమతి. ముందు వాడు దొంగిలించుకు వచ్చిన నా మంత్రదండాన్ని తిరిగి సంపాదించాలి," అన్నాడు.

తలారి భల్లూకుడు ఏమనేందుకూ తోచక తల ఆడిస్తున్నంతలో, కాళీ



వర్మ ఆశ్చర్యంగా రాక్షసుడు ఉగ్రదండు కేసి చూస్తూ, "తలారి భల్లూకా, ఈ రాక్షసుణ్ణీ, ఏనుగులనూ — ఈ పరివారాన్నంతా ఎలా సంపాయించావు ?" అన్నాడు.

ఆ మాటలకు ఉగ్రదండుడు చిన్నగా నవ్వి, "నువ్వేగదా, కాళీవర్మ అనే క్షత్రియయువకుడివి ? నీ గురించి తలారి భల్లూకుడు చెప్పగా విన్నాను. ఈయనే అన్నమాట, భల్లూక మాంత్రికుడు ?" అని, దూరాన నిలబడివున్న చంద్రశిలా నగరరాజు జితకేతుడి మంత్రినీ, అతడి వెంటవున్న కొద్ది మంది అశ్వికులనూ, సైనికులనూ కాళీవర్మకు చేఎత్తి చూపుతూ, "కాళీవర్మా ! మీ మనుషుల మధ్యకు వచ్చిన రాక్షసుడినైన నన్ను చూసి ఆశ్చర్యపడుతూ కాలయాపన చేయకు. నిన్ను తరుముకు వచ్చిన ఆ సైనికులు రాజు జితకేతుడు పంపిన వాళ్ళని మాయామర్కటం అనగా విన్నాను. వాళ్ళవల్ల రానున్న అపాయన్నుంచి ఎలా ప్రాణాలతో బయటపడాలనుకుంటున్నావు ?" అని అడిగాడు.

కాళీవర్మ తన గుర్రాన్ని వెనక్కు తిప్పి, కత్తి దూసి, ఉగ్రదండుడితో, "నీ పేరేమో తెలియదు. ఇక్కడ యింత మందికీ నాయకుడెవరు ? నువ్వా, తలారి భల్లూకుడా ?" అని అడిగాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పబోయేంతలో తలారిభల్లూకుడు, "చిరిశెనవన, భైరవా !" అంటూ కేకపెట్టి, "కాళీవర్మ దొరా, యీ రాక్షసుడు ఉగ్రదండుడికీ, దొంగలనాయకుడు మల్లూ, దుర్ముఖుడి అంగరక్షకులూ — అందరికీ నేనే నాయకుణ్ణి. ఏం చేయమంటారు ? ఆజ్ఞాపించండి," అన్నాడు.

కాళీవర్మ, దిగాలుపడి చుట్టూ కలయ చూస్తున్న భల్లూకమాంత్రికుడితో, "గురూ, తమ ఆజ్ఞ ఏమిటి ? ఒకసారి తమ శక్తి ఎలాటిదో చూసిన ఆ జితకేతుడి మంత్రి జీవగుప్తుడు మనమీద దాడి చేస్తా

డనుకోను. చూడండి, అలా దూరంగా గుర్రం మీద కూర్చుని ఎలా వణికిపోతు న్నాడో.'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు నిరుత్సాహంగా ఒకసారి మూసి వున్న కోటద్వారాలకేసి చూసి, ''నా గురువును చిక్కులపాలు చేసిన తాంత్రికుడి శిష్యుడైన ఈ మాయా మర్కటుడు, చాటుగా నన్ను వెన్నంటి వస్తున్నాడని తెలియక మంత్రదండాన్ని పోగొట్టుకున్నాను. వాడి సంగతి తెలిసి వుంటే, మంత్రదండాన్ని ఆ నది ఒడ్డున చెట్టుకు ఆనించి, నదిలో స్నానానికి దిగి వుండేవాణ్ణి కాదు.'' అన్నాడు.



తలారిభల్లూకుడు గండ్రగొడ్డలిని అడ్డంగా రెండు అరచేతుల మీదా పెట్టు కుని మాంత్రికుడి ముందుకు వచ్చి, ''మాంత్రికప్రభో! ఆ మంత్రదండం పోయిందని విచారించకండి. ఈ గండ్ర గొడ్డలీ మంత్రప్రభావం కలదే గదా? దీని ధాటికి ఉగ్రదండు డంతటి రాక్షసుడే హడ లెత్తిపోయాడు. ఇది తీసుకుని నన్ను వెంటనే మామూలు మనిషిని చెయ్యండి." అన్నాడు.

''నువ్వు సమర్పించుకోవలసిన రాజు దుర్ముఖుడి తల మాటేమిటి? కోటలో యీ పాటికి ఆ తల సామంతుడు సూర్య భూపతి కత్తి దెబ్బలకు ఛిన్నాభిన్నమై వుంటుంది.'' అన్నాడు రాక్షసుడు ఉగ్ర దండుడు.

రాజు దుర్ముఖుడి పేరు వింటూనే భల్లూకమాంత్రికుడు అదిరిపడి, ''తలారి భల్లూకా, ఆ రాజు యింకా బతికే వున్నాడా? సామంతు సూర్యభూపతి' ఎవరు? కోట లోపల యుద్ధం ఎవరెవరి మధ్య జరుగుతున్నది?'' అని అడిగాడు.

తలారిభల్లూకుడు కొద్ది మాటల్లో, తాను రాజు దుర్ముఖుడి వెంటబడి అర ణ్యానికి పోయినప్పటి నుంచి, ఆ క్షణం వరకూ జరిగిందంతా చెప్పి, ''మాంత్రిక ప్రభో, ఆ రాజు మనం అనుకున్నంత దుర్మార్గుడు కాదు. తరవాత మీ యిష్టం!



ముందు నన్ను మనిషిగా మార్చండి. ఈ ఎలుగుబంటి చర్మం లోపల వేడి. ఉక్కలదెబ్బకు తట్టుకోలేక నానా అవస్థా పడిపోతున్నాను.'' అన్నాడు.

''గురూ, పాపం, తలారిభల్లూకుడి మాట కాదనకండి. వాడి రూపం మార్చండి,'' అన్నాడు కాళీవర్మ.

భల్లూకమాంత్రికుడు మంత్రపు గండ్ర గొడ్డలిని చేతికి తీసుకుని, ఏదో మంత్రం పఠిస్తూ, గొడ్డలిని తలారి పాదాలకు తాకించాడు. వెంటనే అతడి పాదాలు మనిషి పాదాలుగా మారిపోయినై. తరవాత గొడ్డలిని అతడి తల వరకూ తాకించుకుంటూ పోయాడు. క్షణాల మీద తలారి భల్లూకం శరీరం అంతా మనిషి శరీరంగా మారిపోయింది గాని, తల మాత్రం భల్లూకం తలగానే వుండిపోయింది.

తను మామూలు మనిషినైపోయాననుకున్న తలారి చప్పున భల్లూకమాంత్రికుడి ముందు సాష్టాంగపడి లేస్తూ, "మాంత్రిక ప్రభో, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నేను తిరిగి మనిషినయాను! ప్రాణాలకెంత హాయిగా వుందో మాటలతో చెప్పటం సాధ్యం కాదు,'' అన్నాడు.

ఆ మాటలకు దొంగ నాగమల్లుతో పాటు అందరూ పెద్దగా నవ్వారు. తలారి ఆశ్చర్యపోతూ వాళ్ళకేసి చూసేంతలో రాక్షసుడు ఉగ్రదండుడు తన రాతిగదతో అతడి తలను తాకుతూ, "తలారిభల్లూకా! శరీరం కంఠం వరకూ మనిషిదే; మరి తల మాటేమిటి?'' అన్నాడు.

తలారి చప్పున రెండు చేతులతో తల తడివి చూసుకుని పెద్దగా మూలుగుతూ, ''మాంత్రికప్రభో! ఈ అన్యాయం ఏమిటి? మనిషి శరీరం, భల్లూకంతల! మామూలు భల్లూక రూపంకన్న యిది నలుగురిలో నన్ను మరింత నవ్వులపాలు చేస్తుంది,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు విచారంగా ముఖం పెట్టి, ''తలారిభల్లూకా, అట్టే దిగులుపడకు. ప్రస్తుతానికి ఆ వున్న

తలతో తృప్తి పడు. తల భల్లూకానిదైతే నేం. అందులో వున్న బుద్ధి మనిషిదే గదా? నా మంత్రదండాన్ని ఆ మాయా మర్కట రూపంలో వచ్చిన దుష్టుడు భ్రాంతిమతి అపహరించటంతో, నా మంత్ర శక్తులు కొన్ని క్షీణించినై. అందువల్లే నిన్ను పూర్తిగా మనిషిని చేయలేక పోయాను." అన్నాడు.

తలారి భల్లూకుడు కళ్ళ నీళ్ళ పర్యంతమైపోతూ, "ఈ వింత రూపంలో వున్న నాకు, జితకేతరాజుగారు తిరిగి నగర ప్రధాన తలారి ఉద్యోగం ఎలా యిస్తారు? నా బతుకు తెరువు మాటేమిటి?" అన్నాడు.

తలారి దుఃఖం చూసి కాళీవర్మ జాలి పడుతూ, అతడి భుజం మీద చేయి వేసి, "తలారి భల్లూకా, అంతగా విచార పడకు. మాంత్రిక గురువు తన మంత్ర దండాన్ని పోగొట్టుకున్నాడని తెలిసిన రాజు జితకేతుడి మంత్రి జీవగుప్తుడు ధైర్యం పుంజుకుని, మమ్మల్ని హతం చేయాలనే ఉద్దేశంతో సైనికుల్ని వెంట బెట్టుకుని, మా వెన్నంటి యిక్కడికి వచ్చాడు. అదుగో, దూరాన ఆ మంత్రినీ, వెంటవున్న సైనికుల్నీ చూడు," అన్నాడు.

తలారి భల్లూకుడు తల తిప్పి, మంత్రి జీవగుప్తుడూ వాళ్ళకేసి చూసి భయంతో



చిన్నగా కంపించిపోతూ, "ఆ రాజుగారి మాటేమోగాని, యీ మంత్రి మాత్రం నిశ్చయంగా నా తల తీయించేస్తాడు. నేను అన్ని విధాలా చిక్కుల్లో పడి పోయాను," అన్నాడు జీరబోయిన గొంతుతో.

భల్లూక మాంత్రికుడు మంత్రపు గండ్ర గొడ్డలిని తలారికి తిరిగి యిస్తూ, "తలారీ భల్లూకా, నీలో ధైర్యం, తెగింపు ఏమాత్రం వున్నా, యీ మంత్రపు గండ్రగొడ్డలి నిన్ను అన్ని అపదలనుంచీ కాపాడుతుంది," అని నడుం నుంచి వేళ్ళాడుతున్న ఒర నుంచి కత్తి దూసి, "మర్కటం దొంగి లించుకు పోయిన మంత్రదండం అంత



శక్తి కలది కాకపోయినా, యీ కత్తి నా రక్షణకు చాలు." అన్నాడు.

"మరి నా దినభత్యం, నౌకరీ సంగతేమిటి? ఇక్కడున్న దొంగ నాగమల్లులాగా నేను, దారులు కొట్టుకు బతికేంత నీచుణ్ణి కాదుగదా?" అన్నాడు తలారి భల్లూకుడు.

అతడు మాట ముగించే లోపలే దొంగ నాగమల్లు కోపంతో పెద్దగా రంకె పెట్టి, నడుం నుంచి వేళ్ళాడుతున్న కత్తిని కింద పడవేసి, "ఒరే, ఎలుగుబంటి తలా, మనిషి శరీరపు సంకరజాతి వెధవా, నేను నీచుణ్ణా? మందిమార్బలం, సైన్యాల సహాయంతో ఏ చచ్చు వెధవైనా రాజ్యాలు పాలించవచ్చు. ఒంటరిగా అడవి దారులు కొట్టి బతకటానికి నిజమైన శౌర్యం, ప్రతాపం కావాలి. నా కత్తి పారేశాను, నీ మంత్రపు గొడ్డలి కిందపెట్టి, నాతో మల్ల యుద్ధానికిరా," అంటూ జబ్బలు చరచసాగాడు.

భల్లూక మాంత్రికుడు కళ్ళెర్ర చేసి అందరికేసీ ఓమారు చూసి, కాళీవర్మతో, "కాళీ! ఈ బుద్ధిహీనులకు తామెంత ప్రమాదకర స్థితిలో వున్నదీ అర్థమైనట్టు లేదు. అందర్నీ పట్టి శిరశ్ఛేదాలు చేసేందుకు ఒక వైపున జితకేతుడి మంత్రి పథకాలు వేస్తున్నాడు. ఇక కోటలో రాజు దుర్ముఖుడు జయించినా లేక సామంతుడు జయించినా, మనకు మేలుకన్నకీడే ఎక్కువ కలిగే ప్రమాదం వున్నది. మర్కటదుష్టుడు వాళ్ళను మన మీదికి రెచ్చగొట్టక మానడు," అన్నాడు.

కాళీవర్మ కోపంగా కత్తి పైకెత్తి, "మాంత్రిక గురువు చెప్పింది, విన్నారా? ఇక్కడ మీ అందరికీ నాయకుడెవరో తెలుసుకున్నారా?" అన్నాడు.

ఒక్క రాక్షసుడు ఉగ్రదండుడు తప్ప మిగతా వాళ్ళందరూ, "కాళీవర్మకూ, జై!" అంటూ కేక పెట్టారు.

కాళీవర్మ తృప్తిగా తలాడించి, రాక్షసుడు ఉగ్రదండుణ్ణి సమీపించబోయేం

తలో మంత్రి జీవగుప్తుడి దగ్గిరనుంచి ఒక అశ్వికుడు కత్తిని తలకిందులుగా పట్టుకుని, వేగంగా వాళ్ళ దగ్గిరకు వచ్చి గుర్రాన్ని ఆపి, "జితకేత మహారాజుగారి మంత్రి జీవగుప్తుల నుంచి ఒక ముఖ్య సందేశం తెచ్చాను," అన్నాడు.

"ఓహో, అందుకా కత్తిని తలకిందులుగా పట్టుకున్నది! మంచిది, ఏమిటా సందేశం?" అన్నాడు కాళీవర్మ.

"ఇక్కడ వున్న నగర ప్రధాన తలారిని వెంటనే తన సమక్షానికి రావలసిందిగా మంత్రిగారు ఆజ్ఞాపిస్తున్నారు. వచ్చేటప్పుడు రాజుగారివల్ల శిరశ్ఛేద శిక్ష పొంది, తప్పించుకు తిరుగుతున్న కాళీవర్మ అనే నేరస్థుణ్ణి వెంట బంధించి తీసుకురమన్నారు," అన్నాడు మంత్రి జీవగుప్తుడి అశ్వసైనికుడు.

ఆ మాటలకు భల్లూక మాంత్రికుడు చిన్నగా నవ్వి, "ఏం, తలారి భల్లూకా, మంత్రిగారి ఆజ్ఞ విన్నావా? ఏం చేయబోతున్నావు?" అని అడిగాడు.

తలారి భల్లూకుడు ఏమి చేయటానికి తోచనివాడిలా రెండు, మూడు క్షణాల పాటు తల వంచుకు వూరుకుని, తరవాత తల ఎత్తి, "కాళీవర్మ దొరా, ఏమిటి మీ ఆజ్ఞ? ఈ భల్లూకం తలతో నేను చంద్రశిలానగరం పోవటం అంటె, అక్కడ వీధి పిల్లలచేత రాళ్ళ దెబ్బలు తిని ప్రాణాలు పోగొట్టుకోవటమే అవుతుంది," అన్నాడు.



కాళీవర్మ కత్తితో తలారి భల్లూకుణ్ణి మృదువుగా తాకి, "తలారి భల్లూకా, నీ స్వామిభక్తి మెచ్చదగింది. మనం ముందు యీ కోటలో ప్రవేశించి, మాయా మర్కటాన్ని పట్టుకోవటంతో పాటు, యిప్పటికే మించి పోకపోతే, ఆ రాజు దుర్ముఖుడి ప్రాణాలు కూడా కాపాడాలి. రాజు జితకేతుడితో పోల్చితే, దుర్ముఖుడు అన్నివిధాలా ఉత్తముడుగా కనిపిస్తున్నాడు. ఇక మంత్రి జీవగుప్తుడి దూతకు యివ్వవలసిన జవాబు మాట! గండ్ర గొడ్డలితో అతడి తల నరుకుతావో లేక అతడి కత్తిని రెండుగా విరిచి, యిక్కడి నుంచి తరిమేస్తావో-అదంతా నీ యిష్టం!" అన్నాడు.

ఆ మరుక్షణం తలారి భల్లూకుడు, "దిరిసెనవన, భైరవా!" అంటూ భీకరంగా అరుస్తూనే కుప్పించి దూత మీదికి దూకి, అతడి చేతిలోని కత్తిని లాక్కుని, మధ్యకు విరిచి, ముక్కలను దూరంగా విసిరివేస్తూ "ఒరే, దూతాధమా! నేను జితకేతరాజుగారి ఉప్పు తిన్నదానికీ, నగరప్రధాన తలారిగా శిక్షితుల తలలు నరికి చేసిన సేవకూ, చెల్లు! మర్యాదగా మంత్రి జీవగుప్తుడు యిక్కడి నుంచి వెళ్ళకపోతే, అతడి తలను దిరిసెనవన భైరవుడికి బలి చేస్తానని చెప్పు!" అన్నాడు.

జీవగుప్తుడి దూత ఒక చావుకేక పెట్టి, గుర్రాన్ని వెనుదిప్పి పరిగెత్తించేంతలో, బంధింపబడివున్న కోట ద్వారాలవైపు నుంచి ఫెళ ఫెళమంటూ పెద్ద ధ్వనితో పాటు, "కాళీవర్మకూ, జై!" అన్న కేకలు వినిపించినై.

భల్లూక మాంత్రికుడితో పాటు అందరూ ఆశ్చర్యంగా అటు కేసి తలలు తిప్పి చూశారు. కోట ద్వారాలు భగభగమని కాలిపోతున్నవి. వాటి ముందు ఆటవికుడూ, దొంగ నాగమల్లూ, అతడి యిద్దరు అనుచరులూ మండుతున్న ఎండు కట్టెలు ఎత్తి పట్టుకుని ఉత్సాహంగా గంతులు వేస్తున్నారు. —(ఇంకా వుంది)





# భల్లూకమాంత్రికుడు

**14**

[ భల్లూక మాంత్రికుడూ, కాళీవర్మా మాయామర్కటాన్ని తరుముతూ కోట దగ్గిరకు వచ్చారు. కోటలోపల జరుగుతున్న యుద్ధాన్ని గురించి తలారి భల్లూకుడు వాళ్ళకు చెప్పాడు. జితకేతుడి మంత్రి జీవగుప్తుడు అక్కడికి వచ్చి, ఒక సైనికుణ్ణి కాళీవర్మ దగ్గిరకు పంపాడు. దొంగ నాగమల్లూ, అతడి అనుచరులూ కోటద్వారాలకు నిప్పుపెట్టారు. తరవాత—]

కోట ద్వారాలు ఉవ్వెత్తున లేచిన మంటల్లో కాలి, కూలిపోవటం చూస్తూనే తలారి భల్లూకుడు పరుగున పోయి మొండి తొండపు ఏనుగు నెక్కి, "కాళీవర్మదొరా! ఇక మనం కోటలో ప్రవేశిద్దాం. అక్కడ మనకు మర్కట రూపంలో వచ్చినవాడు దొరక్కపోడు," అని యింకా మండుతున్న ఎండుకట్టెలు చేత బట్టి గంతులు వేస్తున్న ఆటవికుడితో, "ఒరే, ఆటవిక సేవకా! త్వరగా వచ్చి ఏనుగును కోటలోకి నడుపు," అన్నాడు.

ఆటవికుడు మండుతున్న కట్టెను దూరంగా విసిరివేసి దొంగల నాయకుడు నాగమల్లును హెచ్చరించి, "ఇదె వచ్చె, భల్లూకయ్యా!" అంటూ ఏనుగు కేసి బయలుదేరబోయేంతలో, నాగమల్లు అతణ్ణి ఆపి, "ఇక్కడ నాకూ, నా తోటి వాళ్ళిద్దరికీ ఏం పని? ఇదంతా ఏదో



మాంత్రికుల మధ్య తగూలాటగా వున్నది. మా దారిన మేం అరణ్యానికి పోయి, మా వృత్తేదో మేం తిరిగి ప్రారంభిస్తాం.'' అన్నాడు.

కోటద్వారాలను సమీపిస్తూ ఆ మాటలు విన్న కాళీవర్మ కోపంగా నాగమల్లు మీదికి కత్తి దూసి, ''ఒరే, ఆఖరిక్షణంలో నీ దారులుకొట్టుకు బతికేబుద్ధి పోనిచ్చావు కాదు. మాటుపెట్టి, నిరాయుధులైన ప్రయాణీకుల్ని దోచుకోవటం తప్ప, ఎదిరించి నిలబడి శత్రువులతో పోరాడే ధైర్యసాహసాలు నీకు లేవా?'' అన్నాడు.

దొంగ నాగమల్లు అందరి కేసీ ఓమారు యీసడిస్తున్నట్టు చూసి, ''పుట్టుదొంగనైన నాకు శత్రువు లెవరు? మిత్రు లెవరు? బతుకు తెరువుకు యింత ధనం ఎవరిదగ్గిర దొరికేలావుంటే, వాళ్ళను దోచుకుంటాను. ఇప్పుడు కోటలో దుర్ముఖ రాజు గెలిచినా లేక అతడి పాత సామంతుడు సూర్యభూపతి గెలిచినా, నాకు ఒరిగేదేమిటి?'' అన్నాడు.

నాగమల్లు తమ పక్షాన వుండేందుకు జీతం డబ్బులకోసం యిలా డొంకతిరుగుడుగా అడుగుతున్నాడని గ్రహించిన భల్లూక మాంత్రికుడు కత్తితో అతడి భుజాన్నితాకి, ''ఒరే, నాగమల్లూ! ఇది అంతగా మంత్రశక్తులు లేని కత్తి అయిపోయిందిగాని, యిదే మంత్రదండం అయివుంటే నిన్ను, యీ క్షణాన గుంటనక్కగా మార్చి వుండేవాణ్ణి. రాజు దుర్ముఖుడు కాక యిప్పుడు ఎవరు గెలిచినా, నిన్ను అరణ్యంలో క్రూరమృగం కింద వేటాడేస్తారు. ఆ సంగతి గ్రహించ లేవా?'' అన్నాడు.

ఆ మరుక్షణం నాగమల్లుకు తాను రాజు దుర్ముఖుడి పక్షానవుండటం మేలని పించింది. అతడి రక్షణకోసం మాంత్రికులలాంటి వాళ్ళూ, రాక్షసుడూ పూనుకున్నప్పుడు, ఆ రాజు తప్పక తిరిగి ఉదయగిరి రాజ్యానికి రాజు కాగలడన్న నమ్మకం అతడికి కలిగింది.

నాగమల్లు తన అనుచరు లిద్దరి కేసీ తిరిగి. "ఒరే, యీనాటితో మనకు చెట్టూ చేమలూ పట్టుకు తిరిగే బాధ తప్పింది. దుర్ముఖరాజు పక్షాన చేరి శత్రుసంహారం చేశామంటే, ఆయన మనకు సైన్యంలో పెద్ద జీతం మీద పదవులివ్వకపోడు," అన్నాడు.

తమ నాయకుడు యిలా అనగానే దొంగలిద్దరూ కత్తులు పైకెత్తి, "దుర్ముఖ మహారాజుకూ, జై!" అంటూ ఒకసారి కేకపెట్టి, మండుతున్న కోటద్వారపు కొయ్య ముక్కల్ని కత్తులతో పక్కలకు నెట్టుతూ, లోపలికి పోయేందుకు దారి చేయసాగారు.

భల్లూక మాంత్రికుడూ, కాళీవర్మా తమ వాహనాలెక్కి, తలారి భల్లూకుడూ వాళ్లతో, "మనమంతా కలిసి పదిమందికి మించిలేము. మనం ముఖ్యంగా చేయవలసింది మాయామర్కట రూపంలో వున్నవాడి నుంచి మంత్ర దండాన్ని లాక్కోవటం, తరవాత దుర్ముఖరాజు ప్రాణాలు కాపాడటం. అందుకు మీలో ప్రతి ఒక్కరూ మంచిసాహసం, తెగింపూ చూపవలసి వుంటుంది," అన్నారు.

అందరూ ఆయుధాలెత్తి, యీసారి, "కాళీవర్మకూ, జై!" అంటూ కేక పెట్టారు.



కాళీవర్మ గుర్రం మీద ముందుండి కోటలోపలికి దారితీస్తూ, చప్పున ఏదో గుర్తు వచ్చినవాడిలా గుర్రాన్ని వెనక్కు తిప్పి, "ఆ ఉగ్రదండు డనే రాక్షసు డెక్కడ?" అన్నాడు.

ఆ సమయంలో ఉగ్రదండుడు ఒక ఏనుగు తొండం పట్టుకుని వెంట నడుపుతూ, దూరంగా నిలబడివున్న రాజు జితకేతుడి మంత్రి జీవగుప్తుడి కేసి పోతున్నాడు. అది చూస్తూనే కాళీవర్మ ఆశ్చర్యపడిపోతూ, భల్లూక మాంత్రికుడితో, "గురూ, చూడగా యీ రాక్షసుడు మన శత్రువైన జితకేతుడి పక్షాన చేరేందుకు పోతున్నట్టున్నది," అన్నాడు.



గుర్రం మీద కాళీవర్మ, ఏనుగుల మీద తలారిభల్లూకుడూ, అంగరక్షకులూ తన కేసి రావటం చూస్తూనే రాక్షసుడు ఉగ్రదండుడు ఒక క్షణకాలం ఆశ్చర్య పోయి, ఎందుకైనా మంచిదన్నట్టుగా రాతిగదను కుడిచేత్తో పైకెత్తి పట్టుకుని, ఏనుగును తొండం పట్టుకుని లాగి, వాళ్ళ కేసి తిప్పి, నిలబడ్డాడు.

కాళీవర్మ, ఉగ్రదండుణ్ణి సమీపిస్తూనే, "ఉగ్రదండా, ఏమిటిది? మాతోపాటు కోటలోకి వచ్చి, సామంతు సూర్య భూపతి నుంచి రాజు దుర్ముఖుణ్ణి రక్షిస్తా వనుకున్నామే," అన్నాడు.

"కాళీవర్మా, రాజు దుర్ముఖుడు యింకా బతికేవుంటాడనేనా, నీ నమ్మకం?" అని అడిగాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

"అతడు ప్రాణాలు కోల్పోయి వుంటా డని, నీ కెందుకు అనుమానం కలిగింది? కోటలో అతడి పక్షాన కొందరు సైనికు లున్నట్టు తెలయటం లేదా? అలా కాకపోతే, ఆ వినిపిస్తున్న యుద్ధం గొడ వంతా ఎవరిమధ్య జరుగుతున్నట్టు?" అన్నాడు కాళీవర్మ.

రాక్షసుడు ఉగ్రదండుడు, దూరంగా వున్న మంత్రి జీవగుప్తుడి సైనికుల కేసి చేయి చూపుతూ, "కాళీవర్మా, మీరంతా కోటద్వారాల ముందు ఉబుసుపోని

"అలా అయుండదు. వాడికి నాతో ఏదో పనివున్నట్టు తెలిసింది. వెంటనే పోయి మంచి మాటలతో సంగతేమిటో తెలుసుకో," అన్నాడు భల్లూక మాంత్రికుడు.

ఈ మాటలు వింటూనే తలారి భల్లూకుడు, మరొక ఏనుగుమీదవున్న దుర్ముఖుడి అంగరక్షకులతో, "ఒరే, అంగరక్షక భటులారా! ఆ రాక్షసుడు కాళీవర్మదొర మీద తిరగబడతాడేమో, ఎందుకైనా మంచిది, మనం ఏనుగులతో ఆయన వెన్నుకాస్తూపోదాం," అంటూ ఆటవికుడిని ఆజ్ఞాపించి, ఏనుగును కాళీవర్మ గుర్రం వెనకగా నడిపించాడు.

కబుర్లతో కాలయాపన చేశారు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. త్వరగా కోటలోకి జొరబడి రాజు దుర్ముఖుణ్ణి రక్షించటంతోపాటు, ఆ మాయామర్కటం నుంచి మంత్రదండాన్ని కూడా సంపాయించండి.'' అన్నాడు.

''ఆ పనే చేయబోతున్నాం. మరి, యీ ఏనుగును వెంటబెట్టుకుని నీ ప్రయాణం ఎక్కడికి?'' అని అడిగాడు కాళీవర్మ.

రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను జీవగుప్తుడూ వాళ్ళ కేసి ఊపుతూ, ''ఆ మంత్రీ, అతడి వెంటవున్న సైనికులూ కోటలోపల మిమ్మల్ని వెనకపాటుగావచ్చి హతం చేయకుండా, వాళ్ళ దారిని అడ్డుతున్నాను.'' అన్నాడు విసుగ్గా.

ఆ మాటలతో తృప్తిపడి కాళీవర్మ, తలారిభల్లూకుడూ వాళ్ళతో తిరిగి కోట ద్వారం దగ్గిరకు వచ్చాడు. తరవాత అందరూ భీకరంగా అరుస్తూ కోటలో ప్రవేశించారు. రెండు ఏనుగుల మీద కత్తులూ, గండ్రగొడ్డలీ పట్టినవాళ్ళూ; గుర్రం మీద కాళీవర్మా, ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ, వాళ్ళ వెనకగా నానాహంగామా చేస్తూ దొంగనాగమల్లూ, అతడి అనుచరులూ లోపలికి రావటం చూస్తూనే అంతవరకూ సామంతుడి



పక్షాన, రాజు దుర్ముఖుడి సైనికులతో పోరాడుతున్నవాళ్ళు భయకంపితులై పోయి, ''సూర్యభూపతి మహారాజా! భల్లూక మాంత్రికుడు ఏనుగుల మందతో వస్తున్నాడు. ప్రస్తుతానికి పారిపోవటం క్షేమం!'' అంటూ కేకలు పెట్టారు.

ఆ వెంటనే ఒక చిన్న కట్టడం వెనక నుంచి సామంతు సూర్యభూపతి గుర్రం మీద, నెత్తురోడుతున్న కత్తితో చప్పున ముందుకు వచ్చి, ''ఒరే, మీరు భయపడకండి! దుర్ముఖుడి పక్షం చేరిన వాళ్ల నందర్నీ దాదాపు హతమార్చాం. ఈ భల్లూక మాంత్రికుడు మనను ఏం చేయగలడు? మర్కట రూపంలో మన పక్షాన



వున్నవాడు, భల్లూకమాంత్రికుణ్ణి మించిన మంత్రశక్తులున్నవాడు.'' అంటూ కేక పెట్టాడు.

సామంతుణ్ణి చూస్తూనే కాళీవర్మ గట్టిగా పళ్ళు కొరికి, ''ఒరే, సామంతూ! కోతులసాయంతో యుద్ధాలు గెలవాలని చూస్తున్నావా? రాజుదుర్ముఖు డెక్కడ? అతడి చేతే స్వయంగా నీ తల నరికించ బోతున్నాను,'' అన్నాడు.

అంతలో కట్టడం పిట్ట గోడమీదికి మాయామర్కటం ఛెంగుమని దూకుతూ కిచకిచ మంటూ అరిచింది. అందరూ తలలెత్తి దానికేసి చూశారు. మర్కటం కుడిచేతిలో మంత్రదండం వున్నది. అది తన ఎడమచేతిలో ఒక తలను జుట్టు పట్టుకుని వేలాడిస్తూ, ''ఓయ్‌, కాళీవర్మా! రాజు దుర్ముఖుడు ఎక్కడున్నాడని అడిగావు కాదా? ఇదుగో, అతడి తెగిన తల! మొండెం ఎక్కడున్నదో నువ్వు వెతికి కనుక్కునేలోపల, నీ తల కూడా యిలాగే రాజు సూర్యభూపతి కత్తి దెబ్బకు తెగి నేలపడుతుంది,'' అన్నది.

ఆ వెంటనే భల్లూక మాంత్రికుడు కత్తి దూసి, ఎనుబోతు వాహనాన్ని ముందుకు నడుపుతూ, ''ఒరే, మర్కట రూపంలో వున్న దుష్టుడా, భ్రాంతిమతీ! నా మంత్ర దండాన్ని దొంగిలించ గలిగానని సంతోషించకు. ఈ ఖడ్గం దానికేమీ తీసిపోదు. నీ గురువు తాంత్రిక మిథ్యామిశ్రుడు కూడా, ఆ బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలు వదిలి, యీ అరణ్యప్రదేశాలు తిరుగుతున్నాడా?'' అన్నాడు.

ఆ మాటలకు మాయామర్కటం హేళనగా కిచుమంటూ పెద్దగా అరిచి, ''ఏయ్‌, భల్లూక మాంత్రికా! నా గురువు ఎక్కడవున్నదీ, నీ మంత్రశక్తితో ఏ అంజనమో వేసి తెలుసుకోలేవా? బహుశా ఆయన నీ గురువైన భల్లూకపాదుడి తల నరికేందుకు, మంచు రాళ్ళమీద కత్తికి పదును పెడుతూంటాడు,'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు పట్టరాని కోపంతో కసిగా పళ్ళుకొరికి, "శిష్యా, కాళీవర్మా! తలారిభల్లూకా! ఈ కోట ద్వారం దగ్గిర సరిఅయిన కాపుపెట్టండి. ఈ మాయా మర్కటుడినీ, సామంతుణ్ణీ ప్రాణాలతో పట్టుకుని చిత్రవధ చేస్తాను," అన్నాడు.

మాంత్రికుడు మాట ముగించేలోపలే తలారిభల్లూకుడి ఏనుగుమీదవున్న ఆటవికుడు వదిలినబాణం రివ్వుమంటూ పోయి, మాయామర్కటం తెగిన తలను పట్టుకునివున్న చేతికి తగిలింది. బాణం దెబ్బ తింటూనే మర్కటం బాధతో పెద్దగా అరవటంతోపాటు, దాని చేతిలో వున్న శిరస్సు జారి అంత ఎత్తునుంచి దభీమంటూ కిందపడింది.

శిరస్సు నేలపడగానే మరొక ఏనుగు మీదవున్న రాజు దుర్ముఖుడి అంగరక్షకులిద్దరూ కిందికి దూకి, పరుగునపోయి శిరస్సు కేసి చూస్తూనే, "ఇది దుర్ముఖ మహారాజు తల కాదు. ఆ మాయకోతి మనను మోసంచేయ చూసింది," అన్నారు.

ఆ వెంటనే తలారిభల్లూకుడు, "దిరిశెనవన, భైరవా!" అంటూ కేక పెట్టి, గండ్రగొడ్డలి పైకెత్తి, "ఒరే, ఆటవికసేవకా! మాయామర్కటాన్ని కొట్టి అద్భుతమైన పని చేశావు. ఆ దుర్ముఖ



రాజు కోసం మనం కోట అంతా గాలించబోతున్నాం. నా గండ్రగొడ్డలికి అందని వాళ్ళను, నీ బాణాలతో పరలోకానికి ప్రయాణం కట్టించు," అంటూ ఏనుగు తల మీద గొడ్డలిపిడితో గట్టిగా పొడిచాడు.

ఏనుగు పెద్దగా ఘీంకరిస్తూ కదిలింది. ఈ లోపల మాయామర్కటం పిట్టగోడ మీది నుంచి కనబడకుండా పోవటంతో, కాళీవర్మ, భల్లూక మాంత్రికుడితో, "గురూ, ముందు మనం సామంతుణ్ణీ, వాడి సైనికులనూ తరిమికొట్టాలి. రాజు దుర్ముఖుడు యీ కోటలో ఏదో ఒక ప్రాంతాన ప్రాణాలతో వున్నాడనే నా నమ్మకం," అన్నాడు.

''భల్లూకపాదగురో!'' అంటూ భల్లూక మాంత్రికుడు కత్తి పైకెత్తి, ''ఒరే, రాజు దుర్ముఖుడి పక్షాన నిలబడే సైనికులంతా మా వెంట రండి. ఎదురు తిరిగిన వాళ్ళను నా కత్తికి బలి చేస్తాను,'' అంటూ పెద్దగా కేక పెట్టాడు.

అప్పటివరకూ సామంతుడి పక్ష సైనికుల ధాటికి తట్టుకోలేక కోటలో అక్కడా, యిక్కడా దాగి వున్న రాజు దుర్ముఖుడి సైనికులు బిలబిలమంటూ మాంత్రికుడున్న చోటుకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''అయ్యా, రాజుగారు శత్రుబలానికి జంకి సభామంటపంలోని సింహాసనం వున్న గదిలో దాగి వున్నారు,'' అని చెప్పారు.

''అయితే ముందుండి దారి తీయండి. మీ కొచ్చిన ప్రాణ భయం ఏమీ లేదు. శత్రుసైనికుల సంగతి మేం చూస్తాం,'' అన్నాడు కాళీవర్మ.

కాళీవర్మా, భల్లూకమాంత్రికుడూ సభామంటపానికి వెళ్ళే దారిలో ఒక్కగానొక్క శత్రువైనా కంటబడలేదు. వాళ్ళు కోటలో మరొక భాగానచేరి సామంతుడూ, మాయామర్కటాలతో యిప్పుడేమి చేయటమా అని ఆలోచిస్తున్నారు.

కాళీవర్మా, మాంత్రికుడూ సభామంటపాన్ని సమీపిస్తున్నంతలో తలారిభల్లూకుడు ఏనుగు మీద అక్కడికి వచ్చాడు. ఆ మరుక్షణం మంటపంలో సింహాసనం వున్న గది తలుపులు బార్లా తెరుచుకున్నవి. రాజు దుర్ముఖుడు సింహాసనం మీద కూర్చుని వున్నాడు.

కాళీవర్మతోపాటు అందరూ ఆశ్చర్యపోయి చూసేంతలో రాజు దుర్ముఖుడు చేయెత్తి, ''తలారిభల్లూకా! తిరిగి కొద్దిసేపైనా సింహాసనం మీద కూర్చోవాలనే, నా కోర్కె తీరింది. ఇప్పుడు నిరభ్యంతరంగా నా తల నరికి, నీ గురువుకు సమర్పించుకో!'' అన్నాడు.

ఆ వెంటనే తలారిభల్లూకుడు ఉత్సాహంగా ఒక కేకపెట్టి, గండ్రగొడ్డలి పైకెత్తి, ఏనుగు మీది నుంచి, సభామంటపంలోకి ఎగిరిదూకాడు. —(ఇంకా వుంది)





# భల్లూక మాంత్రికుడు

## 15

[కాళీవర్మ తన అనుచరులతో కోటలో ప్రవేశించాడు. మాయామర్కటం తెగిన తల నొకదాన్ని వాళ్ళకు చూపింది. అది రాజు దుర్ముఖుడిది కాదని వాళ్ళు గ్రహించి, అతడి కోసం వెతుకుతున్నంతలో, సభామంటపం లోని సింహాసనం మీద దుర్ముఖుడు కనిపించాడు. ఆ మరుక్షణం తలారిభల్లూకుడు ఏనుగు మీదినుంచి గొడ్డలితో సభామంటపంలోకి దూకాడు. తరవాత—]

తలారి భల్లూకుడు సభామంటపం లోపలికి దూకటం చూస్తూనే కాళీవర్మ రానున్న ప్రమాదాన్ని గుర్తించి, ఏనుగు మీద వున్న ఆటవికుడితో, "ఒరే, ఆటవికా! చప్పున పోయి భల్లూకుడు రాజు దుర్ముఖుడి తల నరక్కుండా అటకాయించు," అని, పెద్ద గొంతుతో, "తలారి భల్లూకా, నేను వస్తున్నాను. రాజును చంపకు," అని కేకపెట్టి, మెట్ల మీదుగా సభామంటపంలోకి పరిగెత్త సాగాడు.

కాళీవర్మ హెచ్చరిక వింటూనే, ఆటవికుడు ఏనుగు మీది నుంచి దూకి, పరుగున పోయి తలారి భల్లూకుడికి అడ్డంగా నిలబడుతూ, "భల్లూకయ్యా, తొందరపడకు. కాళీవర్మ దొర, రాజు తల నరకవద్దని హెచ్చరిస్తున్నాడు," అన్నాడు.



తలారి భల్లూకుడు ఆశ్చర్యపడుతూ, ''తనను అవమానించిన యీ రాజు తల నరికి తెమ్మని భల్లూక మాంత్రికులవారి ఆజ్ఞ కదా! ఆయన ఆజ్ఞ నెరవేర్చకపోతే, తిరిగి నన్ను సొంతం ఎలుగుబంటుగా మార్చేస్తాడు,'' అన్నాడు.

అంతలో అక్కడికి కాళీవర్మ చేరి, సింహాసనంలో కదలా మెదలక కూర్చుని వున్న రాజు దుర్ముఖుడి కేసి ఒకమారు చూసి, వింతపడుతూ, ''ఈ రాజు కేమయింది? అలా కళ్ళు మూసుకుని చలనం లేకుండా వున్నాడేం?'' అన్నాడు.

తలారి భల్లూకుడు గండ్రగొడ్డలిని భుజం మీద పెట్టుకుని, ''కాళీవర్మ దొరా, ఏమిటి మీ ఆజ్ఞ? ఈ రాజు తల నరకవద్దంటారా?'' అని అడిగాడు.

కాళీవర్మ, దుర్ముఖుడిని సమీపించి, ''భల్లూకా, నువు తల నరక్కుండానే, యీ దుర్ముఖుడు ప్రాణం వదిలినట్టుంది. ఏం జరిగివుంటుంది? గండ్రగొడ్డలితో నువ్వు మీదికి రావటం చూసి, ఆ భయంలో యితడి గుండె ఆగిపోలేదు కదా?'' అన్నాడు.

''తలారి భల్లూకుడు, దుర్ముఖుడి తల నరికివేశాడా ఏం?'' అంటూ భల్లూక మాంత్రికుడు అక్కడికి వచ్చి, సింహాసనంలో కదలా మెదలక వున్న రాజును చూసి, ''పాపం, ప్రాణభీతితో మూర్ఛ పోయి వుంటాడు,'' అంటూ కత్తిని అతడి భుజానికి తాకిస్తూ, ''రాజా దుర్ముఖా! మూర్ఛ తేరుకో. నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు,'' అన్నాడు.

ఆ వెంటనే దుర్ముఖుడు కళ్ళు తెరిచి, చేతులతో తలను తడివి చూసుకుంటూ, ''ఆహాఁ, నా శిరస్సు ఎంత చేవగలది! తలారి భల్లూకుడి గండ్రగొడ్డలి దెబ్బకు చెక్కు చెదరకుండా నిలబడిందన్నమాట!'' అన్నాడు.

ఆ మాటలకు అందరూ పెద్దగా నవ్వారు. దుర్ముఖుడు గాభరాపడుతూ సింహాసనం మీదినుంచి లేచి, ''కాళీ

వర్మా. మాంత్రికులూ అందరూ యిక్కడే వున్నారన్నమాట! మరొకసారి సింహాసనం మీద కూర్చోవాలన్న కోర్కె తీరింది. ఇక నా తల తెగిపోయినా, నే విచారించను,'' అన్నాడు.

కాళీవర్మ, దుర్ముఖుడి భుజాలు పట్టుకుని సింహాసనంలో కూర్చోబెట్టి, ''రాజా దుర్ముఖా, నువ్విప్పుడు మా మిత్రుడివి. జరిగిందంతా మరిచిపో. నీ కోట ఆక్రమించిన సామంతు సూర్యభూపతీ, నా గురువు భల్లూకమాంత్రికుల మంత్ర దండాన్ని అపహరించిన మాయామర్కటం యిప్పుడు ఏకమయ్యారు. ముందు మనం వాళ్ళను పట్టుకోవాలి,'' అన్నాడు.

కాళీవర్మ యిలా అనగానే రాజు దుర్ముఖుడు ఎక్కడలేని సంతోషంతో సింహాసనం మీది నుంచి వేగంగా సభామంటపం ముందుకు వచ్చి, కత్తి పైకెత్తి పట్టుకుని, పెద్దగొంతుతో, ''ఒరే, ఉదయగిరి రాజునైన నేను ఆజ్ఞాపిస్తున్నాను! విశ్వాసపాత్రులైన సైనికులంతా తక్షణం యిక్కడికి రండి. అలా రానివాళ్ళను రాజద్రోహులుగా భావించి, శిరశ్ఛేదాలు చేయిస్తాను,'' అన్నాడు.

తలారిభల్లూకుడు మంటపం పిట్టగోడ మీద నిలబడి, గండ్రగొడ్డలి ఝుళిపిస్తూ, ''ఓహో(, కోటలో అక్కడా యిక్కడా,



మారుమూల దాగివున్న వాళ్లంతా, దుర్ముఖ రాజుగారి ఆజ్ఞ విన్నారా? అందరూ రెక్కలు కట్టుకుని మరీ వచ్చి ఇక్కడ వాలాలి,'' అన్నాడు భీకరస్వరంతో.

ఆ మరుక్షణం కోట అన్ని ప్రాంతాల నుంచీ సైనికులు సభామంటపం ముందుకు రాసాగారు. నాలుగైదు నిమిషాల కాలం గడిచిన తరవాత కాళీవర్మ వాళ్ళనందరినీ లెక్కించి, రాజు దుర్ముఖుడితో, ''రాజా దుర్ముఖా! నీ సైనికులందరూ కలిసి నలభైమంది కన్న ఎక్కువ లేరు. ఇదేనా ఉదయగిరి రాజువైన నీ సైనిక బలం?'' అని అడిగాడు.



రాజు దుర్ముఖుడు అవమానభారంతో తల వంచుకుని, ''కాళీవర్మా, నా సైనికులందర్నీ ఆ సామంతు సూర్యభూపతి ధనాశ చూపించి తన పక్షం చేసుకున్నట్టున్నది. ముందు మనం ఆ ద్రోహిని వెతికిపట్టుకోవాలి,'' అన్నాడు.

కాళీవర్మ, భల్లూకమాంత్రికుడి కేసి తల తిప్పి, "గురూ, ఏమిటి తమ ఆజ్ఞ?" అని అడిగాడు.

భల్లూకమాంత్రికుడు సభామంటపం పిట్టగోడ నానుకు నిలబడి, కోట గోడల కేసి చూస్తున్నాడు. అతడికి తన మంత్రదండం పోవటం చాలా బాధగా వున్నది. అంతేకాక యిప్పుడు తానా ప్రాంతాలు వదిలిపోతే, రాజు దుర్ముఖుడు శత్రువుల వల్ల చిక్కుల పాలవుతాడు. పైగా, యిప్పటి పరిస్థితులలో కాళీవర్మ కూడా తన గురువైన భల్లూకపాదుడు వున్న ప్రాంతానికి రా నిరాకరించవచ్చు...

భల్లూకమాంత్రికుడు యిలా ఆలోచిస్తూ, కాళీవర్మతో, ''శిష్యా కాళీ! నా ఆజ్ఞల మాట అలా వుంచుదాం. నువ్వు ఏం చేయాలనుకుంటున్నావు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు కాళీవర్మ ఆశ్చర్యపోతూ, ''గురూ, యిదేం ప్రశ్న! ఒకసారి నన్ను తమ గురువుగారుండే భల్లూకపాద పర్వతాకు రమ్మని అడిగారు. ఆ మాట మరిచారా?'' అన్నాడు.

ఆ జవాబుకు భల్లూకమాంత్రికుడు ఆనందపడుతూ, ''శిష్యా కాళీ! నీ గురుభక్తి మెచ్చదగింది. నా గురువైన భల్లూకపాదుడు ఒకానొక తాంత్రికుడి కారణంగా ప్రస్తుతం చిక్కుల్లో వున్నాడు. అతడికి నీవంటి ధైర్యసాహసాలుగల వాడి నుంచి కొంత సహాయం కావాలి. అందుకు ప్రతిఫలంగా నువ్వు కోరేదేమిటో చెప్పు?'' అన్నాడు.

కాళీవర్మ ఒక్కక్షణం ఆలోచించి, ''గురూ, ప్రతిఫలాల మాట తరవాత చూద్దాం. రాజు జితకేతుడు నాకు శిర

ఛ్ఛేద శిక్ష విధించినప్పుడు దిరిశెనవనంలో మీరు నాకు చాలా సాయపడ్డారు. అప్పుడే మీకు అన్నివిధాలా సహాయపడగలనని మాట యిచ్చాను. ఇప్పుడేం చేయాలో ఆజ్ఞాపించండి,'' అన్నాడు.

''అలా అయితే, నువ్వు నాతోపాటు బ్రహ్మపుత్రానది జన్మస్థాన ప్రదేశాన వున్న భల్లూకపాద పర్వతాలకు రావాలి,'' అన్నాడు భల్లూకమాంత్రికుడు.

''సరే, బయలుదేరండి!'' అంటూ కాళీవర్మ కదిలాడు.

రాజు దుర్ముఖుడు నిలువెల్లా వణికి పోతూ, ''మాంత్రిక ప్రభో! తమరు నా మాట మరిచినట్టున్నది. ఈ కొద్ది మంది సైనికులతో నేను రాజుగా మన గలగటం అసాధ్యం. నేనూ తమ వెంట భల్లూకపాద పర్వతాలకు వస్తాను,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఏదో అనబోయేం తలో తలారిభల్లూకుడు గండ్రగొడ్డలిని నేలకువేసి కొట్టి, ఏడ్పు గొంతుతో, ''అయ్యో, నా సంగతేమిటి? మీరంతా యిక్కణ్ణించి వెళ్లిన తరవాత నా పాత యజమాని జితకేతరాజు, తన ఆజ్ఞ ధిక్క రించినందుకు నన్ను అడవిమృగం కింద వేటాడేస్తాడు. నన్నూ తమ వెంట తీసుకు పొండి,'' అన్నాడు.



భల్లూకమాంత్రికుడు చిరునవ్వు నవ్వి, తలారిభల్లూకుడి భుజం తడుతూ, ''భల్లూకా, భయపడకు! నేను, నీ సంగతీ రాజు దుర్ముఖుడి సంగతీ మరిచిపోయా ననుకోకు. మీ యిద్దరి క్షేమం చూశాకే నేనీ ప్రాంతాల నుంచి వెళతాను. చంద్ర శిలా నగరరాజు ఆ జితకేతుడు కాళీ వర్మతోపాటు నన్నూ అవమానించాడు. మనం ముందు ఆ నగరం పోయి, ఆ రాజు అంతేదో చూడవలసి వున్నది,'' అన్నాడు.

''ఆ పొగరుబోతు రాజు మంత్రి అయిన జీవగుప్తుడు కొద్దిమంది సైనికులతో కోట వెలపల కాపలా వేసివున్నాడు. వాడు

శిలా నగరం కేసి పారిపోయినా పారిపోతారు,'' అన్నాడు.

"సరే, నువ్వు అలాగే వెళ్ళు. మేం ఒకసారి ఆ సామంతూ, మాయామర్కటాల కోసం కోట ప్రాంతాలు గాలించి, వెనగ్గా వస్తాం,'' అన్నాడు కాళీవర్మ.

''ఒరే, అటవిక సేవకా! ఏనుగును మంటపం కేసి మరి కాస్త ముందుకు తీసుకురా,'' అని కేక పెట్టాడు తలారి భల్లూకుడు.

ఆటవికుడు ఏనుగును మంటపం దరికి నడపగానే తలారి భలూకుడుపోయి దాని మీద కూర్చున్నాడు. అంతవరకూ మౌనంగా వుండి అంతా శ్రద్ధగా వింటున్న రాజు దుర్ముఖుడు, భల్లూక మాంత్రికుడితో, ''మాంత్రిక ప్రభో! నేను యీ కొద్దిమంది సైనికులతో, యీ కోటలో వుండటం క్షేమం కాదు. మీ వెంట నేనూ బయలుదేరి చంద్రశిలానగరం వస్తాను,'' అన్నాడు.

''నేనూ అదే చెప్పబోతున్నాను. నీ నలభైమంది సైనికులతో నువ్వు కొత్తగా ఒక రాజ్యాన్నే జయించబోతున్నావు, సరా?'' అన్నాడు భల్లూక మాంత్రికుడు.

ఆ తరవాత అందరూ సభామంటపంలో నుంచి కిందికి వచ్చి, సామంతు, మాయామర్కటాలను వెతికేందుకు.



హఠాత్తుగా మన మీద వచ్చి పడకుండా రాక్షసుడు ఉగ్రదండుడు అడ్డుగా నిలబడ్డాడు. మరి, యీ సామంతుడు సూర్యభూపతీ, మాయామర్కటం కోటలో ఏ మూలనైనా దాగివున్నారో, లేక పారిపోయారో తెలియటం లేదు,'' అన్నాడు కాళీవర్మ.

కాళీవర్మ యిలా అనగానే తలారి భల్లూకుడు గండ్రగొడ్డలి భుజాన పెట్టుకుని, ''కాళీవర్మ దొరా! నేను ఏనుగు మీద ముందుగా కోట బయటికి పోయి, పరిస్థితి ఎలా వున్నదో చూస్తాను. రాక్షసుడు ఉగ్రదండుడికి నేను తోడుగా రావటం చూస్తూనే, ఆ మంత్రీ, సైనికులూ చంద్ర

సైనికులను అజ్ఞాపిస్తున్నంతలో కోట గోడల మీది కెక్కిన రాజు దుర్ముఖుడి అంగరక్షకు లిద్దరూ ఏక కంఠంగా, "మహా రాజా, మన సామంతూ, మాయకోతీ జితకేతరాజు మంత్రి పక్కన వున్నారు. వాళ్ళు రాక్షసుడితో ఏదో మాట్లాడు తున్నారు,'' అని కేక పెట్టారు.

''గురూ, యిలా జరుగుతుందన్న అనుమానం నాక్కలగక పోలేదు. కాలిన కోట ద్వారాల దగ్గిర మనం తగిన కాపలా పెట్టవలసింది. బహుశా ఆ దుర్మార్గులు రాక్షసుడు ఉగ్రదండుణ్ణి తమ పక్షం చేసుకునే ప్రయత్నాలు చేస్తూ వుండి వుంటారు,'' అన్నాడు కాళీవర్మ.

''కాళీ, ఆ ప్రయత్నాలేమీ ఫలించవు. ఆ రాక్షసుడు నా నుంచి ఏదో సాయం ఆశిస్తున్నాడు. ఇక మనం బయలుదేరు దాం,'' అన్నాడు భల్లూక మాంత్రికుడు.

కాళీవర్మ ఊహించినట్టే రాజు జిత కేతుడి మంత్రి జీవగుప్తుడు, ఉగ్రదండు డికి పెద్ద పెద్ద ఆశలు చూపి, తన పక్షం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు. అందుకు మాయామర్కట రూపంలో వున్న భ్రాంతిమతి వంత పాడుతున్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి పట్టుకుని, "నాకు మీ ఎవరి నుంచీ సహాయం అవసరంలేదు. భల్లూక పాద



పర్వతాల్లో నా బంధు వొకడున్నాడు. అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేయాలి,'' అంటున్నాడు.

ఆ మాటలకు మాయామర్కటుడు హేళనగా కిచకిచమంటూ అరిచి, ''ఉగ్ర దండా, ఆ బంధు వెవరు, నీ అన్నే గదా? ఇంకా బంధ విముక్తేమిటి? నా గురువు తాంత్రిక మిథ్యామిశ్రుడు అతణ్ణి ఏనాడో భూస్థాపితం చేశాడు. నువు బుద్ధిగా యిక్కడే, జితకేతరాజు ఆశ్రయంలో వుంటూ సుఖంగా కాలం వెళ్ళబుచ్చటం మంచిది,'' అన్నాడు.

''నా అన్నను ఆ తాంత్రికుడు నిజంగా చంపాడా? లేక నువు అబద్ధం ఆడు

తున్నావా ?'' అంటూ ఉగ్రదండుడు పళ్ళు కొరికాడు.

మాయామర్కటుడు ఏదో అనబోయేంతలో మంత్రి జీవగుప్తుడు అతణ్ణి వారిస్తూ, ''ఉగ్రదండా! గతం అంతా మరిచిపో. మా రాజ్యంలో మహా బలశాలి అయిన రాక్షసుడొకడున్నాడన్నది మాకెంతో గర్వ కారణంగా వుంటుంది. అలాగే నువ్వు శేషజీవితాన్ని మా రాజుగారి చల్లని నీడలో సుఖంగా గడిపెయ్యవచ్చు.'' అన్నాడు.

"అంటే, నా నుంచి ఎలాంటి సహాయం కోరకుండానే, మీ రాజు నాకు ఆతిథ్యం యిస్తాడన్నమాట, అవునా ?'' అన్నాడు ఉగ్రదండుడు.

''నీ నుంచి ఒకే ఒక సహాయం చాలు. మేం యిప్పుడు కోటలో ప్రవేశించబోతున్నాం. అక్కడ భల్లూక మాంత్రికుణ్ణీ, కాళీవర్మ అనే నేరస్థుణ్ణీ, రాజు దుర్ముఖుణ్ణీ నిలువునా చీల్చి చెండాడేందుకు కొంచెం సహాయపడు, చాలు!'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

ఉగ్రదండుడు జవాబివ్వబోయేంతలో కోటలో నుంచి ఎనుబోతు వాహనం మీద వున్న భల్లూక మాంత్రికుడితో పాటు అందరూ ఒక్కసారిగా బయిటికి వచ్చారు. వాళ్ళను చూసి భయకంపితుడై పోయి, మంత్రి ఏమి చేయటమా అని ఆలోచిస్తూ, పక్కనే గుర్రాల మీద వున్న సామంతూ, మాయామర్కటాల కేసి చూశాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఒకసారి పెద్దగా హుంకరించి, ''మంత్రీ! సహాయం చేయమన్నావు గదా ? ఇదిగో, నీకూ, నీ వెంట వున్న దుష్టగణానికీ నే చేయబోతున్న సహాయం యిది!'' అంటూ రాతి గద ఎత్తి, అందుబాటులో వున్న మాయామర్కటుడి తల కేసి విసిరాడు.

మాయామర్కటుడు మెరుపు వేగంతో కీచుమంటూ గుర్రం మీది నుంచి పైకెగిరాడు. ఉగ్రదండుడి రాతి గద పోయి అతడెక్కి వున్న గుర్రం తలను తాకింది. —(ఇంకా వుంది)





# భల్లూకమాంత్రికుడు

## 16

[భల్లూకమాంత్రికుడు, రాజు దుర్ముఖుణ్ణి క్షమించి, మాయామర్కటం కోసం వెతక సాగాడు. అంగరక్షకులు మర్కటం మంత్రి జీవగుప్తుడి దగ్గిర వున్నదని చెప్పారు. కాళీవర్మతో పాటు మాంత్రికుడు అక్కడికి బయలుదేరాడు. ఈ లోపల రాక్షసుడు ఉగ్రదండుడు, మర్కటాన్ని గదతో కొట్టేంతలో, అది గుర్రం మీది నుంచి పైకెగిరింది. తరవాత—]

మాయామర్కటుడు రాతిగదదెబ్బ తప్పికుని, పైకెగరటం చూస్తూనే రాక్షసుడు ఉగ్రదండుడు కోపం పట్టలేక, గదను చేతికి తీసుకుని మరొకసారి వాణ్ణి కొట్టబోయేంతలో, తల మీద దెబ్బతిన్న గుర్రం పెద్దగా సకిలిస్తూ, పారిపోబోయి మరొక గుర్రాన్ని ఢీకొట్టింది. ఆ తాకిడికి గుర్రం మీది సైనికుడు కింద పడ్డాడు. మాయామర్కటుడు మెరుపు వేగంతో ఆ గుర్రం మీద ఎక్కి కూర్చుని, దాని కళ్ళాలు లాగి, నగరం కేసి తిప్పాడు.

ఉగ్రదండుడు గద పైకెత్తి మర్కటుడి కేసి బయలుదేరేంతలో, వాడు గుర్రాన్ని దూరంగా పరిగెత్తించి, మంత్రి జీవగుప్తుడితో, ''జీవగుప్తా, నువ్వేమన్న మంత్రివే గాని, నీ ఎత్తుగడ ఒక్కటీ పారలేదు. నేను ముందుగా చంద్రశిలానగరం పోయి, రాజు జితకేతుడితో యిక్కడ



జరిగినదంతా చెప్పి, నగరరక్షణకు తగిన ఏర్పాట్లు చేస్తాను,'' అన్నాడు.

మంత్రి జీవగుప్తుడు కోటలో నుంచి తన కేసి వస్తున్న భల్లూకమాంత్రికుణ్ణీ, కాళీవర్మనూ చూసి గడగడ వణికి పోతూ,'' మాయామర్కటా, కొంచెం ఆగు! మహా బలవంతులైన రాక్షసుడూ, మాంత్రికుడూ లాంటి వాళ్ళ నుంచి నగరాన్ని ఎవరు మాత్రం కాపాడగలరు? నా మాట విను, ప్రస్తుతానికి మనం అరణ్యంలోకి పారిపోదాం,'' అన్నాడు.

''మంత్రీ, అది భీరువులు చేసేపని! నేను మాత్రం ముందు ఆ జితకేత రాజును కలుసుకోవాలి. తరవాత యీ భల్లూక మాంత్రికుణ్ణీ, కాళీవర్మనూ హతమార్చే ఉపాయం ఆలోచిస్తాను,'' అంటూ మాయామర్కటుడు గుర్రాన్ని నగరం కేసి పరిగెత్తించాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఒకసారి గట్టిగా పళ్ళుకొరికి, ''ఒరే, మంత్రి! నీ వెంటవున్న సైనికుల మీదగాని, యీ సామంతు సూర్యభూపతి మీదగాని, నా కెలాంటి విరోధభావం లేదు. కాళీవర్మను ఊరి తియించే పథకం వేసి, యీ గందరగోళాని కంతకూ నువ్వే కారకుడివయ్యావు. నిన్ను తగిన విధంగా శిక్షించాలి, ముందు గుర్రం దిగు!'' అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించేంతలో మంత్రి జీవగుప్తుడు గుర్రాన్ని గట్టిగా అదిలించి, ''ఈ రాక్షసుడు మనల్ని విరుచుకు తినేస్తాడు. ప్రాణం మీద ఆశవున్న వాళ్ళందరూ, నా వెంటరండి,'' అంటూ నగరం కేసి బయలుదేరాడు.

సామంతు సూర్యభూపతీ, సైనికులూ కూడా మంత్రిని అనుసరించి పారి పోతున్నంతలో ఉగ్రదండుడు అందిన ఒక గుర్రం వెనకకాళ్ళు పట్టుకుని గుంజాడు. గుర్రంతోపాటు దానిమీదవున్న సైనికుడు కూడా కింద పడ్డాడు. ఉగ్రదండుడు సైనికుణ్ణి మెడ పట్టుకుని

పైకెత్తి, ''ఒరే, నీ కాళ్ళూ, చేతులూ విరిగినట్టులేదు. నువ్విటు అరణ్యం కేసి పారిపో. నగరం కన్న అదే నీకు క్షేమం," అంటూ కిందికి జార్చాడు.

అంతలో అక్కడికి భల్లూక మాంత్రికుడూ, కాళీవర్మా వచ్చారు. కాళీవర్మ నగరం కేసి పారిపోతున్న జితకేతుడి సైనికుల కేసి చూస్తూ, ''ఉగ్రదండా! మంత్రితోపాటు అంతమంది సైనికులను వదిలి, యీ చచ్చు సైనికుడొక్కణ్ణి పట్టుకున్నావా? నువ్వా జీవగుప్తుణ్ణి వదలవలసింది కాదు.'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు నిరుత్సాహపడిపోతూ, ''ఆ బుద్ధిమాలిన మంత్రిదేముందిగాని, నా మంత్రదండం దొంగిలించిన ఆ మాయామర్కటుణ్ణి బంధించినట్టయితే, నేను చాలా సంతోషించేవాణ్ణి." అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు కాళ్ళల్లో పట్టులేనివాడిలా నేల మీద చతికిలబడి, రాతిగదను అంత దూరంగా విసిరివేసి, ''భల్లూక మాంత్రికా! ఆ మాయామర్కటుడి ద్వారా చాలా పెద్ద దుర్వార్త విన్నాను. ఆ తాంత్రిక మిథ్యామిత్రుడు, నా అన్నను చంపివేసినట్టు, వాడు చెపుతున్నాడు. ఈ మాట నమ్మదగిందేనా?'' అని అడిగాడు.



''నీ అన్న పేరేమిటి?'' అన్నాడు భల్లూక మాంత్రికుడు.

''కాలదండుడు. ఆ పేరేమైనా లోగడ విన్నావా? అతడి నివాసస్థానం కూడా నువ్వనే భల్లూకపాద పర్వత ప్రాంతాలే,'' అన్నాడు ఉగ్రదండుడు.

భల్లూక మాంత్రికుడు కొంచెంసేపు ఆలోచించి, తల అడ్డంగా ఊపుతూ, ''ఉగ్రదండా! ఆ తాంత్రికుడు నా గురువును హతమార్చేందుకు అడ్డమైన వాళ్లందర్నీ కూడగట్టుకుంటున్నాడు. కొందర్ని తన తాంత్రిక శక్తులతో బంధించి ఊడిగం చేయిస్తున్నాడు. కాలదండుడు అన్న పేరుగల రాక్షసుణ్ణి నేనెరగను. ఒక సంగతి



గుర్తుంచుకో. కొద్దిపాటి క్షుద్రమంత్రశక్తులు గల ఆ మాయామర్కటుడి మాటలు మాత్రం నమ్మకు," అన్నాడు.

ఉగ్రదండుడు ఒకసారి శరీరం విదిలించి లేచి నిలబడుతూ, "నా అన్న బతికే వుంటాడని నా నమ్మకం. ఇప్పటికి కొన్నేళ్ళ క్రితం బ్రహ్మపుత్రానదీ లోయ ప్రాంతాలకు వచ్చిన తాంత్రిక శక్తులు గల వాళ్ళకు భయపడి నేని అరణ్యాలకు పారిపోయి వచ్చాను. వాళ్ళ మంత్ర తంత్రాల ముందు నా రాతి గద నిరుపయోగం. మంత్రశక్తుల్లో నీ గురువు వాళ్లను మించినవాడంటున్నావు గనక, నేను నీ వెంట ఆ ప్రాంతాలకు వచ్చి, ఆ దుష్టుల్ని సర్వనాశనం చేసేందుకు సాయపడతాను," అన్నాడు.

ఆ మాటలకు మాంత్రికుడితో పాటు కాళీవర్మ కూడా ఎంతగానో సంతోషించి, ఉగ్రదండుడితో, "ఉగ్రదండా! మనం త్వరలోనే యిక్కడి నుంచి బయలుదేరి, ఆ ఖల్లూక పాదపర్వత ప్రాంతాలకు పోగలం. కాని, ముందు మాయామర్కటుడి నుంచి మంత్రదండం తిరిగి సంపాయించాలి. దుష్టుడైన జితకేతరాజును తగిన విధంగా శిక్షించాలి," అన్నాడు.

ఆ వెంటనే తలారి ఖల్లూకుడు ఏనుగు మీది నుంచి, "దిరిసెనవన భైరవా!" అంటూ ఒక కేక పెట్టి, ముందుండి నగరం కేసి దారి తీశాడు.

ఈ లోపల గుర్రం మీద అతి వేగంగా చంద్రశిలానగరం కేసి పోయిన మాయామర్కటుడు నగర ద్వారాన్ని చేరాడు. అక్కడి కాపలా భటులు యిద్దరూ మర్కటుణ్ణి చూసి ఆశ్చర్యపోతూ, "కొండ ముచ్చులు గుర్రపు స్వారీ చేయుటమా? ఏమి వింత!" అంటూ కత్తులను గుర్రానికి అడ్డుగా పెట్టి, "ఓయ్, అట కోతీ, నీకేమైనా మాటలు వచ్చా?" అంటూ మర్కటుడి తోక పట్టుకోబోయారు.

మాయామర్కటుడు చెవులు దిబ్బెళ్లు పడేలా కీచుమంటూ పెద్దగా అరిచి,

"ఒరే, భటాధముల్లారా! నేను అట కోతిని కాదు; మంత్ర శక్తులు గల తాంత్రిక భ్రాంతిమతిని, దారి తొలగండి! మీ మహారాజును పెద్ద ప్రమాదం నుంచి కాపాడబోతున్నాను." అంటూ గుర్రాన్ని అదిలించాడు.

కాపలాభటుల్లో ఒకడు ఆ మాటలకు నివ్వెరపోయి, రెండడుగులు వెనక్కు వేశాడు. కాని, రెండవ భటుడు అన్నిటికీ తెగించి, కత్తిని మర్కటుడి తలకు గురి చేసి, "నువ్వు తాంత్రికుడివో, మాంత్రికుడివో నాకనవసరం. ముందు నా వెంట మా కాపలావాళ్ళ నాయకుడి దగ్గిరకు రా." అంటూ గుర్రం కళ్లెం పట్టుకోబోయాడు.

ఆ వెంటనే మాయామర్కటుడు తన చేతగల మంత్రదండంతో కాపలాభటుడి కత్తిని పక్కకు నెట్టాడు. మంత్రదండం తాకిడికి కత్తి మెరుపులా ఒక్కసారి ధగధగమని, మరుక్షణం ఎండుపుల్లలా భగ్గుమంటూ మండిపోయింది.

కాపలాభటు లిద్దరూ ఒక చావుకేక పెట్టి పక్కకు తప్పుకున్నారు. మాయామర్కటుడు, "జై, తాంత్రికగురో!" అంటూ గుర్రాన్ని ద్వారం దాటించి, రాజవీధిని చేరాడు.

నగర ద్వారానికి కొంచెం దూరంగా గోడ పక్కన మరికొందరు కాపలాభటులతో చేరి కబుర్లాడుతున్న వాళ్ల నాయకుడు, భటుల కేకలు విని తల తిప్పి





చూశాడు. అతడికి మాయామర్కటుడు వేగంగా గుర్రం మీద పోతూండటం కనిపించింది. వెంటనే అతడు కత్తి దూసి, దాపులనున్న గుర్రం కేసి పరిగెత్తుతూ, "ఒరే, శత్రురాజుల గూఢచారి ఎవడో, కోతి వేషంతో నగరం చేరి మన రహస్యాలు తెలుసుకో చూస్తున్నాడు. వెంట పడి పట్టుకోండి!" అంటూ అరిచాడు.

కావలాభటుల నాయకుడు తన గుర్రాన్నెక్కి బయలుదేరేలోపల మాయామర్కటుడు రాజవీధి వెంట చాలా దూరంపోయి, రాజభవనాన్ని సమీపిస్తున్నాడు. ఆ సమయంలో రాజభవనం ముందున్న మైదాన ప్రదేశంలో ఒక ఆటవికుడు కోతులూ, ఎలుగుబంట్లు లాంటి మచ్చిక చేసిన జంతువులను ఆడిస్తూ, చుట్టూచేరిన జనాన్ని ఆనందపరుస్తున్నాడు.

మాయామర్కటుడు గుర్రం మీద వేగంగా తమ కేసి రావటం చూసిన జనంలో కొందరు ఉత్సాహంగా చప్పట్లు చరుస్తూ, "ఆహాఁ, కొంతముచ్చు గుర్రపు స్వారీ! ఈ ఆటగాడెవరు?" అంటూ కేకలు పెట్టారు.

జంతువులను ఆడిస్తున్నవాడు మర్కటుడి కేసి ఓమారు చూసి, యిదేదో బాగా శిక్షణపొందిన కోతి అనీ, తన యజమాని నుంచి పారిపోయివస్తున్నదనీ అనుమానించి, చప్పున ముందుకుపోయి, ఉచ్చుతాడును మాయామర్కటుడి కంఠం కేసి గురిగా విసిరాడు. తాడు కొంచెం గురితప్పి, మర్కటుడి నడుముకు తగిలి, బిగుసుకుపోయింది. మర్కటుడు గుర్రం మీది నుంచి పల్లటీలు కొడుతూ నేలమీద పడ్డాడు. ఆ సమయంలో అతడి చేతిలో వున్న భల్లూక మాంత్రికుడి మంత్రదండం ఎగిరి అంత దూరాన పడింది.

జంతువులను ఆడించేవాడు ఎక్కడలేని ఉత్సాహంతో పోయి, మాయామర్కటుడి రెండు చెవులూ పట్టుకుని పైకెత్తి నిలబెట్టి, "కిచు, కిచు, కిచ్చన్నా!

ఈక్షణం నుంచి నీ యజమానిని నేను. చెప్పినట్టు వినకపోయావో తోకకు నూనె గుడ్డలుచుట్టి, నిప్పంటిస్తాను,'' అన్నాడు.

మాయామర్కటుడు పళ్ళుకొరుకుతూ చుట్టూ ఓమారు కలయచూసి, ''ఒరే, దిక్కుమాలిన గారడీ వెధవా! నేను మామూలు కోతిని కాదు, అద్భుతశక్తులు గల తాంత్రికుణ్ణి. మీ రాజా జితకేతుడికి రానున్న ప్రమాదాన్ని గురించి హెచ్చరించేందుకు పోతున్నాను. మధ్యలో నన్నిలా అవమాన పరుస్తావా? నీ తల కొట్టించేయగలను. నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ భయంకరంగా అరిచి, గుడ్లురిమాడు.

ఆ మాటలతో జంతువుల నాడించే వాడికి భయంతో తల తిరిగిపోయింది. వాడు రెండడుగులు వెనక్కువేసి, మెడకు ఇనప గొలుసుకట్టివున్న తన ఆట ఎలుగు బంటును ముందుకు లాగుతూ, ''ఇదేదో పిశాచి కొండముచ్చు. జంతువును లొంగదీయటానికి జంతువే తగు!'' అంటూ ఎలుగుబంటును మాయామర్కటుడి మీదికి ఉసికొలిపాడు.

ఎలుగుబంటు గట్టిగా జబ్బలుచరిచి పెద్దగా నోరుతెరిచి పోయి మర్కటం మీద పడింది. మాయామర్కటుడు చావు కేకలు పెడుతూనే, ''నేను జితకేత



రాజుకు మేలుచేయ వచ్చినవాణ్ణి. అతడికి భల్లూక మాంత్రికుణ్ణుంచి ప్రమాదం రానున్నది. నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ ఎలుగుబంటుపట్టు నుంచి విడిపించుకుంటూ, అందినప్పుడల్లా దానిని వాడిపళ్ళతో కొరకసాగాడు.

చుట్టూచేరిన జనం మర్కటుడి మాటలేవీ పట్టించుకోకుండా, ''ఆహా, మాటలు నేర్చిన కోతి, మూగమొద్దు ఎలుగుబంటూ మధ్య కాటాకుస్తీ! ఇలాంటి అద్భుతం ఏనాడైనా చూశామా,'' అని ఈలలు వేస్తూ, చప్పట్లు చరచసాగారు.

అంతలో అక్కడికి గుర్రం మీద వేగంగా కాపలాభటుల నాయకుడు వచ్చి,

"ఏమిటీ చచ్చువినోదం!" అంటూ కత్తి దూసి, కొంచెం దూరంగా నిలబడివున్న జంతువులను ఆడించే వాడితో, "ఒరే, మారువేషంలో వచ్చిన శత్రుగూఢచారిని, నీ పెంపుడు ఎలుగుబంటితో చంపించాలని చూస్తున్నావా? జాగ్రత్త! ముందీ గూఢచారిని ప్రాణాలతో పట్టుకుని రాజుగారి దగ్గిరకు తీసుకుపోవాలి." అన్నాడు.

కాపలావాళ్ళ నాయకుడు యిలా అనగానే, జంతువుల్ని ఆడించేవాడు చప్పున ముందుకు పోయి ఎలుగుబంటు గొలుసు పట్టుకుని యివతలికి లాగాడు. మాయామర్కటుడు శరీరానికి తగిలిన గాయాల బాధతో మూలుగుతూ, "మీ రాజును రక్షించవచ్చిన నన్ను యింత అవమానపరుస్తారా? బతకాలనివుంటే, మీ రాజునే నా దగ్గిరకు రమ్మనండి! నే నెవరనుకున్నారు? గొప్ప తాంత్రికుడి శిష్యుణ్ణి! నా మంత్రదండం ఎక్కడ?" అని గుడ్లురుముతూ చుట్టూ చూశాడు.

మాయామర్కటుడు యిలా అనగానే, కాపలావాళ్ళ నాయకుడు కోపంతో పళ్లు కొరికి, "ఒరే, శత్రుగూఢచారీ! మా మహా రాజుగారు నీ దగ్గిరకు రావాలా?" అని జంతువుల్ని ఆడించేవాడితో, "ఒరే, నీ ఎలుగుబంటితో పట్టించి, యీ కోతి గూఢచారిగాడిని నా వెంట రాజుగారి దగ్గిరకు తీసుకురా. వాడికి ప్రాణహాని మాత్రం కలిగించకు." అంటూ రాజభవనం కేసి బయలుదేరాడు.

జంతువుల్ని ఆడించేవాడు హెచ్చరించగానే ఎలుగుబంటు మెరుపులా పోయి, మాయామర్కటుణ్ణి పడిసి పట్టుకుని భుజం మీద వేసుకుని, తన యజమాని వెనకగా రాజభవనం కేసి బయలుదేరింది. జనం ఎక్కడలేని ఉత్సాహంతో కేకలు పెడుతూ దానిని అనుసరించారు.

మాయామర్కటుడు కిచుమంటూ, "తాంత్రిక గురో, నీవే రక్ష! నా మంత్రదండం ఎక్కడ?" అంటూ అరవసాగాడు. —(ఇంకా వుంది)





# భల్లూకమాంత్రికుడు

## 17

[మాయామర్కటుడు మంత్రదండంతో కాళీవర్మ, భల్లూకమాంత్రికుల నుంచి తప్పించుకుని, నగరం చేరాడు. అక్కడ రాజభవనం ముందు ఆటవికుడి ఎలుగుబంటు, మర్కటుడి మీదికి దూకింది. ఆ సమయంలో అక్కడికి వచ్చిన కాపలావాళ్ళ నాయకుడు మాయామర్కటుణ్ణి, ఎలుగుబంటితో పట్టించి, రాజుగారి దగ్గిరకు బయలుదేరాడు. తరవాత—]

రాజభవనం మెట్ల దగ్గిర కాపలావాళ్ళ నాయకుడు కత్తి పైకెత్తి, వెనక వస్తున్న వాళ్ళందర్నీ ఆగమని హెచ్చరించి, జంతువులను ఆడించేవాడితో, "ఒరే, మహారాజుగారిప్పుడు సభాభవనంలో వున్నట్టున్నది. అక్కడికి నీ దిక్కుమాలిన పెంపుడు ఎలుగుబంటును తీసుకుపోవటం మర్యాద కాదు. దాని భుజాన వున్న కోతివెధవను, నీ భుజం మీదికి మార్చుకుని, నా వెంట రాజుగారి దగ్గిరకు రాగలవా?" అని అడిగాడు.

జంతువులను ఆడించేవాడు ఆ మాటలకు కోపగించుకుంటున్నవాడిలా ముఖం పెట్టి, "నన్నేమైనా అనండిగాని, నా పెంపుడు ఎలుగుబంటును మాత్రం దిక్కుమాలిన ఎలుగుబంటంటూ కించపరచకండి. దాని తెలివితేటలకు ఎందరెందరో రాజులూ, సామంతులూ, పండి



తులా అచ్చెరువు చెందారంటే నమ్మండి. సేతువు కట్టిన వాళ్ళలో దాని పూర్వుడొకడున్నాడన్నదానికి ఋజువు, యీ తాళపత్రాలే!'' అంటూ దుస్తుల్లో నుంచి ఒక తాళపత్రగ్రంథం బయటికి తీశాడు.

కాపలావాళ్ళ నాయకుడు పెద్దగా నవ్వి, ''ఆ వంశవృక్షం రాజుగారి ఆస్థాన పురోహితుడికి తరవాతచూపి, రాజుగారి నుంచి ఏదైనా బహుమతి సంపాదింతువుగాని. ముందు ఆ కోతివేషపు శత్రు గూఢచారిని ఎలుగుబంటి భుజాల మీది నుంచి కిందికి దించు,'' అన్నాడు.

జంతువులను ఆడించేవాడు అయిష్టంగా ముఖంపెట్టి, ఎలుగుబంటు దగ్గిరకు పోయి, దాని వీపు తడుతూ, ''వీరబంటూ! భుజాల మీది కోతిగాణ్ణి కింద పడెయ్యి,'' అంటూ మాయామర్కటుడి నడుముకు బిగిసివున్న తాడును గట్టిగా లాగి పట్టుకున్నాడు.

ఎలుగుబంటు కోరలుచాచి పెద్దగా అరిచి, మాయామర్కటుడి నడుం పట్టుకుని కిందికి దించబోయేంతలో మర్కటుడు కీచుమంటూ కిందికి దూకి, ''ఒరే, భల్లూకమాంత్రికుణ్ణించి ప్రమాదం కలగబోతున్నది. మీ రాజెక్కడ? నా మంత్రదండం ఎక్కడ?'' అన్నాడు.

ఆ మాటలకు అక్కడ చేరిన జనం గట్టిగా చప్పట్లు చరిచారు. వాళ్ళల్లో ఒకడు పాతవాటి చేతికర్ర నొకదాన్ని మర్కటుడికేసి చూస్తూ, ''ఇదుగో, నీ మంత్రదండం! ఏవైనా అద్భుతాలు చేసి చూపించు,'' అన్నాడు.

మాయామర్కటుడు చప్పున కర్ర లాక్కుని, దాన్ని నిలువుగా నేల మీద ఆనించి, ఒక్క ఎగురున పోయి దాని చివర ఒంటికాలి మీద నిలబడి, ''ఒరే, మూర్ఖుల్లారా, ఇలాంటి అద్భుతం ఎవరైనా చేసి చూపగలరా? మీ రాజుకూ, రాజ్యానికూడా ఆపద రానున్న యీ తరుణంలో గారడీవిద్యలతో ఆనందించేవాళ్ళను ఏమనాలి?'' అన్నాడు.

కాపలానాయకుడు మాయామర్కటుణ్ణి సమీపించి, వాడెక్కి ఒంటికాలి మీద నిలబడి వున్న కర్రను నరకబోతున్న వాడిలా కత్తి చాచి, "ఒరే, నిజంగా నువ్వు శత్రుగూఢచారివి కాదా? నువ్వనే భల్లూక మాంత్రికుడి మాట నిజమేనా?" అని అడిగాడు.

మాయామర్కటుడు మెరుపు వేగంతో కర్ర కొస నుంచి ఎగిరి కిందికి దూకుతూనే కాపలావాళ్ళ నాయకుడి చేతి నుంచి కత్తి లాక్కొని, దానితో తన నడుముకు బిగించి వున్న తాడును ఒక్క వేటుతో నరికి, "మూర్ఖులారా, నా శక్తిసామర్థ్యాలెలాంటివో తెలుసుకున్నారా? మీ రాజును వెంటనే యిక్కడికి పిలుచుకు రండి," అంటూ పళ్ళు కొరికాడు.

కాపలావాళ్ళ నాయకుడితో పాటు అక్కడ చేరిన వాళ్ళందరూ భయకంపితులైపోయారు. మాయామర్కటుడు యీసారి కత్తి ఝళిపిస్తూ కాపలావాణ్ణి సమీపించి, "ఒరే, మందమతీ! నా ఆజ్ఞ ఏమిటో వినబడలేదా?" అన్నాడు.

కాపలానాయకుడు ప్రాణభయంతో వణికిపోతూ, "మహారాజుగారు నిండు సభలో వుండగా, వారిని యిక్కడికి రమ్మని కోరటమా? నా తల ఎగిరిపోతుంది," అన్నాడు.



"అలా అయితే, నేనే ఆయన దగ్గిరకు వెళతాను. ముందుండి దారితియ్యి," అన్నాడు మాయామర్కటుడు.

కాపలావాళ్ళ నాయకుడు కిక్కురుమనకుండా మెట్లెక్కి, భవనంలోకి దారి తీశాడు. జనం వాళ్ళను అనుసరించి పోవటానికి ధైర్యం చాలక వున్నచోటనే నిలబడిపోయారు.

రాజు జితకేతుడు సింహాసనంలో కూర్చుని, సభతీరివున్న పురప్రముఖులతో మాట్లాడుతున్నాడు. ఆ సమయంలో హఠాత్తుగా కాపలావాళ్ళ నాయకుడు సభ ముందుకు వస్తూనే, "మహారాజా, మన్నించాలి. నా వెనక మర్కటరూపంలో



కత్తి పట్టి వస్తున్నవాడు, మహా శక్తిమంతుడు. మన రాజ్యానికి రానున్న గొప్ప ప్రమాదం గురించి తమను హెచ్చరించేందుకు వస్తున్నాడు,'' అంటూ పక్కకు తప్పుకున్నాడు.

రాజు జితకేతుడితో పాటు, సభలో వున్నవాళ్ళందరూ మాయామర్కటుణ్ణి చూసి ముందు ఆశ్చర్యపోయి, అంతలోనే వాడి వింతరూపం కేసి పరీక్షగా చూసి పెద్దగా నవ్వారు.

రాజు జితకేతుడు సింహాసనం పక్కన నిలబడివున్న ఇద్దరు మంత్రుల కేసి తల తిప్పి, ''మన ప్రధానమంత్రి జీవగుప్తుడు సమయానికిక్కడలేడుగాని, వున్నట్టయితే చాలా ఆనందించేవాడు,'' అని అంతలోనే ఏదో ఆలోచనవచ్చినవాడిలా ముఖం గంభీరంగా పెట్టి, కాపలావాళ్ళ నాయకుడి కేసి చూస్తూ, ''పిరికివెధవా! ఒక్క బడుగు కోతికి నగరద్వారాలు తెరవటమే గాక, దాన్ని స్వయంగా సభామందిరానికి తెచ్చిన నీవు, నిజంగానే శత్రుసైనికులు ద్వారం దగ్గిరకు వస్తే, ఏమి చేసి వుండే వాడివి? నీ కిదే శిరచ్ఛేద శిక్ష విధిస్తున్నాను. నగర ప్రధాన తలారి రాగానే, నీకా శిక్ష దిరిసెనవనంలో అమలుజరుగుతుంది,'' అన్నాడు.

ఈ శిక్ష మాట వింటూనే సభలో వున్న వాళ్ళందరూ ఆనందోత్సాహంతో చప్పట్లు చరిచారు. అప్పటివరకూ రాజు కేసీ, సభాసదుల కేసీ కన్నార్పకుండా చూస్తున్న మాయామర్కటుడు చప్పున పెద్దగా గొంతెత్తి, ''జై, తాంత్రిక గురో!'' అంటూ కేక పెట్టి, ''జితకేతు రాజా, నగర ముఖ్యులారా! కొంచెం ఒళ్ళూ, మనసూ స్వాధీనంలో వుంచుకుని, నే చెప్పేది వినండి. నేను మామూలు కోతిని కాదు, ఒక మహా తాంత్రికవేత్త ప్రధానశిష్యుణ్ణి. నా పేరు భ్రాంతిమతి! ఇప్పుడు మీ నగరం మీదికి కాళీవర్మ అనే మహా శూరుడూ, భల్లూక మాంత్రికుడనే మాంత్రికుడూ దాడి వస్తున్నారు. మిమ్మల్ని ఆ విషయమై



ముందుగా హెచ్చరించేందుకు యిక్కడికి వచ్చాను,'' అన్నాడు.

మాయామర్కటుడు యిలా అనగానే సభలో కలకలం బయలుదేరింది. రాజు జితకేతుడు ఒక్కక్షణకాలం నివ్వెర పోయి, సింహాసనంలోనుంచి లేచి నిలబడి, మాయామర్కటుడితో, ''నీ మాట తీరును బట్టి, నువ్వు మామూలు కోతివి కాదని అర్థమవుతున్నది. ఇక నువ్వు చేసిన హెచ్చరిక సంగతి. ఆ దోపి కాళీవర్మతో పాటు వాడి మిత్రుల నందరినీ పట్టి బంధించి తీసుకురమ్మని, నా ప్రధాన మంత్రి జీవగుప్తుడికి, కొంతమంది సైనికులను యిచ్చి పంపాను. వాళ్ళందరూ ఏమైపోయినట్టు!'' అన్నాడు.

ఆ ప్రశ్నకు మాయామర్కటుడు కీచు కీచు మంటూ నవ్వి, ''ఆ గుంపునంతా కాళీవర్మ అనేవాడు కత్తితో, మాంత్రికుడు ఖల్లాటుడు తన మంత్రదండంతో....'' అంటూ ఆగిపోయి, భీతిగొన్నవాడిలా చుట్టూ కలయ చూస్తూ. ''జై, తాంత్రిక గురో! నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ ఎగిరి కొంచెం దూరంలో నిలబడి వున్న కాపలావాళ్ళ నాయకుడి గొంతు పట్టుకున్నాడు.

కాపలావాళ్ళ నాయకుడు, మర్కటుడి పట్టు విడిపించుకునేందుకు నానా హైరానా పడిపోతూ. ''మర్కటప్రభో! మంత్రదండాల సంగతి నాకేం ఎరుక? మహారాజా, నా ప్రాణాలు కాపాడండి!'' అంటూ అరవసాగాడు.

సభలోవున్న వాళ్ళలో యిద్దరు ధైర్యవంతులూ, బలశాలులూ అయిన వాళ్ళు చప్పునపోయి మాయామర్కటుణ్ణి నడుం, చేతులూ పట్టుకుని యివతలికి లాగి, ''రాజ్యంలో మనుషుల ప్రాణాలు తీసే హక్కు మా మహారాజుగారొక్కరికి మాత్రమే వున్నది; నువ్విలా తొందరపడటం చట్టసమ్మతం కాదు,'' అన్నారు.

మాయామర్కటుడు కోపంతో పళ్లు పటపటా కొరికి, ''జితకేతురాజా! సంగతి



రెండు ముక్కల్లో చెపుతా. విను! నువ్విక్కడ నగరద్వారాల తలుపులు బిడాయించుకుని, సభ తీరి, కాలక్షేపం కబుర్లతో వినోదిస్తున్నావు. ఆ కారణంగా నగరం వెలపల ఏం జరుగుతున్నదీ నీకు తెలిసినట్టు లేదు. నీ ప్రధాన తలారి యిప్పుడు ఎలుగుబంటి రూపంలో వుండటమే గాక, కాళీవర్మా, భల్లూక మాంత్రికులతో కలిసి, మరొక రాక్షసుడు వెంటరాగా, నగరం మీదికి దాడివస్తు న్నారు," అన్నాడు.

రాక్షసుడి పేరు వింటూనే రాజు జిత కేతుడు అదిరి పడి, "రాక్షసుడా? అలాంటి వాళ్ళు వుండేవారని వినటమే గాని, యీక్షణంవరకూ చూసింది లేదు," అన్నాడు.

ఆ మాటలకు మాయామర్కటుడు వికటంగా నవ్వి. "అయితే, త్వరలోనే నీకా కోర్కె తీరబోతున్నది! కాని, ఆ భయంకర రాక్షసుణ్ణి చూసిం తర వాత—మరెన్నో క్షణాలకాలం మాత్రం నీవు జీవించివుండవు," అన్నాడు.

రాజు జితకేతుడి మంత్రులిద్దరూ ప్రాణభయంతో పడవడ వణికిపోతూ ముఖముఖాలు చూసుకుని, రాజుతో, "మహారాజా, మనం యీ ప్రమాదంనుంచి బయటపడటం ఎలా?" అన్నారు.

"ఇది రాజునైన నేను, మంత్రులైన మిమ్మల్ని అడగవలసిన ప్రశ్న. మిమ్మల్ని యిదే ఉద్యోగాల్లోంచి తొలగిస్తున్నాను. ఆ ప్రధాన మంత్రి జీవగుప్తుడే గనక, సమయానికిక్కడ వున్నట్టయితే, తగిన మంత్రాలోచన చేసి, రానున్న ముప్పు నుంచి అందర్నీ కాపాడేవాడు," అని జితకేతరాజు, సింహాసనం దగ్గిర నుంచి కదిలి, మాయామర్కటుడి దగ్గిరకు వస్తూ, సభలోవున్న వాళ్ళతో, "మన నగరం మీదికి మాంత్రికులతోపాటు రాక్షసులు కూడా కలిసి దాడివస్తున్నారు, మనం ఏం చేస్తే బావుంటుందంటారు?" అని అడిగాడు.

సభలో ఎవరూ జవాబివ్వలేదు. వాళ్లు, రాక్షసుడు నగర ప్రవేశం చేయకముందే, ఇంటగల ధనం, యితర విలువైన వస్తువులూ తీసుకుని నగరం వదిలి పారిపోవటం ఎలా అన్న ఆలోచనలో వున్నారు.

రాజు జితకేతుడు సభికుల నుంచి ఎలాంటి జవాబూ రాకపోవటంతో, వాళ్ళు భయకంపితులై ఏమీ చెప్పలేని స్థితిలో వున్నారని గ్రహించి, మాయామర్కటుణ్ణి సమీపించి, "రూపంలో నువ్వు మర్కటాన్ని పోలివున్నా, మంత్రాలోచనలో నా ప్రధానమంత్రి జీవగుప్తుడికి సాటి వచ్చేలావున్నావు. ఆ మంత్రిని యీసరికే రాక్షసుడు తన పొట్ట పెట్టుకుని వుంటాడు. నిన్ను ప్రధాన మంత్రిగా నియమిస్తున్నాను. శత్రు సంహారానికీ, రాజ్య రక్షణకూ తగిన పథకం తక్షణం ఆలోచించి, అమలు చెయ్యి," అంటూ మర్కటుడి చేయి పట్టుకుని, సింహాసనం దగ్గరకు నడిపించుకు వచ్చాడు.

సభలో కరతాళ ధ్వనులు మిన్ను ముట్టినై. మాయామర్కటుడు అభయం యిస్తున్నవాడిలా కత్తిని నోటపట్టుకుని, రెండు చేతులూ పైకెత్తి, ఏదో చెప్పబోయేంతలో, నోటి నుంచి కత్తి జారి కిందపడి ఖంగుమంటూ పెద్ద ధ్వని అయింది. మాయామర్కటుడు తల



వంచకుండానే కత్తిని తోకతో మెలిపెట్టి, పైకెత్తి పట్టుకుని, ఏదో చెప్పబోయేంతలో సభాద్వారం దగ్గిర పెద్ద కలకలం బయులుదేరింది. రాజు జితకేతుడితో పాటు అందరూ తలలుతిప్పి, అటుకేసి చూశారు.

మంత్రి జీవగుప్తుడు చిరిగినదుస్తులతో, శిరస్త్రాణం లేకుండా సభలో ప్రవేశించాడు. అతడికి కొంచెం వెనకగా సామంతు సూర్యభూపతీ, యిద్దరు సైనికులూ కూడా సభలోకి వచ్చారు. జీవగుప్తుణ్ణి చూస్తూనే కొందరు సభికులు, "ప్రధాన మంత్రిగారు సజీవుడే; రాక్షసుడికి ఆహారం అయిపోలేదు," అంటూ ఉత్సాహంగా కేకలు పెట్టారు.

మాయామర్కటుడు కోపంగా కత్తి పైకెత్తి, "ఒరే, మూర్ఖ పట్టణప్రముఖులారా! ఇంతకు ముందే గదా, రాజు జితకేతు నన్ను ప్రధాన మంత్రిగా నియమించింది. ఆ మాట మరిచారా?" అని, రాజు జితకేతుడితో, "ఓయ్, రాజా! నువ్వనేదేమిటి? ఇక్కడ ప్రధానమంత్రిని నేనా లేక శత్రువులకు వెన్నిచ్చి పారిపోయి వచ్చిన యీ జీవగుప్తుడా?" అని అడిగాడు.

"మర్కటుడే మన రాజ్యానికి ప్రధాన మంత్రి! ఆ మాట మరొకసారి చెపుతున్నాను. జీవగుప్తుడు యీ క్షణం నుంచీ నగరంలోని అతి సామాన్య పౌరులలో ఒకడు." అన్నాడు రాజు జితకేతుడు.

మంత్రి జీవగుప్తుడు అన్నిటికీ తెగించినవాడిలా చప్పున కత్తి దూసి, మాయామర్కటుడి కేసి గుర్రుమంటూ, "ఈ చచ్చు కోతివెధవ, చంద్రశిలానగర ప్రధాన మంత్రా? వీణ్ణి ఒకసారి రాక్షసుడు ఉగ్రదండుడి రాతి గద దెబ్బ నుంచి కాపాడాను: ఇప్పుడు స్వయంగా నేనే వీడి తల నరకబోతున్నాను." అంటూ మర్కటుడి కేసి బయలుదేరాడు.

రాజు జితకేతుడు కోపంగా, "జీవగుప్తా, ఆగు! ఇది మామూలు మర్కటం కాదు: భ్రాంతిమతి అనే గొప్ప తాంత్రికుడు!" అన్నాడు.

"ఈ తాంత్రికుడు దొంగిలించిన భల్లూక మాంత్రికుడి మంత్రదండం ఎక్కడున్నది? అది లేకుండా వీడు మామూలు చెట్టుకోతి కన్న కూడా నిస్సహాయుడు, హీనుడు! ఇదే నా ఖడ్గంతో వీడి తలా, తోకా నరకబోతున్నాను," అంటూ జీవగుప్తుడు కత్తి చాచి మర్కటుడి మీదికి దూకబోయాడు.

మాయామర్కటుడు, "జై, తాంత్రిక గురో!" అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, తోకను మెరుపు వేగంతో తిప్పి, జీవగుప్తుడి చేతిలోవున్న కత్తిని మెలివేసి చప్పున లాక్కుంటూనే, తన దగ్గిర వున్న కత్తిని పైకెత్తాడు. —(ఇంకా వుంది)





# భల్లూకమాంత్రికుడు

## 18

[మాయామర్కటుడు, జితకేతరాజును నగరానికి రానున్న ప్రమాదాన్ని గురించి హెచ్చరించాడు. దాడివస్తున్న వాళ్ళలో రాక్షసుడు కూడా వున్నాడని వింటూనే, రాజు మాయామర్కటుణ్ణి ప్రధానమంత్రిగా నియమించాడు. మంత్రి జీవగుప్తుడు, మర్కటుడి పై కత్తి దూశాడు. మర్కటుడు కత్తి లాక్కొని, తన కత్తిని జీవగుప్తుడి పైకి ఎత్తాడు. తరవాత—]

మాయామర్కటుడు కత్తిని మంత్రి జీవగుప్తుడి పైకి ఎత్తటం చూస్తూనే, సభలో హాహాకారాలు బయలుదేరినై. రాజు జితకేతుడు చప్పున ముందుకు వచ్చి, మర్కటుడి చేయి పట్టుకుని, "మర్కటామాత్యా, తొందరపడకు! సభాభవనంలో నెత్తురు చిందటం, రాజ్యానికి కీడుకలిగిస్తుంది. పైగా, నేను జీవగుప్తుడికి శిరశ్ఛేద శిక్ష విధించాను. దానిని అమలు చేయవలసినవాడు నగర ప్రధాన తలారి," అన్నాడు.

రాజు యిలా అనగానే మాయామర్కటుడు కత్తిని ఒరలో పెడుతూ, జీవగుప్తుడితో, "ఓయీ, పాతామాత్యా, ప్రస్తుతానికి బతికిపోయావు! తక్షణం రాజ్యం విడిచిపో." అన్నాడు పళ్ళుకొరుకుతూ.

జీవగుప్తుడు, మర్కటుడు కిందపడవేసిన తన కత్తిని తీసుకుని, ఒరలో



పెడుతూ, కోపంగా రాజుకేసీ, మర్కటుడి కేసీ ఓమారు చూసి, "రాజుగారేమో నాకు శిరశ్చేద శిక్ష వేశామంటున్నారు; యీ మర్కటుడు దేశం విడిచి పొమ్మంటున్నాడు," అని సభలోవున్న వాళ్ళకేసి తల తిప్పి, "పుర ప్రముఖులారా! నే నిప్పుడేం చేయాలి?" అని అడిగాడు.

సభలోని వాళ్ళకు రాజాజ్ఞను బలపరచాలో, కొత్తగా మంత్రి అయిన మర్కటుడి మాటకు అవుననాలో తోచక గజిబిజి పడుతున్నంతలో సామంతరాజు సూర్యభూపతి, జితకేతరాజుకు నమస్కరించి, "మహారాజా! నా పేరు సూర్యభూపతి. ఈ జీవగుప్తుణ్ణి ప్రస్తుతానికి క్షమించి వదిలెయ్యండి. మీనగరం మీదికి దాడివస్తున్న వాళ్ళలో, ఉదయగిరి రాజు దుర్ముఖుడు కూడా వున్నాడు. ముందు నగరరక్షణకు తగిన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

రాజు జితకేతుడు, దుర్ముఖుడి పేరు వింటూనే ఉలిక్కిపడి, కొంచెం దూరంగా నిలబడివున్న నగరద్వార కాపలానాయకుడితో, "నువ్వు నగర ద్వారం మూయించి, శత్రువుల నుంచి దానిని కాపాడాలి. మన సేనానాయకుడితో సైన్యాలను ఆయత్తం చేసి, కోటబురుజులూ, అగడ్తలూ కాపాడమన్నానని, నా ఆజ్ఞగా చెప్పు," అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అని కాపలా నాయకుడు అక్కణ్ణించి బయలుదేరి వెళ్ళాడు.

రాజు జితకేతుడు, సామంతు సూర్యభూపతి కేసి తిరిగి, "ఆ దుర్ముఖరాజును నువ్వెరుగుదువన్నమాట! అతడు పెద్ద సైన్యంతోనే దాడికి బయలుదేరాడా?" అని అడిగాడు.

సూర్యభూపతి దిగులుగా ముఖం పెట్టి, "మహారాజా, ఎంతోకాలంగా ఆ రాజు దుర్ముఖుడి సామంతుడైన నేను, అతడు రాజ్యార్హుడు కాదని తిరుగుబాటు చేసి, అతడి నగరాన్ని ఆక్రమించాను. అందుకు

దుర్ముఖుడి సైనికుల్లో చాలామంది నాకు తోడ్పడ్డారు. కాని, మధ్యలో కాళీవర్మ అనే క్షత్రియ యువకుడూ, భల్లూక మాంత్రికుడూ, ఎలుగుబంటు రూపంలో వున్నవాడూ, అడవి దొంగలూ—యిలా నానాకశ్మలం వెధవలంతా గుంపుకట్టుకు వచ్చి, నన్ను కోటలోంచి తరిమేశారు. ఆ దుర్ముఖరాజుకు వున్న ముఖ్యమైన అండ అంతా యీ అలగాజనమే! పెద్ద సైన్యం ఏమీ అతడికి తోడుగాలేదు," అన్నాడు.



సూర్యభూపతి యిలా చెప్పగానే రాజు జితకేతుడు కాస్త బెదురుకుని మాయా మర్కటుడితో, "మర్కటామాత్యా! ఈ సూర్యభూపతి చెప్పుతున్న దాన్నిబట్టి, శత్రువులు కొద్దిమందే అయినా మహా బలవంతులూ, సాహసికులూ అని తోస్తున్నది. మనం కోట వెలపలవున్న నగరరక్షణ మాట తరవాత చూద్దాం, ముందు యీ కోటను రక్షించుకునే మార్గమేమిటో ఆలోచించాలి," అన్నాడు.

అప్పటివరకూ జరుగుతున్నదంతా జాగ్రత్తగా గమనిస్తున్న మాయా మర్కటుడు, రాజు యిలా అనగానే, ఒక చిన్న గంతువేసి, "ఓయ్, రాజా! కోట రక్షణ గురించి మరేం దిగులుపడకు. ఆ భల్లూక మాంత్రికుడూ, వాడి వత్తాసు గాళ్ళూ, సూర్యభూపతి కోటలో ఎలా ప్రవేశించగలిగారనుకున్నావు—ఆ కోట ద్వారాలకు నిప్పుపెట్టి! అందువల్ల నువ్వు ముఖ్యంగా చేయవలసింది, ద్వారరక్షణ. బోధపడిందా?" అన్నాడు.

రాజు బోధపడిందన్నట్టు తల వూపి, సామంతు సూర్యభూపతితో, "ఒకసారి ద్వార రక్షణలు సరిగా చూసుకోక, దొరికిన సింహాసనాన్ని జారవిడిచినవాడివి గనక, నిన్నే కోట ద్వారాలు కాపాడేందుకు నియమిస్తున్నాను. ఆ బాధ్యత సమర్థ వంతంగా నిర్వహించావంటే, నిన్ను నా ప్రథమ సామంతుడుగా చేసి, సత్కరిస్తాను," అన్నాడు.



సూర్యభూపతి, "చిత్తం, మహారాజా!" అని అక్కడినుంచి బయలుదేర బోయేంతలో మంత్రి జీవగుప్తుడు పెద్దగా గొంతెత్తి, ''మరి నా సంగతేమిటి? నా ఉద్యోగం వున్నట్టా, పోయినట్టా?'' అన్నాడు.

ఆ ప్రశ్న వింటూనే మాయామర్కటుడు కీచుమంటూ అరిచి, ''ఓయీ, పాత మంత్రీ! నీ ఉద్యోగం ఎప్పుడో పోయింది. తల మాత్రం మరికొద్ది దినాలపాటు వుంటుంది. తక్షణం యీ సభాభవనం నుంచి బయిటికి పో!'' అన్నాడు.

ముందు సూర్యభూపతీ, అతడి వెన్నంటి మంత్రి జీవగుప్తుడూ, కొంచెం వెనకగా సభలోని పురప్రముఖులూ బయిటికి నడిచారు. అలా అందరూ భవనం నుంచి, దాని ముందున్న ఆవరణలోకి పోగానే, వెనకనుంచి మాయామర్కటుడు వేగంగా భవనం మెట్ల దగ్గిరకు వచ్చి, కత్తి పైకెత్తి పట్టుకుని, తోకను గిరగిరా గాలిలో తిప్పుతూ, ''నా మంత్రదండాన్ని యింతకుముందు ఎలుగుబంటి ఆట దగ్గిర ఎవరో దొంగిలించారు. అది తిరిగి తెచ్చిన వారికి జితకేత రాజుగారు అర్ధరాజ్యంతో పాటు తమ కుమార్తెను కూడా యిచ్చి చేస్తారు,'' అన్నాడు.

మర్కటుడి మాటలు వింటూనే అందరూ ఆశ్చర్యపడుతూ నిలబడి పోయారు. ముందుగా మంత్రి జీవగుప్తుడు వికటంగా నవ్వి, ''ఈ మర్కటుడికి రాజు గారికి ఆడపిల్ల కాదుగదా, అసలు సంతానమే లేదన్న సంగతి తెలిసినట్టు లేదు,'' అన్నాడు.

మంత్రి యిలా అనగానే అందరూ పెద్దగా నవ్వారు. అంతలో అక్కడికి రాజు జితకేతుడు వచ్చాడు. మాయామర్కటుడు ఆయన కేసి కోపంగా చూస్తూ, ''ఓయ్, రాజా, నువ్వేమన్న రాజువి! అసలు నీకు సంతానమే లేదా?'' అని అడిగాడు.

''మర్కటామాత్యా, ఆ సంగతి తర వాత చెబుతాను. ముందు ఆ మంత్ర

దండం నీకు అంత ముఖ్యమా? అది లేకుండా శత్రువులను జయించలేవా?'' అని అడిగాడు రాజు.

''ముఖ్యమా! ఏం ప్రశ్న రాజా? ఆ మంత్రదండం పట్టినవాడికి అసాధ్యం అంటూ, యీ లోకంలో ఏమీ వుండదు. నీ సింహాసనాన్నే కాక, నీ ప్రాణాలను కూడా అది కాపాడగలదు.'' అన్నాడు మర్కటుడు.

వెంటనే రాజు చేఎత్తి, ''నాకు కుమార్తె లేదని ఎవరూ సంశయించనక్కరలేదు. ఒక కన్యను దత్తు తీసుకుని అయినాసరే, అర్ధరాజ్యంతోపాటు, ఆ మంత్రదండం తెచ్చినవాడికి యిచ్చి వివాహం చేస్తాను,'' అన్నాడు.

ఆ మాటలకు అక్కడ వున్నవాళ్లందరూ హర్షధ్వానాలు చేశారు. అంతకుముందు ఆటవికుడి ఎలుగుబంటి ఆట చూడటానికి వచ్చిన జనంలో కొందరు దూరంగా నిలబడి వున్నారు. వాళ్ళల్లో బైరాగి దుస్తులు ధరించి వున్న యిద్దరు యువకులు, రాజు చెప్పినది వింటూనే మతిపోయినవాళ్ళలా ఎగిరి ఒక గంతు వేశారు. వాళ్ళల్లో ఒకడు జోలెలో చేయిపెట్టబోయేంతలో, రెండవ వాడు అతణ్ణి వారిస్తూ, ''ఒరే, ఉపశిష్యా, తొందరపడకు! ముందు మన గురువుగారి అభిప్రాయం కనుక్కోవటం అవసరం,'' అన్నాడు.

ఆ వెంటనే బైరాగి యువకులిద్దరూ అక్కణ్ణించి బయలుదేరారు. పుర





ప్రముఖులు జితకేతరాజుకు, మంత్ర దండం తెచ్చినవాడికి యివ్వనున్న బహుమానం గురించి, నగరంలో చాటింపు వేయించటం అవసరం అని సలహా యిచ్చి వెళ్ళబోతున్నంతలో, రివ్వుమంటూ ఒక బాణం కోట గోడల పైనుంచి ఎగిరి వచ్చి, వాళ్ళ మధ్య పడింది.

జనంలో కొందరు కిందపడిన బాణాన్ని తీయబోతున్నంతలో, మాయామర్కటుడు, "ఆగండి!" అంటూ కేక పెట్టి, పరుగున పోయి బాణాన్ని తీసుకుని, దానికేసి పరీక్షగా చూసి, వాడి పళ్ళతో కొరికి ముక్కలుగా చేసి, దూరంగా విసిరివేస్తూ, "ఈ బాణాన్ని ఏం చేశానో, నా శత్రువుల్నీ అదే చేయబోతున్నాను," అని, "నా మంత్రదండం ఎక్కడ?" అంటూ ఎగిరి గంతువేశాడు.

అంతలో ఒక పెద్ద బండరాయి కోట గోడల మీదినుంచి జుయ్‌మంటూ వచ్చి, రాజభవనం గోడను తాకి దభీమంటూ కింద పడింది. రాతి దెబ్బకు భవనం గోడలో పెద్ద నెర్రె పడింది.

రాజు జితకేతుడు నిలువునా వణికిపోతూ, "ఇంత పెద్దరాతిని కోట వెలుపలి నుంచి విసరగలిగినవాడు సామాన్యుడు కాడు, రాక్షసుడై వుంటాడు. మర్కటామాత్యా, మానవులమైన మనం, యిలాంటి రాక్షసులతో పోరి, బతకగలమా?" అన్నాడు.

రాయి పడటం చూస్తూనే పురప్రముఖులతోపాటు, మామూలు జనం కూడా చెల్లాచెదురుగా అక్కణ్ణించి పారిపోయారు. మాయామర్కటుడు, రాజుకు ధైర్యం చెబుతూ, "ఓయ్, రాజా, భయపడకు! బ్రహ్మపుత్రానదీలోయల్లో యిలాంటి మహాబలశాలులైన రాక్షసుల నెందరినో, మా గురువైన మిథ్యామిశ్రుడు పట్టి బంధించి, ఇంటి నౌకర్లుగా వాడుకుంటున్నాడు," అన్నాడు.

రాజు వెలవెలపోతూ, "అమాత్యా! మరి, ఆయన్ని యిక్కడకు పిలిపించి, శత్రు

ప్రమాదం నుంచి నన్నూ, నా రాజ్యాన్నీ కాపాడగలవా?'' అని అడిగాడు.

ఆ మాటకు మాయామర్కటుడు కీచు కీచు మంటూ నవ్వి, ''ఓయ్ రాజా, నువ్వెంత అమాయకుడివి! తాంత్రిక సార్వభౌముడైన నా గురువు, నీ బోటి బడుగురాజుల్ని రక్షించేందుకు, ఆ నదీ లోయ వదిలి యిక్కడికి వస్తాడనుకుంటు న్నావా? ఆయన తన మంత్ర, తంత్రశక్తు లతో ముందీ లోకాన్నీ, తరవాత ఆ పైలోకా లనూ జయించబోతున్నాడు. అందుకు భల్లూకపాదు డనే ఒక తుచ్ఛుడు అడ్డు తగులుతున్నాడు. వాడి శిష్యుడే యిప్పుడు కోటవెలపలనున్న భల్లూక మాంత్రికుడు!" అన్నాడు.

మర్కటుడు యిలా అనగానే జితకేత రాజుకు ఒక అనుమానం కలిగింది. ఎవరో యిద్దరు మాంత్రికులు, ఏవో అపూర్వ శక్తులు సాధించదలిచి, తనబోటి వాళ్ళను అందులో పాచికలుగా వాడు కుంటున్నారు. ఈ మాయామర్కటుడికి, తన సింహాసనం కాపాడటం కన్న, తన శత్రువైన భల్లూక మాంత్రికుణ్ణి హత మార్చటం ముఖ్యకార్యంగా కనబడు తున్నది. అందువల్ల కోటరక్షణ బాధ్యత తానే స్వయంగా నిర్వహించటం అన్ని విధాలా క్షేమం!

రాజు యిలా ఆలోచించి, మాయా మర్కటుడితో, ''మర్కటామాత్యా! మనం కోటగోడల మీదికి పోయి, శత్రు



వులు ఎంత దూరంలోవున్నారో చూడటం అవసరం. సైనికుల్ని కూడా తగు జాగ్రత్తలో వుండవలసిందిగా హెచ్చరించవలసివుంది,'' అంటూ దాపులనున్న కోట బురుజు కేసి బయలుదేరాడు.

మాయామర్కటుడు, ''అయ్యో, నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ పెద్దగా కేకపెట్టి, రాజును అనుసరించాడు.

జితకేత రాజూ, మాయామర్కటుడూ కోటగోడల మీదినుంచి, దాని ముందున్న మైదాన ప్రదేశం కేసి చూశారు. దిగువున గుర్రం మీద కాళీవర్మ, ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ, ఏనుగు మీద తలారిభల్లూకుడూ, రాక్షసుడు ఉగ్రదండుడూ—మరి కొందరు సైనికులూ వాళ్ళ కంటబడ్డారు.

రాజు వాళ్ళను చూస్తూనే నిలువెల్లా వణికిపోతూ, ''అమాత్యా, మిగతా వాళ్ల సంగతి కేంగాని, ఆ రాక్షసుణ్ణి చూస్తేనే, నా గుండె నీరైపోతున్నది. వాణ్ణి జయించటం మానవసాధ్యమేనా?'' అన్నాడు.

''మానవసాధ్యం కానిదంతా మంత్రసాధ్యం అన్నారు, పెద్దలు. అలా మంత్రసాధ్యం కూడా కానిది తంత్రసాధ్యం అన్నారు, పండితులు. బాబోయ్, నా మంత్రదండం ఎక్కడ?'' అని కీచుమంటూ ఎగిరి గంతువేశాడు మాయామర్కటుడు.

మర్కటుడి అరుపువిన్న ఆటవికుడు ఏనుగు మీద లేచి నిలబడి, బాణాన్ని అతడి కేసి గురిచేస్తూ, ''ఒరే, కోతికుంకా! ఇదుగో, నీ మంత్రదండం బాణంరూపంలో వస్తున్నది!'' అంటూ బాణాన్నివదిలాడు. అది జుయ్ఁమంటూ వచ్చి మర్కటుడి మోకాలికి తగిలింది.

బాణందెబ్బ తింటూనే మాయామర్కటుడు వెల్లకిలాపడి, ''తాంత్రిక గురో!'' అంటూ చప్పున లేచి నిలబడి, బాణాన్ని రెండు చేతులతో వడిసిపట్టుకుని బయటికి లాగి, ''ఒరే, యీ భ్రాంతిమతిని మీ బాణాలు ఏం చేయగలవు?'' అంటూ బాణాన్ని కాళీవర్మ, భల్లూకమాంత్రికుల కేసి విసిరివేశాడు. —(ఇంకా వుంది)





# భల్లూకమాంత్రికుడు

## 19

[రాజు జితకేతుడు, మర్కటుడి మంత్రదండాన్ని తెచ్చినవారికి తాను దత్తు చేసుకోబోతున్న కన్యతోపాటు, అర్ధరాజ్యం యిస్తానని ప్రకటించాడు. మాయామర్కటుడు కోటగోడ పైకి రావటం చూసి, ఏనుగు మీద వున్న ఆటవికుడు అతణ్ణి బాణంతో కొట్టాడు. మర్కటుడు కోపంగా ఆ బాణాన్ని కాళీవర్మా, భల్లూకమాంత్రికుల కేసి విసిరాడు. తరవాత—]

బాణందెబ్బ తినకముందు మాయా మర్కటుడు, నా మంత్రదండం ఎక్కడ? అంటూ పెట్టినకేక భల్లూకమాంత్రికుడితో పాటు, అందరూ విన్నారు. భల్లూకమాంత్రికుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో, "శిష్యా, కాళీవర్మా! ఆ మర్కటుడి కేక విన్నావు గదా? నీకేం అర్థమవుతున్నది? నా నుంచి వాడు దొంగిలించిన మంత్రదండాన్ని, వాడు ఎక్కడో పారవేసుకోవటమో లేక దాన్ని మరెవరో దొంగిలించటమో జరిగిందన్న మాట! అవునా?" అని అడిగాడు.

కాళీవర్మ ఒక్క క్షణకాలం నివ్వెరపడి, "అవును, గురో! ఈ కోతివాణ్ణించి, ఆ మంత్రదండాన్ని మరెవరో తస్కరించారు. వాళ్ళెవరో తెలుసుకోవటం ఎలా? పైగా, మనం నగరంలో చొరపడాలన్నా ఒక పట్టాన సాధ్యమయేలా లేదు.



ఈ రాజు కోట తలుపుల్ని ఇనుముతో చేయించాడు. దుర్ముఖరాజు కోటతలుపులు కొయ్యవి కావటం వల్ల, మనం వాటికి నిప్పుపెట్టి కాల్చి, కోటలో ప్రవేశించగలిగాం,'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు ఒరలోంచి కత్తి దూసి, ''ఈ రాత్రికి మనం కోటవెలపలే డేరాలు నిర్మించి, వాటిల్లో వుండబోతున్నాం. కోట తలుపులు ఎలా బద్దలు చేయాలన్న సంగతి, రేపు తీరిగ్గా ఆలోచించవలసిందే.'' అన్నాడు.

ఆ మాటలు విని రాక్షసుడు ఉగ్రదండుడు కోపంగా పళ్ళుకొరికి, ''నా రాతిగద కోట ద్వారాలను బద్దలుచేయలేకపోయింది; గోడలనేమైనా పగలకొట్టగలదేమో చూస్తాను,'' అంటూ వేగంగా పోయి, గదతో గోడను బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు కోట రాళ్ళలో ఒకటి పగిలి, ఒకటి, రెండు ముక్కలు కిందపడినై. ఆ మరుక్షణం గోడలపైన వున్న సైనికులు, ఉగ్రదండుడి కేసి బాణాలు వదిలారు.

భల్లూక మాంత్రికుడు, ఉగ్రదండుణ్ణి యివతలికి రమ్మని హెచ్చరించి, కాళీవర్మతో, ''వర్మా, మర్కటుణ్ణించి, నా మంత్రదండాన్ని, మరెవరైనా మాంత్రికుడు దొంగిలించాడేమో అన్న అనుమానం కలుగుతున్నది,'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు యిలా మాట్లాడుతున్న సమయంలోనే, రాజభవనం ముందు ఎలుగుబంటు పట్టినప్పుడు, మర్కటుడి చేతినుంచి జారిపడిన మంత్రదండాన్ని తీసుకుని, తమ జోలెలో పెట్టుకున్న బైరాగియువకులు; నగరం వెలపల చెరువుగట్టు మీద వున్న మర్రిచెట్టు కింద మంత్రం జపిస్తున్న తమ గురువును సమీపిస్తున్నారు.

ఆ బైరాగి యువకుల్లో పెద్దవాడు చిన్నవాడి నుంచి మంత్రదండాన్ని తన చేతికి తీసుకుని, ''ఒరే, తమ్ముడూ, గురువుగారికిచ్చేముందు ఈ మంత్రదండం మహిమేపాటిదో చూద్దామా?'' అన్నాడు.

చిన్న బైరాగి సరే అన్నట్టు తల ఊపాడు. పెద్దవాడు మంత్రదండాన్ని పైకెత్తి పట్టుకుని, "అహాం, ఇహ్రీం, ఉహ్రూం! నిధి ద్వారాలు తెరు!" అంటూ బలంగా నేల కేసి కొట్టాడు.

అప్పుడైన పెద్ద ధ్వనికి గురు బైరాగి కళ్ళు తెరవకుండానే, "ఒరే, భైరవ బైరాగి ఎదటే మంత్రాన్ని తప్పుగా ఉచ్చరిస్తున్న పాపి ఎవడు? ఇదే, వాణ్ణి భస్మం చెయ్యబోతున్నాను!" అంటూ ఇత్తడి, వెండిపువ్వులు తాపడం చేసిన పొట్టి దండాన్నొకదాన్ని పైకెత్తాడు.

తమ గురువు అన్నమాటలకు భయ కంపితులైపోయిన బైరాగి శిష్యులిద్దరూ, అంతలోనే మంత్రదండం దెబ్బ తగిలిన చోట భూమిలో చిన్న పగులు ఏర్పడి, అందులోనుంచి చివ్వుమంటూ నీరు పైకి ఎగరటం చూసి, సంభ్రమాశ్చర్యాలు చెందారు. గురుబైరాగి కోపంగా పళ్ళు కొరుకుతూ, కళ్ళు తెరవబోయేంతలో, అతడి మీద నీరు జడివానలా పడింది.

భైరవభైరాగి, "గురు ప్రభో!" అంటూ ఎగిరిలేచి నిలబడి, "ఉరుములూ, మెరుపులూ లేని యీ వాన ఏమిటి?" అంటూ దూరంగా కనబడిన శిష్యులకేసి చూసి, "ఒరే, భూమిలోంచి ఆకాశంకేసి నీటిధార ఎగురుతున్నది, ఏమిటా వింత?" అన్నాడు.

ఆ మాటతో బైరాగి శిష్యు లిద్దరూ కొంచెం ధైర్యం తెచ్చుకుని, "భైరవ





గురో! మా మంత్ర శక్తితో, యీ నీటి బుగ్గను భూమి నుంచి పైకి తెప్పించాం. ఈనాటితో మా విద్య పూర్తయినట్టేగదా?'' అన్నారు.

జరిగిందేమిటో అర్థంకాక, ఆశ్చర్య పోతూ తన శిష్యుల్ని సమీపిస్తున్న భైరవ బైరాగి, తన పెద్ద శిష్యుడి చేతిలో వున్న మంత్రదండం కంటబడగానే, మరింత ఆశ్చర్యపోయి, ''ఒరే, ఏమిటది? మంత్రదండంలాగున్నదే!'' అన్నాడు.

''గురో, ఇది మంత్రదండంలాగా వుండటం కాదు, మంత్రదండమే! మూడు ముక్కల మంత్రం ఉచ్చరించి, నిధి ద్వారాలు తెరవమంటే, పాతాళగంగను పైకి లేపింది,'' అన్నాడు పెద్ద శిష్యుడు ఉత్సాహంగా.

భైరవబైరాగి శిష్యుడి చేతిలో నుంచి మంత్రదండం తీసుకుని, దాన్ని అటూ యిటూ తిప్పి చూసి, ''ఇది ఏ మాంత్రికుడి చేతిలోనో చాలా కాలంగా నలిగి, బాగా నునుపు తేలింది. ఇది మీ చేతికి ఎలా చిక్కింది? దొంగిలించారా? ఆ మాంత్రికుడేమయ్యాడు?'' అని అడిగాడు.

పెద్ద శిష్యుడు, చిన్నవాడికి మాట్లాడ వద్దని సైగ చేసి, గురువు చేతిలో నుంచి మంత్రదండాన్ని చప్పున లాక్కుని, ''గురో, ముందు జలధారను ఆపాలి. లేకపోతే కొద్ది గంటల్లో నగరమే నీట మునిగిపోగలదు,'' అని, మంత్రదండాన్ని పైకెత్తి, "నిధి ద్వారాలు బంధించు!'' అంటూ నీటిధార వస్తున్న ప్రదేశాన బలంగా కొట్టాడు.

ఈసారి మంత్రదండం దెబ్బకు భూమి ఫెళఫెళమంటూ పగిలిపోయి, అక్కడ ఒక మనిషి పట్టేంత కంత ఏర్పడింది. ఇది చూస్తూనే భైరవ బైరాగి ఎగిరి గంతు వేసి, ''ఒరే, శిష్యాప శిష్యుల్లారా! ఎలా సంపాదిస్తేనేం, అద్భుత శక్తులు గల మంత్రదండాన్ని నాకు కానుకగా తెచ్చారు. మీ గురు భక్తికి మెచ్చాను. జలధార

ఆగిపోయి. నిధి ద్వారాలు తెరుచుకున్న ట్టున్నది. లోపలికి దిగి అక్కడున్న నిధులేమిటో తెలుసుకోండి,'' అన్నాడు.



చిన్నశిష్యుడు మంత్రదండం కేసి అనుమానపడుతున్నవాడిలా చూస్తూ, ''భైరవ గురో! ఈ మంత్రదండం శక్తుల్ని నమ్మి, మనం ఏవో చిక్కుల్లో పడబోతున్నాం అని నాకు భయంగా వున్నది. నిధి ద్వారాలు తెరవమంటే, భూమిలోంచి నీటిబుగ్గను ఆకాశంలోకి లేపింది. ఆ సంగతి గమనించారా? దీనివల్ల నిధులు దొరుకుతవన్న నమ్మకం నాకు లేదు,'' అన్నాడు.

శిష్యుడు యిలా అనేసరికి భైరవ బైరాగికి కూడా మంత్రదండాన్ని గురించి శంక కలిగింది. అది కోరినది కాక మరొకటి యివ్వటం మొదలు పెడితే, అది ఎన్ని ప్రమాదాలకైనా దారి తీస్తుంది!

బైరాగి యిలా ఆలోచిస్తూ, పెద్ద శిష్యుడి నుంచి మంత్రదండాన్ని తీసుకుని, దానికేసి పరీక్షగా చూస్తున్నంతలో, వాడు ఒకసారి పెద్దగా నవ్వి, "గురో, దీని శక్తులెలాంటివో మనకెందుగ్గాని, ఒక పని చేద్దామంటారా? దీన్ని మంత్రశక్తులు గల ఒకానొక మర్కటుడి నుంచి మేం సంపాయించాం. వాడిప్పుడు జితకేత రాజుగారి ప్రధానమంత్రి! పోయిన యీ మంత్రదండాన్ని తిరిగి తెచ్చిన వాళ్ళకు అర్ధరాజ్యంతోపాటు, తన కుమార్తెను కూడా యిచ్చి పెళ్ళి చేస్తానని, ఆ రాజు ప్రకటించాడు,'' అన్నాడు.

అర్ధరాజ్యం, రాజకుమార్తె అని వింటూనే భైరవబైరాగి ''గురుప్రభో!'' అంటూ పెద్దగా అరిచి, ''ఒరే, శిష్యుల్లారా, యింత ముఖ్య విషయాన్ని నాకు చెప్పకుండా, యింతసేపు దాచారన్న మాట. నేను అర్ధరాజ్యం, మీలో ఒకరు రాజకుమార్తెనూ పెళ్ళాడటం బాగానే వుంటుంది. కాని, రాజుల మాటలు అంతగా నమ్మదగినవి కాదు. ఆ జితకేతుడు మన నుంచి మంత్రదండాన్ని




తీసుకుని. తలలు నరికించేస్తే. మనం చేయగలదేమున్నది!'' అంటూ తల పంచుకుపోయి. మర్రిచెట్టు బోదెకు చేరగిలపడ్డాడు.

గురువు యిలా అన్న తరవాత బైరాగి శిష్యులకూడా రాజు మాటలు నమ్మదగినవి కాదేమో అన్న అనుమానం కలిగింది. చిన్నవాడు భూమిలో ఏర్పడిన కంతను సమీపించి. పెద్దవాడిచ్చిన చేయి ఆసరాతో లోపలికి దిగి, మరుక్షణంలో, ''భైరవ గురో! ఇక్కడేవో మెట్లూ, భూసొరంగం వున్నది. మంత్రదండం మనకు నిధి ద్వారాలే తెరిచి వుంటుంది.'' అంటూ కేక పెట్టాడు.

భైరవబైరాగి ఉత్సాహంగా తన శిష్యుల దగ్గిరకు వచ్చి. "ఒరే, శిష్యోప శిష్యుల్లారా! అదృష్టంకొద్దీ మనకు నిధి దొరికితే. మనం ప్రస్తుతానికి దానితో తృప్తి పడదాం. ఈ మంత్రదండాన్ని రాజుకు యివ్వాలో లేదో తరవాత నిదానంగా ఆలోచించవచ్చు.'' అంటూ తానూ సొరంగ మార్గంలోకి దిగుతూ, పైనున్న శిష్యుణ్ణి కూడా వెంటరమ్మన్నాడు.

గురు. శిష్యులు అక్కడ వున్న మెట్ల మీదుగా మరికొంత దిగువకు పోయేసరికి, ఆ ప్రదేశం జలమయంగా వున్నది. వాళ్లు మోకాటి లోతు నీటిలో కొంత దూరం నడిచేసరికి, సొరంగ మార్గంలో దూరంగా చిన్న వెలుగు కనిపించింది.

భైరవబైరాగి మహదానంద పడిపోతూ, తన శిష్యులతో, ''ఒరే, ఆ వెలుగు మరేదో అయివుండదు. నిధినిక్షేపంలోని మణిమాణిక్యాలు అలా ధగధగ లాడుతున్నవి. ఇంతకూ, అక్కడ ఒకవేళ నిధిని కాపాడుతూ, ఏ యక్షుడో వుండటం జరిగితే, మనం ఏం చెయ్యాలి?'' అన్నాడు.

''ఆ సంగతి గురువులైన తమరే మాకు తెలియచెప్పాలి.'' అన్నాడు పెద్దశిష్యుడు.

చిన్న శిష్యుడు హేళనగా నవ్వి. ''ఒరే, అన్నశిష్యా! నీకు గురువుగారు చెప్పిన

మంత్రాలైతే నోట పట్టినైగాని, లోకజ్ఞానం ఆవగింజంత అయినా అబ్బలేదు. మనకు నిధిని చూపించిన యీ మంత్రదండం ఎటువంటి అద్భుత శక్తులు గలదో, ఆలోచించలేదా? ఆ నిధుల కాపలా యక్షుడికి, మంత్రదండాన్ని తాకించామంటే వాడు టపాకాయిలా పేలిపోతాడు,'' అన్నాడు.

''బాగా చెప్పావు. ఉపశిష్యా! నా మంత్రబోధ, నీకు బాగా ఒంటపట్టింది. ఇక ఆట్టే మాట్టాడక నిశ్శబ్దంగా ముందుకు నడవండి,'' అన్నాడు భైరవ బైరాగి, మంత్రదండాన్ని దూరంగా కనబడుతున్న వెలుగు కేసి గురిచేస్తూ.

అంతలో వాళ్ళకు పైన భూమి కంపించిన ధ్వనితోపాటు ఏనుగు ఘీంకరించటం వినబడింది. ముగ్గురూ ఒకటి, రెండు క్షణాలపాటు భయంతో స్తంభించిపోయారు. ముందుగా బైరాగి తెప్పరిల్లి, ''ఒరే, మన మర్రిచెట్టు కిందికి అడవి ఏనుగులో లేక గజసైనికులో వచ్చినట్టుంది. వాళ్ళు మన రహస్య సొరంగ మార్గం గుర్తించి, లోపలికి దిగితే మనం ఏం చెయాలి?'' అన్నాడు.

''ఏం చేయాలన్నది గురువులైన తమరే ఆలోచించి, మాకు చెప్పాలి,'' అన్నాడు పెద్ద శిష్యుడు.



చిన్నశిష్యుడు పకపక మంటూ నవ్వి, ''అడవి ఏనుగులకూ, గజసైనికులకూ చెరువు కట్టల మీది కంతలూ, గుంటలూ చూడటం తప్ప మరేంపని లేదనుకున్నారా? ఆ కనబడే నిధిలోని రత్నరాసుల గురించి తప్ప, మరిదేన్ని గురించీ ఆలోచించకండి,'' అన్నాడు.

వాడు మాట ముగించేలోపలే పైనుంచి ఒక మన్నుపెళ్ళ విరిగి దభీమంటూ వాళ్ల ముందు పడింది. గురుశిష్యులు భయకంపితులైపోయి, చిన్నగా అరిచి, సొరంగ మార్గాన ముందుకు పరిగెత్తసాగారు.

ఆ సొరంగ మార్గం పైనవున్న చెరువు కట్టమీద, గుడారాలు నిర్మించేందుకు

మంచి చోటుకోసం వెతుకుతూ ఏనుగు మీద వచ్చిన తలారిభల్లూకుడూ, ఆటవికుడూ, తామెక్కివున్న ఏనుగు కాలొకటి హఠాత్తుగా భూమిలోదిగిపోయి, అది ఘీంకరిస్తూ ముందుకు పడిపోవటం చూస్తూనే, దానిమీది నుంచి కిందికి దూకేశారు. ఆ మరుక్షణం ఏనుగు తొండంతో భూమిని గట్టిగా తాటిస్తూ లేచి నిలబడింది.

తలారి భల్లూకుడు చుట్టూ ఓ మారు కలయచూసి, ఆటవికుడితో, "కాళీవర్మ దొరా, భల్లూక మాంత్రికుడు కూడా ఒక సారి యీ ప్రదేశం చూస్తే బావుండును. ఇక్కడ నీటికి కొదవలేదు; మనం పట్టవలసిన జితకేతురాజు కోట కూడా దగ్గిర్లోనే వుంది. ఎన్ని మంత్రాల్ను నేర్చినా ఆ మాయామర్కటుడు, తన కోతి స్వభావం కొద్దీ, యీ ఊడలమర్రి కేసి రావటం జరిగితే, వాణ్ణి తేలిగ్గా పట్టుకుని, భల్లూక మాంత్రికుడి మంత్రదండాన్ని గుంజుకోవచ్చు." అన్నాడు.

ఆటవికుడు, తలారి భల్లూకుడి మాటలేవీ వినటంలేదు. వాడు ఏనుగుకాలేమైనా విరిగిందేమో అని పరీక్షిస్తూ, దాన్ని అటూ యిటూ నడిపిస్తున్నాడు. ఏనుగు ఏ మాత్రం కుంటకుండా మామూలుగా నడవటం చూసి, వాడు తృప్తిపడి తలారి భల్లూకుడితో, "తలారి భల్లూకయ్యా! మన వాహనం కాళ్ళేమీ చెక్కుచెదరలేదు; అదృష్టవంతులం!" అన్నాడు.

ఆ వెంటనే మర్రికొమ్మల్లోంచి ఒక బోయవాడు కిందికి దూకుతూ, "దొంగ బైరాగుల్ని మింగిన భూసారంగం కంత కేసి, మీ ఏనుగు పోకపోవటం, మీ అదృష్టం. లేకపోతే అది మిమ్మల్ని, బైరాగుల్లాగే నిలువునా మింగేసేది." అన్నాడు.

తలారి భల్లూకుడు, "దిరిసెనవన భైరవా!" అంటూ గండ్రగొడ్డలి పైకెత్తి, "ఎవడివిరా నువ్వు! మాయామర్కటుడి శిష్యుడివా?" అంటూ బోయవాడి కేసి బయలుదేరాడు. —(ఇంకా వుంది.)






## 20

[మంత్రదండం తీసుకుపోయిన బైరాగిశిష్యులు, దాని ప్రభావం తెలుసుకునేందుకు నేల మీద కొట్టగా, అక్కడ సొరంగం ఏర్పడింది. లోపల ఏవో నిధులుండగలవన్న ఆశతో గురుబైరాగి, వాళ్ళూ అందులో దిగారు. ఆ సమయంలో చెరువు దగ్గిరకు వచ్చిన తలారి భల్లూకుడు, ఒక బోయవాణ్ణి చూసి, కోపంగా వాడి మీదికి బయలుదేరాడు. తరవాత—]

తలారి భల్లూకుడి భయంకరాకారాన్నీ, అతడి చేతిలో తళతళ మెరుస్తున్న గండ్రగొడ్డలినీ చూసి, బోయవాడు పారి పోయే ప్రయత్నం ప్రమాదకరమని గ్రహించి, నిలువెల్లా వణికిపోతూ, చేతులు జోడించి, "అయ్యా, గత వారంరోజులుగా నేను అరణ్యంలో వింతమనుషుల్నీ, భయంకరుడైన ఒక రాక్షసుణ్ణీ కూడా చూశాను. కాని, వాళ్ళెవరితోనూ నేను మాట్లాడిందిలేదు. నేను మీరనే మాయా మర్కటుణ్ణి చూడలేదు. నడికొప్పుతలతో, ఎర్రబట్టలు కట్టినవాడొకడు, శంఖం ఊదుతూ, 'శిష్యా, మాయామర్కటా!' అంటూ పిలవటం మాత్రం విన్నాను," అన్నాడు.

బోయవాడు యిలా చెప్పగానే, తలారి భల్లూకుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో గజ బిజిపడిపోతూ, గండ్రగొడ్డలి దించి, "ఒరే,



బోయా! నువ్వేదో చాలా ముఖ్యమైన సంగతులు చెపుతున్నట్టు నాకు అనుమానం కలుగుతున్నది. వాటివెనక వున్న రహస్యం ఏమిటో నా యజమాని కాళీవర్మ ప్రభువుకే తెలియాలి. పారిపోకు, నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు,'' అన్నాడు.

అటవికుడు కూడా ఆశ్చర్యపోతూ, ''తలారి భల్లూకయ్యా, ఈ బోయవాడు చెప్పేవి నమ్మదగినమాటలేనా? ఒక మాంత్రికుడూ, రాక్షసుడు ఉగ్రదండుడూ మన వెంటనేవున్నారు. అలాంటప్పుడు మరొక మాంత్రికుడూ, రాక్షసుడూ అరణ్యంలో తిరుగుతూండటం ఏమిటి?'' అన్నాడు.

''అదే నాకు అంతుచిక్కటం లేదు. మన భల్లూక మాంత్రికుడికి పోటీగా మరొక మాంత్రికు డెవడైనా బయలుదేరాడేమో. సరే, బోయా! నువ్వనే దొంగ బైరాగులూ, భూసారంగం సంగతేమిటి?'' అని అడిగాడు తలారి భల్లూకుడు.

బోయవాడు అతణ్ణి, గురుబైరాగి, వాడి శిష్యులూ దిగిపోయిన సారంగం దగ్గిరకు తీసుకుపోయి, మంత్రదండంతో వాళ్ళు చేసిన అద్భుతాలనుగురించి చెప్పాడు.

ఆ మంత్రదండం భల్లూకమాంత్రికుడి నుంచి, మాయామర్కటుడు దొంగిలించుకుపోయినదే అని తలారి భల్లూకుడికి అర్థమైపోయింది. ఇప్పుడా మంత్రదండం మరెవరో బైరాగుల చేతబడిందన్నమాట!

తలారి భల్లూకుడు యీ సంగతి కాళీవర్మ, భల్లూకమాంత్రికులకు చెప్పేందుకు బయలుదేరనున్నంతలో, కాళీవర్మ గుర్రం మీద అక్కడికి వచ్చి, ''భల్లూకా, యీ ప్రాంతం మనం గుడారాలు నిర్మించేందుకు అనుకూలంగా వున్నట్టున్నదే!'' అన్నాడు.

తలారి భల్లూకుడు, కాళీవర్మను సమీపించి, ''కాళీవర్మ దొరా గుడారాల



మాట తరవాత. ముందు యీ బోయవాణ్ణి అడిగి చూడండి. వీడు రెండు ఆశ్చర్యం కలిగించే విషయాలు చెబుతున్నాడు,'' అన్నాడు.

కాళీవర్మ ప్రశ్నించగా, బోయవాడు మరొకసారి తాను అరణ్యంలో చూసిన శంఖం ఊదేవాణ్ణీ, రాక్షసుణ్ణి గురించి; బైరాగులూ, అతడి శిష్యులిద్దరూ మంత్ర దండం మహిమతో భూమికి సొరంగం కొట్టి, అందులో దిగిపోయిన సంగతీ చెప్పాడు.

ఆ వెంటనే కాళీవర్మ, భూసొరంగం ముఖద్వారం దగ్గిరకుపోయి, ఒకసారి లోపలికి తొంగి చూసి, జాగ్రత్తగా లోపలికి దిగాడు. అతడు అక్కడ వున్న మెట్లు దాటగానే, దూరంగా ఎక్కడో కనిపిస్తున్న చిన్న వెలుగూ, దానికేసి నడుస్తున్న మూడు నల్లని ఆకారాలూ అతడి కంటబడినై.

కాళీవర్మ చప్పున సొరంగమార్గం పైకి వచ్చి, తలారి భల్లూకుడితో, ''తలారి భల్లూకా! నీ ఆటవికసేవకుణ్ణి యిక్కడ కాపలా వుంచి, నువ్వు వెంటనే బయలు దేరిపోయి, మాంత్రిక గురువుకు యిక్కడ విన్నదీ, చూసినదీ—అంతా చెప్పు. నేను యీలోపల సొరంగమార్గాన పోయి, పారిపోతున్న బైరాగుల దగ్గిర వున్న మంత్ర దండాన్ని తిరిగి సంపాయిస్తాను,'' అన్నాడు.

తలారి భల్లూకుడు బయలుదేరి నాలు గైదడుగులువేసి ఆగి, ''కాళీవర్మ ప్రభో! ఇప్పుడా బైరాగుల దగ్గిర వున్నది, భల్లూక మాంత్రికుడి మహిమ గల మంత్రదండం. ఆ సంగతి మరవకండి,'' అన్నాడు.

కాళీవర్మ కత్తి దూసి, సొరంగం కేసి తిరిగి, ''భల్లూకా, నా దగ్గిర వున్న యీ బంగారు పిడి గల కత్తి మహత్తు మాటేమోగాని, శక్తిలో ఏ మంత్రదండానికీ తీసిపోదు. నా తండ్రి చేతిలో వుండగా యిది, యిప్పటి రాజు జితకేతుడి తండ్రి గారి శత్రువులనెందరినో హతమార్చింది.



బహుశా, ఈ కత్తి త్వరలోనే యీ జితకేత రాజు తల నరకవచ్చు.'' అన్నాడు.

మర్రిచెట్టు మీది నుంచి కిందికి దూకిన బోయవాడు దిక్కులు చూస్తూ, "అయ్యో యిక నా దారిన నేను పోవచ్చా?'' అని అడిగాడు.

తలారి భల్లూకుడి సేవకుడైన ఆటవికుడు వాణ్ణి సమీపించి, ''ఒరే, నువ్వు బోయవాడివి, నేను ఆటవికుణ్ణి. బతుకు తెరువుకు మనిద్దరం చెట్టూపుట్టా పట్టుకు తిరగవలసినవాళ్లమే. అందువల్ల నువ్వూ, నాలాగే ఏ శక్తిమంతుణ్ణో ఆశ్రయించి, ఎందుకు బతగ్గూడదు? ఈ చంద్రశిలా నగరం రాజు జితకేతుడు యింకా ఆట్టే కాలం సింహాసనం మీద వుండడని, నా నమ్మకం. అప్పుడు గెలిచినవాళ్ళ పక్షాన వున్న మనకు, రాజాస్థానంలో మంచి నౌకరీలు దొరికే అవకాశం వున్నది.'' అన్నాడు.

బోయవాడు ఆశగా ఆటవికుడి కేసి చూస్తూ, ''ఆటవికన్నయ్యా, నువ్వేదో చాలా చెప్పావు, బాగానే వున్నది. దుర్మార్గుడూ, చేతగానివాడూ అయిన ఈ జితకేతరాజును సింహాసనం మీది నుంచి దింపగలిగిన బలవంతుడెవరు?'' అని అడిగాడు.

ఆటవికుడు అప్పుడే సొరంగమార్గంలోకి దిగిపోతున్న కాళీవర్మను చూపిస్తూ, ''ఆయన పేరు కాళీవర్మ. లోగడ రాజు జితకేతుడు ఆయన్ను అవమానించటమే గాక, దిరిసెనవనంలో తల నరికించేందుకూడా ప్రయత్నించాడు. ఇప్పుడాయన, ఆ రాజు మీద పగ దీర్చుకోబోతున్నాడు,'' అన్నాడు.

బోయవాడు, ''అన్నా, నేనూ, నీతో పాటే!'' అంటూ ఎగిరి గంతేసి ఆటవికుణ్ణి కావిలించుకున్నాడు.

సొరంగమార్గం ప్రవేశించిన కాళీవర్మ, మోకాటి నీటిలో కొంతదూరం నడిచి, ముందుపోతున్న బైరాగులను హెచ్చరిస్తూ, ''ఒరే, ఆగండి!'' అంటూ కేకపెట్టాడు.



ఆ కేక వింటూనే బైరాగులు వెనక్కు తిరిగి చూశారు. బైరాగి చిన్న శిష్యుడు గడగడలాడిపోతూ, ''బైరాగి గురో! నిధులను కాపాడే యక్షుడు మన ప్రాణాలు తీయటానికి వస్తున్నాడు.'' అన్నాడు.

గురుబైరాగి కూడా ఒక క్షణంపాటు భయభ్రాంతుడైపోయి, కాళీవర్మ కేసి పరీక్షగా చూసి, ''ఒరే, శిష్యోపశిష్యుల్లారా, మనం మరీ అంతగా భయపడవలసిన పని లేదు. ఈ వస్తున్నవాడు యక్షుడిలా లేడు. యక్షులు పొట్టిగా వుంటారనీ, కంఠస్వరం చాలా పీలగా వుంటుందనీ, మా గురువు చెప్పగా విన్నాను. వీడు అజానుబాహుడు; కంఠస్వరం కంచు గంటలా మోగింది. మామూలు మనిషే. మన మంత్రదండంతో పరలోకయాత్ర కట్టిద్దాం,'' అన్నాడు.

గురుబైరాగి మాట పూర్తి చేసేంతలో కాళీవర్మ వేగంగా వాళ్ళను సమీపిస్తూ, ''ఒరే, మీ సంగతంతా, నాకు తెలుసు. ఈ కత్తి, మీరు దొంగిలించిన మంత్ర దండం కన్న శక్తిగలది! పరీక్షించి చూస్తారా?" అంటూ కత్తి ఝుళిపించాడు.

కత్తి తళతళలు చూస్తూనే బైరాగి శిష్యులిద్దరూ హడలెత్తిపోయి, ''గురో! త్వరగా మంత్రం జపించి, వాణ్ణి భస్మం చెయ్యండి!'' అన్నారు.

గురుబైరాగి ఒకపక్కన భయం కొద్దీ వడవడ వణికిపోతూనే, మంత్రదండం ఎత్తి, ఏదో మంత్రం జపించాడు. అందు వల్ల ఏ ప్రయోజనం కలగకపోగా, కాళీవర్మ అతణ్ణి సమీపించి, కత్తిని గుండెల కానిస్తూ, ''ఒరే, బైరాగీ! ఆ మంత్ర దండం, దాని యజమానినైన, నా ఒక్కడి మాటే వింటుంది. దాన్ని యిస్తావా, గుండెల్లో కత్తి దించమంటావా?" అన్నాడు భీకరంగా.

గురుబైరాగి యివ్వటమా, మానటమా అని తటపటా యిస్తున్నంతలో, శిష్యులిద్దరూ ఏక కంఠంగా, ''బైరాగి గురో, ఆ మంత్రదండం యిచ్చెయ్యండి. దానికే



మాత్రం మహత్తున్నా మనను కాపాడేది. ఈ చలికాలంలో, చలిమంటలో వేయటానికి తప్ప, అది మరెందుకూ కొరగాదు," అన్నారు.

"లెస్స పలికార్రా, శిష్యోపశిష్యుల్లారా!" అంటూ గురు బైరాగి లేని గాంభీర్యం తెచ్చిపెట్టుకుని, కాళీవర్మకు మంత్రదండాన్ని యిస్తూ, "వీరయువకుడా! నీ సాహస ప్రతాపాలకు మెచ్చాను. ఈ మంత్రదండాన్ని ఎత్తుకుపోయి, జితకేతరాజు దత్తాడబోతున్న పిల్లను పెళ్లాడి, నూరేళ్ళపాటు హాయిగా చంద్రశిలా నగరాన్ని పాలించు. నా వాక్కుకు తిరుగులేదు," అన్నాడు.

ఆ మాటలకు నవ్వుతూ, కాళీవర్మ మంత్రదండాన్ని తీసుకుని, ముందుకు వెళ్ళటమా లేక వెనక్కు తిరిగిపోవటమా అని ఆలోచిస్తున్నంతలో, గురు బైరాగి రహస్యం చెపుతున్నవాడిలా, "వీరయువకుడా! ఆ నిధుల్లో కాస్తంతభాగం మాకూ యివ్వటం ధర్మంగదా?" అన్నాడు.

గురుబైరాగి యిలా అన్న తరవాత కాళీవర్మకు మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. అతడు బైరాగులకేసి ఓ మారు పరీక్షగా చూసి, "పాపం, మీరు యీ సొరంగంలో ఏవో నిధులున్నవని ఆశపడి, యిక్కడికి వచ్చినట్టున్నది. కాని, నా ఉద్దేశం యీ సొరంగం రాజుగారి కోటలో నుంచి, అవసరం కలిగినప్పుడు శత్రువులకు దొరకకుండా పారిపోయేందుకు, యిప్పటి రాజవంశంవాళ్లు తవ్వించినదిలా కనబడుతున్నది. కాని, యిక్కడేమైనా వెండి, బంగారాల్లాంటివి దొరికితే, వాటిని తీసుకుపోయేందుకు, మీకు అనుమతి యిస్తాను. నాతోపాటు సొరంగమార్గం వెంట ముందుకు రాగలరా?" అని అడిగాడు.

గురుబైరాగి, శిష్యులతోపాటు అమితానందపడిపోతూ, "వీరయువకుడా! నీ మాట కాదనగలమా? ముందుండి దారి తియ్యి," అన్నాడు.

అందరూ కలిసి దూరంగా సన్నని వెలుగుపడుతున్న ప్రదేశాని కేసి నిశ్శబ్దంగా నడిచారు. ఒకచోట సొరంగ మార్గం అంతమైపోయి, పైనున్న రాతి పలక సందుల నుంచి, చిన్న వెలుగు కిందికి ప్రసరిస్తున్నది.

కాళీవర్మ, బైరాగులతో, ''మనం పైనున్న రాతిపలకను నిశ్శబ్దంగా పక్కకు నెట్టగలిగితే, ఆ తరవాత, రాజుగారి కోట లోని ఏ భాగంలో మనం వున్నామో తెలుసుకోవచ్చు. ఊఁ, ఒక పట్టు పట్టండి!'' అన్నాడు.



అందరూ కలిసి రాతిపలకను పక్కకు నెట్టారు. వెంటనే సొరంగమార్గం సూర్య కాంతితో మిలమిల్లాడింది. పైన రాతి పలకను కప్పివున్న కొన్ని పూలమొక్కలు చిన్న శబ్దంతో పక్కకు పడిపోయినై.

ముందుగా కాళీవర్మ పైకి వచ్చి, చుట్టూ ఓమారు కలయచూసి, తాము రాజుగారి ఉద్యానవనంలో ప్రవేశించినట్టు గ్రహించాడు. తరవాత అతడు సైగ చేయగానే బైరాగులందరూ సొరంగం నుంచి పైకి వస్తూనే, ''ఆహాఁ, ఏమీ ఉద్యానవన సౌందర్యం! జితకేత మహా రాజుగారిది లాగున్నదే!'' అన్నారు.

కాళీవర్మ వాళ్ళను మెల్లిగా మాట్టాడ మని హెచ్చరించి, ''మనం చాలా ప్రమాదకరమైన ప్రదేశానికి వచ్చాం. నాకు ప్రాణం మీద అంతగా తీపిలేదు. రాజభటులెవరైనా చూసి చుట్టుముట్టితే, ప్రాణాలుండగా వాళ్ళకు లొంగను. మీ సంగతేమిటి?'' అన్నాడు.

బైరాగి గురువు గజగజలాడిపోతూ, ''మాకు ప్రాణాలంటే మహా తీపి గనకే గదా, చావలేక యిలా ఏవో గాలి బతుకులు బతుకుతున్నాం! సొరంగంలో నిధి నిక్షేపాలు లేవని తెలిసిపోయింది. తమ అనుమతి అయితే, యిక మా దారిన మేం పోతాం,'' అన్నాడు.

కాళీవర్మ, బైరాగులను అలాగే వెళ్ళ మని చెప్పబోయేంతలో, సొరంగమార్గం

వైపున వున్న చెట్ల వెనక నుంచి రాజు జితకేతుడూ, మాయామర్కటుడూ ఏదో మాట్లాడుకుంటూ రావడం కనిపించింది. కాళీవర్మ చప్పున అక్కడ వున్న పూల పొదల చాటుకు పోతూ, బైరాగులతో, ''మీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. మీరు రాజూ, మాయామర్కటుడి కంట బడటం జరిగితే, పోయిన మంత్రదండం నగరంలోని ఏ సుబ్బిశెట్టి చేతిలోనో చూశామనీ, ఆ సంగతి చెప్పేందుకు వచ్చామనీ అబద్ధం ఆడేయండి. ఆ తరవాత ఏం జరుగుతుందో చూద్దాం,'' అన్నాడు.

కాళీవర్మ యిలా మాట్లాడుతున్న సమయంలోనే, ఎక్కడో దూరాన్నుంచి శంఖనాదం వినిపించింది. ఆ మరుక్షణం మాయామర్కటుడు అందుబాటులో వున్న చెట్టు కొమ్మమీదికి కీచుమంటూ ఎగురుతూ, ''జై, తాంత్రికగురో! తమరు శంఖాన్ని పూరిస్తున్నది కోటలోపలినుంచా, వెలపలి నుంచా?'' అంటూ కేకపెట్టాడు.

శంఖనాదం ఆగిపోయింది. మాయామర్కటుడు కొమ్మమీది నుంచి కిందికి గెంతబోతున్న తరుణంలో, వాడికి భయంతో దిక్కులు చూస్తున్న బైరాగులు ముగ్గురూ కనిపించారు.

మాయామర్కటుడు పెద్దగా కీచుమంటూ అరిచి, ''జితకేతు రాజా! ఇది తమ ఉద్యానవనమా లేక బైరాగుల మఠమా? వెంటనే ఆ పూల పొదల దగ్గిర వున్న బైరాగుల్ని పట్టి బంధించండి!'' అంటూ కిందికి దూకాడు.

రాజు జితకేతుడు గట్టిగా చప్పట్లు చరిచి, రాజభటులను పిలుస్తూ బైరాగులను సమీపించి, ''ఎవర్రా మీరు? ఎవరి అనుమతితో నా ఉద్యానం ప్రవేశించారు?'' అన్నాడు కోపంగా.

గురుబైరాగి రెండు చేతులూ పైకెత్తి, ''మహారాజా, మంత్రదండం!....సుబ్బిశెట్టి!....మంత్రదండం!....సుబ్బిశెట్టి!'' అంటూ అదే మాటగా కేకలు పెట్టసాగాడు.

—(ఇంకా వుంది)





# భల్లూక మాంత్రికుడు

## 21

[కాళీవర్మ సారంగ మార్గాన పోయి, బైరాగుల నుంచి మంత్రదండాన్ని తీసుకున్నాడు. తరవాత అందరూ జితకేతరాజుగారి ఉద్యానవనంలో ప్రవేశించారు. ఆ సమయంలో అక్కడికి రాజూ, మాయామర్కటులు వచ్చారు. రాజు, బైరాగులను అక్కడికెందుకొచ్చారని ప్రశ్నించగా, గురుబైరాగి మంత్రదండం, సుబ్బిశెట్టి, అంటూ అరవసాగాడు. తరవాత—]

గురుబైరాగి చెప్పదలిచిందేమిటో అర్థం కాక రాజు జితకేతుడు కోపంగా, ''ఒరే, సన్యాసి వెధవా, నీ వాగుడేమిటి ? మంత్ర దండం ఎక్కడ? సుబ్బిశెట్టి ఎవరు ?'' అని అడిగాడు.

గురుబైరాగి కొంచెం స్థిమితపడి, "మహా రాజా, బైరాగినైన నన్ను, సన్యాసి అని అవమానపరచకండి. బైరాగి వేరు, సన్యాసి వేరు.'' అన్నాడు.

రాజు ఆ జవాబుకు చిరాకుపడుతూ ఏదో అనబోయేంతలో, మాయామర్కటుడు కోపంగా పళ్ళు కొరికి, ''ఒరే, దొంగ బైరాగీ ! అట్టే మాటలు పెంచక, సంగతేమిటో చెప్పు. నా నుంచి ఎవరో దొంగిలించిన మంత్రదండాన్ని నువ్వెక్కడైనా చూశావా? '' అని అడిగాడు.

గురుబైరాగి, మర్కటుడి కేసి ఆశ్చర్యంగా చూసి, తన శిష్యుల కేసి తల



తిప్పి, ''ఒరే, శిష్యోపశిష్యుల్లారా! ఇతగాడేనా కొత్తగా చంద్రశిలా నగరానికి అమాత్యుడైన మర్కటుడు?'' అన్నాడు.

''అవును గురో, అవును! ఈయనే మర్కటామాత్యుడు!'' అన్నారు శిష్య బైరాగు లిద్దరూ.

మాయామర్కటుడు బైరాగిని కత్తితో కొట్టబోయిన వాడల్లా తమాయించుకుని, తోకతో ఛెళ్ళుమంటూ అతడి నడుం మీద కొట్టి, ''ఒరే, వెంటనే నువు చూసిందేదో చెప్పకపోయావో, యీసారి కత్తితో నీ తల నరికేస్తాను,'' అన్నాడు.

మర్కటుడి తోక దెబ్బకు గురుబైరాగి కింద పడిలేచి, ఒళ్ళు దులుపుకుంటూ తన శిష్యులకేసి చూశాడు. పెద్ద శిష్యుడు విచారంగా ముఖంపెట్టి, ''గురో, నిజం చెప్పెయ్యండి, మనకు బహుమానం కూడా వస్తుంది. నగర ఉత్తరపుద్వారం దగ్గిరున్న ధర్మసత్రం ఎదటి, మూడంతస్తుల భవంతి యజమాని సుబ్బిశెట్టి దగ్గిర గదా, మనం ఆ మంత్రదండాన్ని చూసింది,'' అన్నాడు.

గురుబైరాగి గొంతు సవరించుకుని మాట్లాడ బోతున్నంతలో మాయామర్కటుడు కిచకిచ మంటూ నవ్వి, ''ఒరే, మతిమాలిన వెధవా, యింకా మీ గురువు చెప్పే దేమిటి, సంగతంతా నువే చెప్పావు గదా? ఓయి రాజా! వెంటనే భటులను ఆ శెట్టి ఇంటికి పంపి, ఆ మంత్రదండాన్ని తెప్పించు,'' అన్నాడు.

ఈసారి రాజు గట్టిగా చప్పట్లు చరచగానే భటుడొకడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. రాజు వాడికి బైరాగులను చూపుతూ, ''ఒరే, వీళ్ళవెంట మరికొందరు భటులతో పోయి, మన నగరం వాడైన సుబ్బిశెట్టితోపాటు మంత్రదండాన్ని కూడా యిక్కడవున్నట్టు లాక్కురండి,'' అన్నాడు.

భటులు, బైరాగులను అదిలించి అక్కడి నుంచి తీసుకుపోతున్నంతలో, ఈసారి కోటగోడల అవతలి నుంచి

శంఖనాదం చెవులు దిబ్బిళ్ళుపడేలా వినిపించింది. వెంటనే మాయామర్కటుడు ఒక గెంతు గెంతి జితకేత రాజుతో, "ఆహా, రాజా! ఆ శంఖనాదం చేసే మహానుభావుడు నా గురువైన మిథ్యామిశ్రుడు! ఆయన మన శత్రువులైన భల్లూక మాంత్రికుడితోపాటు, రాజుదుర్ముఖుణ్ణీ, కాళీవర్మ, ఉగ్రదండ రాక్షసులనూ హతమార్చుతాడు. నువు క్షణాలమీద చక్రవర్తివి కాబోతున్నావు." అంటూ కోట గోడ కేసి బయలుదేరాడు.



రాజు జితకేతుడు మర్కటుడి భుజం పట్టుకు ఆపి, "నా సైనికులూ, సామంతు సూర్యభూపతీ; ఆ ఉగ్రదండ రాక్షసుడూ, భల్లూక మాంత్రికుల నుంచి కోటను ఎంతసేపు కాపాడగలరు! నువు కూడా వెంట లేకపోతే నాకు సలహాయివ్వగల వాళ్లు ఎవరూ లేరుగదా? మంత్రి జీవగుప్తుణ్ణి అవమానించి పంపటం పొరబాటుగా తోస్తున్నది." అన్నాడు.

"రాజా, నీకొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు, చింతించకు," అంటూ మాయా మర్కటుడు, కోటగోడ మీదికి పరిగెత్తాడు.

పూలపొదల చాటున దాగివుండి, అప్పటివరకూ అంతా గమనిస్తున్న కాళీవర్మ, యిదే మంచి అదను అనుకుంటూ రాజు కేసి బయలుదేరబోతున్నంతలో అక్కడికి సామంతు సూర్యభూపతి ఆయాసపడుతూ పరుగు పరుగున వచ్చి, "మహారాజా, నేనిప్పుడే బయలుదేరి, నా సొంత కోటకు పోతున్నాను. ఒక రాక్షసుడూ, శంఖం ఊదుతూ తన శిష్యుడితో వచ్చిన, ఒక మాంత్రికుడూ, కోట ద్వారాలు పగలకొట్టి లోపల ప్రవేశించాలని చూస్తున్నారట! లోపల నా భార్యా, కుమార్తే, కొద్దిమంది సేవకులూ తప్ప, మరెవరూ లేరు," అన్నాడు.

రాజు జితకేతుడు ఆశ్చర్యపోతూ, "ఇదంతా ఏదో గందరగోళంగా వున్నదే! ఒక రాక్షసుడూ, మాంత్రికుడైన భల్లూకుడూ నా కోట మీద దాడికి వచ్చారు.



మరొక మాంత్రికుడూ, రాక్షసుడూ ఏమిటి ? " అన్నాడు.

ఆ ప్రశ్నకు ఏమని జవాబివ్వాలో తోచక సామంతు సూర్యభూపతి దిక్కులు చూస్తూండగా, పూలపొదల చాటునుంచి కాళీవర్మ బయటికి వస్తూ, "మహారాజా, ఈ క్షణంలో నేను మీకు శత్రువును కాదు. కత్తి దూయకండి. మీరెంత నిస్సహాయ స్థితిలో వున్నారో, మీకన్న నాకెక్కువ తెలుసు. మీ మాయామర్కటుడు కోట గోడ దూకి బయటికి పోవటం, తమరు గమనించినట్టు లేదు," అన్నాడు.

రాజు జితకేతుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, "నీవు కాళీవర్మవు కాదా? లోగడ నీకేగదా నేను శిరశ్ఛేద శిక్ష విధించింది ? " అన్నాడు.

ఆ ప్రశ్నకు కాళీవర్మ చిన్నగా నవ్వి, "అది ఏనాటి మాట! అప్పుడు మీరు రాజునన్న అహంలో వున్నారు. ఇప్పుడు తీరని చిక్కుల్లో తల మునకలై కొట్టుమిట్టాడుతున్నారు," అన్నాడు.

రాజు జితకేతుడు, సామంతు సూర్యభూపతి కేసి అనుమానంగా చూస్తూ, "కాళీవర్మా! యీ సూర్యభూపతి మరెవరో రాక్షసుడూ, మాంత్రికుడూ అంటూ చెపుతున్నాడు. ఈ గందరగోళమంతా ఏమిటి? ఇద్దరు మాంత్రికులూ, యిద్దరు రాక్షసులూ ? " అన్నాడు.

"మహారాజా, ఈ గొడవలన్నిటికీ కారణం యిద్దరు మాంత్రికుల మధ్య చెలరేగిన పగా, వైరం. వాళ్ళు బ్రహ్మపుత్రానది జన్మస్థానానికి దాపులనున్న, ఒక పురాతన ఆలయంలోని భల్లూకేశ్వరికి భక్తులు. ఒకడి పేరు భల్లూకపాదుడు. వాడి శిష్యుడైన భల్లూక మాంత్రికుడే మన ప్రాంతాలకు వచ్చినవాడు. రెండవవాడు మిథ్యామిశ్రుడనే తాంత్రికుడు. వాడి శిష్యుడే తమ మాయామర్కటుడు. ఇక రాక్షసు లిద్దరూ అన్నదమ్ములు. ఉగ్రదండుడనేవాడు మాతో వున్నాడు. వాడి అన్న అయిన కాలదండుణ్ణి,



ఆ తాంత్రికి మిధ్యామిశ్రుడు బందిగా పట్టుకున్నాడు. అదీ సంగతి!'' అన్నాడు కాళీవర్మ.

కాళీవర్మ మాట ముగించే లోపలే సామంతు సూర్యభూపతి, ''మహారాజా, ఆ తాంత్రికుడే తన బందీ అయిన రాక్షసుణ్ణి వెంటబెట్టుకుని, నా కోట మీద దాడికి వచ్చివుంటాడు. సెలవు, మళ్ళీ తమ దర్శనం చేసుకుంటాను,'' అంటూ అక్కణ్ణించి వేగంగా వెళ్ళిపోయాడు.

రాజు జితకేతుడు దిగాలుపడిపోతూ, కాళీవర్మతో, ''కాళీవర్మా! ఇప్పుడు నువ్వేం చేయబోతున్నావు? ఓహో౯, ఒక చేతిలో మంత్రదండం వున్నది; రెండవ చేత్తో ఒర నుంచి కత్తి దూయగలవు! నేను రాజ్యపాలన విషయాల్లో అసమర్థుణ్ణేమోకాని, కత్తియుద్ధంలాంటి విద్యల్లో అసమర్థుణ్ణీకాదు, పిరికివాణ్ణీ కాదు. ఇంతకూ నువ్వు నామీద దేన్ని ప్రయోగించబోతున్నావు?'' అన్నాడు.

కాళీవర్మ మంత్రదండాన్నీ, ఒర నుంచి కత్తినిలాగి దాన్నీ, కిందపడవేస్తూ, ''మహారాజా, నేను యీ రెండింటిలో దేన్నీ తమ మీద ప్రయోగించబోవటం లేదు. మీ పాలనలో జరిగిన అన్యాయాలకు బాధ్యత మీరూ, మీకు సలహాలిచ్చిన మంత్రులూ సమంగా పంచుకోవలసి వుంటుంది. అయినా యిప్పటి పరిస్థితుల్లో రాజ్యాన్ని మాంత్రికుల నుంచీ, రాక్షసుల నుంచీ కాపాడవలసిన బాధ్యత నా మీద కూడా వున్నది,'' అన్నాడు.

రాజు జితకేతుడు ఆ మాటలకు చాలా సంతోషించి, కింద పడివున్న కాళీవర్మ కత్తిని స్వయంగా చేతికి తీసుకుని, కాళీవర్మకు యివ్వబోతున్నంతలో దాపుల నున్న సొరంగ మార్గం నుంచి ముందు రాజు దుర్ముఖుడూ, వెనకగా భల్లూక మాంత్రికుడూ పైకి వచ్చారు.

దుర్ముఖుడు భీకరంగా ఒక కేక పెట్టి, ఒరనుంచి కత్తి దూసి, ''కాళీవర్మా, నీకేమైనా హాని జరిగి వుంటుందేమో అను



ఉన్నాము. సరే, యీ రాజు జితకేతుణ్ణి యింకా ప్రాణాలతో వుండనిచ్చావేం? ఇదుగో, నా కత్తికి బలిచేయబోతున్నాను,'' అంటూ జితకేతుడి కేసి దూకాడు.

కాళీవర్మ చప్పున దుర్ముఖుడి కత్తికి తన కత్తిని అడ్డుపెట్టి, ''రాజా దుర్ముఖా! తొందరపడకు. ఈ జితకేత రాజుగారి వంశానికి సేవచేస్తూ, యుద్ధంలో నా తండ్రి మరణించాడు. ఆ సంగతి మరిచి, యిప్పుడీ మహారాజును చంపటం పాప కారణం అవుతుంది,'' అన్నాడు.

దుర్ముఖుడు కోపంగా ఏదో అనబోయేంతలో భల్లూక మాంత్రికుడు చప్పున వంగి కిందపడివున్న మంత్రదండాన్ని చేతికి తీసుకుంటూ, ''కాళీవర్మా, బాగా చెప్పావు. నా గురువైన భల్లూకపాదుడి ప్రబలవిరోధి తాంత్రిక మిథ్యామిశ్రుడు రాక్షసుడు కాలదండుణ్ణీ, తన సేవకుడైన జంబుకేశ్వరుణ్ణీ వెంట పెట్టుకుని, యీ ప్రాంతాలకు వచ్చాడు. అంటే, వాడేదో నాగురువుకు హాని కలిగించే వచ్చి వుంటాడని నా అనుమానం. మనం వెంటనే భల్లూక పాద పర్వతాలకు వెళ్ళాలి,'' అన్నాడు.

''మనం అటు వెళితే, యిక్కడ ఆ తాంత్రికుడి ఆగడాలు అపటం ఎట్లా? వాడు సామంతు సూర్యభూపతి కోటమీద దాడికి వెళ్ళినట్టు తెలిసింది. ఆ కోటలో పెద్ద సైన్యం అంటూ ఏమీలేదు,'' అన్నాడు కాళీవర్మ.

భల్లూక మాంత్రికుడు విసుక్కుంటూ, ''ఆ సంగతులన్నీ సారంగ మార్గంలో ప్రవేశించే ముందు, తన కోట కేసి పోతున్న సూర్యభూపతి చెప్పగా విన్నాను. మనం యీ రాజులా, సామంతులా గొడవల్లో ఎందుకు తల దూర్చాలి?'' అన్నాడు.

కాళీవర్మ కోపంగా మాంత్రికుడి కేసి చూస్తూ, ''ఈ రాజ్యంలో పుట్టి పెరిగిన వాణ్ణి, ముందు యీ రాజ్యం, దాని పాలకులా క్షేమం చూడకుండా, ఎక్కడో కొండల్లోవున్న ఒంటరి మాంత్రికుల సహా

యానికి పోవటం, ఏమాత్రం ధర్మం అనిపించుకోదు,'' అన్నాడు.

ఆ జవాబుకు భల్లూక మాంత్రికుడు వెలవెలపోతూ, ''శిష్యా కాళీ, నువ్వు క్షణాల మీద చాలా మారిపోయావు. మంత్రదండం తెచ్చిన వాళ్ళకు అర్ధ రాజ్యం, తన దత్తుకుమార్తెనూ యిస్తా నన్న యీ జితకేతురాజు మాటలు నమ్మి మోసపోకు,'' అన్నాడు.

''ఇందులో అర్ధరాజ్యం, రాజకుమార్తెతో వివాహం అన్న ప్రసక్తే లేదు. మంత్రదండం యిచ్చింది మహారాజుగారికి కాదు; నీకు గదా?'' అంటూ కాళీవర్మ రాజు జితకేతుడి కేసి చూశాడు.



రాజు జితకేతుడు ఒకసారి తలవూపి, ''ఇక్కడవున్న రాజు దుర్ముఖుడూ వాళ్ళ సమక్షంలో....'' అంటున్నంతలో రాక్షసుడు ఉగ్రదండుతు రాతిగద పైకెత్తి భీకరంగా అరుస్తూ సారంగం నుంచి బయటికి వచ్చి, ''రాజు దుర్ముఖుడే కాదు, నేనూవున్నాను. అదుగో, తలారి భల్లూకుడు కూడా వస్తున్నాడు. రాజా అ చెప్పబోయేదేదో మా అందరి సమక్షం లోనూ చెప్పు!'' అన్నాడు.

రాజు జితకేతుడు, ఉగ్రదండుణ్ణి చూసి ఒకక్షణం భయకంపితుడైపోయి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, ''నాకు సంతానం లేదు, నా తరవాత రాజ్యానికి ఎవర్ని వారసుడుగాపెట్టి పోదామా అని ఆలోచిస్తున్నాను. అనుకోకుండా యిప్పుడు మంచి అవకాశం లభ్యమైంది. సామంతు సూర్యభూపతి కుమార్తె నా దత్తురాలు. ఆమెను కాళీవర్మకిచ్చి వివాహం చేస్తాను. నా తరవాత యీ చంద్రశిలానగరం రాజ్యానికి అతడే రాజు!'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు, ''జై, భల్లూక పాదగురో!'' అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, ''సాధ్యాసాధ్యాలు చూడకుండా, యిక్కడ గాలిమేడలు కట్టేస్తున్నారు. ఆ దుర్మార్గుడు తాంత్రిక మిశ్రుడు యీసరికి సూర్యభూపతి ఏకైక పుత్రికను.

చెరపట్టి, తన స్థావరం అయిన కొండ ప్రాంతాలకు బయలుదేరివుంటాడు. వాడికి ఎంతోకాలంగా భల్లూకేశ్వరికి ఒక పూజారిణిని సంపాయించాలని ఆశగా వున్నది,'' అన్నాడు.

''అది నేను జీవించివుండగా ఆ తాంత్రికుడికి సాధ్యంకాదు!'' అంటూ కాళీవర్మ కత్తి దూశాడు.

"నేనూ, అదే ప్రతిజ్ఞ చేస్తున్నాను, కాళీ!" అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తాడు.

భల్లూక మాంత్రికుడు చిన్నగా నవ్వి, ''మీ ప్రతిజ్ఞలు నెరవేరాలనే నేనూ కోరుకుంటున్నాను. ఉగ్రదండా! పనిలో పనిగా ఆ తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణించి, నీ అన్న కాలదండుణ్ణి కూడా రక్షించుకో. అతడికేవో మందు మాకులతో మతిపోగొట్టి ఆ తాంత్రికుడు నమ్మిన బంటులా ఉపయోగించుకుంటున్నాడు. సరే, యిక వస్తాను!'' అంటూ సారంగ మార్గం కేసి బయలుదేరాడు.

భల్లూక మాంత్రికుడు సారంగ మార్గాన్ని చేరబోతున్నంతలో, ఒక పొద చాటు నుంచి తలారిభల్లూకుడు, ''దిరిసెనవన భైరవా!'' అంటూ గండ్రగొడ్డలి ఎత్తి, అతడి ముందుదూకి, ''మాంత్రిక భల్లూకా! నీ మంత్ర కారణంగా సగం భల్లూకంగా మారిన, యీ నగర తలారి మాటేమిటి? నువ్వూ, నేనూ, నీ గురువూ అందరం భల్లూక నామాలతో పెద్ద గందరగోళానికి కారణం అయాం. నన్ను తిరిగి మనిషిగా మారుస్తావా, యీ గండ్రగొడ్డలితో తలనరకమంటావా?'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు గడగడ లాడిపోతూ, ''నువ్వు తలారి భల్లూకుడివి కాదు; ఈ నగర ప్రధాన తలారివి! పోయి, దిరిసెనవనంలో శిక్షపడిన వాళ్ళ తలలు నరుకు!'' అంటూ మంత్ర దండంతో తలారిభల్లూకుడి తల మీద మూడుసార్లు కొట్టి, మెరుపు వేగంతో సారంగంలోకి దిగిపోయాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)






## 22

[సామంతు సూర్యభూపతి, తన కోట రక్షణకై వెళ్ళాడు. మర్కటుడు కూడా కోటగోడ దూకి పారిపోయాడు. భల్లూకమాంత్రికుడు తన గురువు ఆపదలో వున్నాడని సారంగమార్గం ప్రవేశిస్తూండగా, తలారి భల్లూకుడు అతణ్ణి అటకాయించాడు. మాంత్రికుడు అతణ్ణి నగరతలారి వంటూ మంత్రదండంతో తల మీద కొట్టి, సారంగంలోకి వెళ్ళాడు. తరవాత—]

భల్లూక మాంత్రికుడు వెళ్ళిపోగానే, రాజు జితకేతుడు, కాళీవర్మ కేసి చూసి, "ఇప్పుడు మనం ఏం చేయటం బావుంటుంది? మీ అందరి సమక్షంలో సామంతు సూర్యభూపతి కుమార్తె, నా దత్తురాలని చెప్పాను. ఆమెను, మర్కటుడి గురువైన మిథ్యామిశ్రుడి నుంచి రక్షించవలసి వున్నది గదా? సైనికులను వెంట తీసుకుని అరణ్యానికి వెళదామా?" అన్నాడు.

"మహారాజా, వెంట సైనికులతో కోలాహలంగా అరణ్యం ప్రవేశించటమంటే, ఆ తాంత్రికుణ్ణి ముందుగానే హెచ్చరించటం అవుతుంది," అని, కాళీవర్మ అక్కడి నుంచి కదిలాడు.

కాళీవర్మ వెనకగా, రాక్షసుడు ఉగ్రదండుడూ, నగర తలారీ బయలుదేరారు. అప్పటివరకూ అంతా చూస్తూ నిలబడిన బైరాగిగురువూ, అతడి శిష్యులూ సారంగ



"ఇందులో వింత పడేందుకేమున్నది? ఈ ఎలుగుబంటు దుర్మార్గుడైన ఆ తాంత్రికమిశ్రుడి పెంపుడు జంతువై వుంటుంది. మనం చడీచప్పుడూ కాకుండా దీన్ని అనుసరించిపోతే, వాడెక్కడ వున్నదీ తెలుసుకోవచ్చు." అన్నాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

ముగ్గురూ ఎలుగుబంటి వెనకగా కొంత దూరం వెళ్ళేసరికి, ఒక చెట్టు కింద భల్లూకమాంత్రికుడూ, తెల్లని గడ్డంతో, బక్కచిక్కిన శరీరంతో, మెడలో రుద్రాక్ష మాలలతో ఒక వృద్ధుడూ వాళ్ళ కంట బడ్డారు. సామంతు సూర్యభూపతి వాళ్ళతో ఏదో మాట్లాడుతున్నాడు.

మార్గాన్ని జితకేతరాజుకు చూపుతూ, "మహారాజా! మేము చెరువుగట్టున, మర్రిచెట్టు సమీపానవున్న యీ సొరంగ ముఖద్వారానికి కాపలావుంటాం, సెలవు!" అంటూ సొరంగలో దిగారు.

ఈసారి కాలినడకన కాళీవర్మా, తలారీ, రాక్షసుడూ అరణ్యం ప్రవేశించే సరికి, వాళ్ళకు ఒకచోట పెద్ద ఎలుగు బంటు ఒకటి కనిపించింది. అది కొన్ని దుంపలనూ, పళ్ళనూ అడవితీగలతో కట్టి భుజానవేసుకుని, వేగంగా నడుస్తున్నది.

కాళీవర్మ ఆశ్చర్యపోతూ, "ఉగ్ర దండా! ఏమిటీ వింత?" అన్నాడు.

కాళీవర్మను అంతదూరాన చూస్తూనే భల్లూకమాంత్రికుడు లేచి నిలబడి, "శిష్యా కాళీ!" అంటూ పెద్దగా కేకపెట్టి, "ఇరుగో, నా గురువు భల్లూకపాదుడు, యిక్కడే వున్నారు! సూర్యభూపతి కుమార్తె అయిన కాంచనలతను తాంత్రికమిథ్యామిశ్రుడు కోటలో నుంచి అపహరించుకుపోయాడు. ఇప్పుడేం చేయబోతున్నావు?" అన్నాడు.

ఎలుగుబంటును గండ్రగొడ్డలితో కొట్టేం దుకు పొంచి నడుస్తున్న నగర తలారి చప్పున గొడ్డలిని భుజాన పెట్టుకుని, "ఈ జంతువు భల్లూకపాదుడి పెంపుడి దన్నమాట! బతికిపోయింది," అన్నాడు.



భల్లూకమాంత్రికుడు వాళ్ళ దగ్గిరకు వచ్చి, "నా గురువుగారి పెంపుడు ఎలుగు మిమ్మల్నిక్కడికి తెచ్చిందన్న మాట! ఆ తాంత్రికుడు నా గురువును, భల్లూకేశ్వరి ఆలయం ముందు ఒక చెట్టుకు కట్టి, నిరాహారిని చేసి చంపాలని చూశాడు. కాని, వాడు యీ ప్రాంతాలకు బయలు దేరగానే, స్వామిభక్తి గల ఎలుగుబంటు ఆయనకట్లువిప్పి, కాపాడింది," అన్నాడు.

ఉగ్రదండుడు ముసలి భల్లూకపాదుడి కేసి కోపంగా చూస్తూ," నా అన్న కాలదండు డెక్కడ?" అని అడిగాడు.

భల్లూకపాదుడు మెడలోని రుద్రాక్ష మాల కేసి ఒకసారి చూసుకుని, చిరునవ్వు నవ్వి, "ఈ ప్రశ్న అడగవలసింది నన్ను కాదు, తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణి! వాడు మందుమాకులతో నీ అన్నను మూగ వాణ్ణి చేసి, నేనీ ఎలుగుబంటును వాహనంగా వాడుకుంటున్నట్టు, వాడుకుంటున్నాడు. వాణ్ణి యీ అరణ్యంలో వెతికి పట్టగలిగితే, అక్కడ నీ అన్న కాలదండుడితోపాటు, రాజకుమార్తె కాంచనలత కూడా దొరుకుతుంది. మీలో అంత సాహసికులెవరు?" అన్నాడు.

కాళీవర్మ కత్తిపిడి మీద చేయివేసి, "ఆ సాహసం ఏదో నేనే చేసి, ఆ కాంచన లతను రక్షించటమేకాదు, ఆ తరవాత ఆ తాంత్రికుణ్ణీ, నిన్నూ, నా కత్తికి బలి చేస్తాను. మంత్రతంత్రాలు నేర్చిన దుష్టులెవరూ, యీ ప్రాంతాల ప్రాణాలతో వుండటానికి వీలులేదు," అన్నాడు.

ఆ మాటలకు భల్లూకమాంత్రికుడు పళ్ళుకొరుకుతూ, మంత్రదండం పైకెత్త బోయేంతలో, సామంతు సూర్యభూపతి అతణ్ణి వారించి, "కాళీవర్మా, ఈ భల్లూకపాదుడూ, యీయన శిష్యుడైన భల్లూకమాంత్రికుడూ మనకు శత్రువులు కాదు. శంఖం ఊదుతూ, మాయామర్కటుణ్ణి గురువైన తాంత్రికుడి దగ్గిరకు రావలసిందిగా హెచ్చరిస్తున్న, వాళ్ళ సేవకుణ్ణి పట్టుకునేందుకు, యింతకుముందే నాకు



చాలా సాయంచేశారు. ఇదుగో, ఆ శంఖం! వాణ్ణి, ఎంత హింసపెట్టినా తన యజమాని, ఎక్కడ వున్నదీ చెప్పలేదు. ఆ దుష్టుణ్ణి నా కత్తికి బలిచేశాను,'' అన్నాడు.

కాళీవర్మ శంఖాన్ని దూరంగా విసిరివేసి, ''రాజా సూర్యభూపతీ! నువ్వు నిజంగా బలిపెట్టవలసింది, నీ కుమార్తెను అపహరించుకుపోయిన తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణి, వాడి సేవకుణ్ణి కాదు. సరే, మనం తలా ఒకవైపుకు పోయి, వాడి కోసం వెతుకుదాం, దొరక్కపోడు,'' అంటూ బయలుదేరాడు.

భల్లూకపాదుడు మెచ్చుకుంటున్నట్టు తలవూపి, భల్లూకమాంత్రికుడితో, ''శిష్యా, నువ్వు మనకు కావలసిన జాతకుణ్ణే పట్టావు. కాని, పరిస్థితులు అనుకూలించక మన చేజారిపోయాడు. ఇప్పుడు మనం ఆ తాంత్రికుణ్ణి హతమార్చటంతో తృప్తి పడదాం. ఇక కదలండి!'' అన్నాడు.

ఆ వెంటనే ఎలుగుబంటును ఎక్కి భల్లూకపాదుడూ, అతడి శిష్యుడు భల్లూకమాంత్రికుడూ ఒకపక్కగానూ; రాక్షసుడు ఉగ్రదండుడూ, తలారీ, సామంతు సూర్యభూపతీ ఖరొకపక్కగానూ అరణ్యంలోకి బయలుదేరారు.

కాళీవర్మ దారివెంట అడుగుల గుర్తు కోసం వెతుకుతూపోగా, ఒకచోట అతడికి మామూలుమనుషుల అడుగుల గుర్తులతో పాటు, అంతకు రెండు, మూడింతలున్న అడుగుల గుర్తులు కనిపించినై. వెంటనే అతడికి తాంత్రికుడి వెంటవున్న ఉగ్రదండుడి అన్న అయిన కాలదండ రాక్షసుడు గుర్తుకు వచ్చాడు.

ఆ దాపులలో ఎక్కడో తాంత్రికుడు స్థావరం ఏర్పరచుకుని వుంటాడనుకుంటూ కాళీవర్మ పొదలచాటుగా నడుస్తూ మరికొంతదూరం పోయేసరికి, అతడికి ఒక పెద్దకొలనూ, అందులో వచ్చి పడుతున్న ఒక సెలయేరూ కంటబడినై. ఆ సెలయేటి ఒడ్డున పొడవాటి త్రిశూలం ఒకటి నేలలో గుచ్చబడి వుండటం

చూసి కాళీవర్మ ఆశ్చర్యపడుతూ మరి కాస్త ముందుకు వెళ్ళాడు. కొలనులో ఒక దృఢకాయుడు, నల్లని జులపాల జుట్టుతో, చిన్నగడ్డంతో అతడి కంట బడ్డాడు. వాడు కళ్ళుమూసుకుని, ఏదో మంత్రం జపిస్తున్నాడు.



వాడు మరెవరో కాదు, తాంత్రిక మిథ్యామిశ్రుడని కాళీవర్మ వెంటనే గ్రహించాడు. అతడు కోపంతో పళ్ళుకొరికి, వేగంగా కొలను ఒడ్డుకుపోయి, "ఒరే, నువ్వేగదా, తాంత్రిక మిథ్యామిశ్రుడివి? తాంత్రికుడికి మంత్రాలతో ఏం పని? నువ్వు అపహరించుకువచ్చిన సూర్యభూపతి కుమార్తె కాంచనలత ఎక్కడ?" అన్నాడు బిగ్గరగా.

మంత్రం జపిస్తున్నవాడు చప్పున కళ్లు తెరిచి, కాళీవర్మ కేసి పరీక్షగా ఓమారు చూసి, "చెప్పకుండానే, నా పేరు గ్రహించావు. నిశ్చయంగా తెలివైనవాడివే! నా శంఖం మోసే సేవకుణ్ణి, అరణ్యంలో యింతకుముందే ఎవరో చంపారని, నా శిష్యుడు భ్రాంతిమతి చెప్పాడు. ఆ చంపినవాడివి నువ్వు కాదుగదా?" అని అడిగాడు.

"ఆ సంగతి తరవాత చెపుతాను, కాంచనలతను ఎక్కడ దాచావు?" అంటూ కాళీవర్మ కత్తి దూయబోయేంతలో, పైనున్న చెట్లకొమ్మల్లో మాయామర్కటుడు కిచకిచ మంటూ అరిచి, "తాంత్రిక గురో! వీడే కాళీవర్మ, పుట్టుసాహసి! వేయిమాటలేల, ఈ క్షణానే వీడి ప్రాణాలు తీయటం మనకు క్షేమం!" అంటూ కొమ్మల్లోంచి కాళీవర్మ కేసి దూకుతున్నంతలో, కత్తిదూసే వ్యవధిలేక, కాళీవర్మ చప్పున పక్కనే వున్న త్రిశూలాన్ని, మర్కటుడి కేసి పైకెత్తాడు.

మాయామర్కటుడు ఆ సరికే కొమ్మ మీది నుంచి రివ్వున కిందికి వస్తూ, బలంగా త్రిశూలాన్ని తాకటంతో, కాళీవర్మ చేయి పట్టు తప్పి త్రిశూలం తిరిగి నేలలో గుచ్చుకుపోయింది. మర్కటుడు త్రిశూలం



మీద కొరతపడిపోయి. బాధతో కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ. "జై. తాంత్రిక గురో! తిరిగి తమకు సేవచేసే భాగ్యం ఆ పైలోకంలోనే!" అంటూ అరవసాగాడు.

కాళీవర్మ తాపీగా ఒర నుంచి కత్తి లాగి, కొలను నీటిలో నిశ్చేష్టుడై చూస్తున్న తాంత్రికుడితో, "ఒరే, తాంత్రికాధమా! నువు పూజించే భల్లూకేశ్వరి పేరు మీద, నిన్ను కొలను ఒడ్డునే నా కత్తికి బలిచేయబోతున్నాను. ముందు కాంచనలతను ఎక్కడదాచావో,చెప్పు." అన్నాడు.

అంతవరకూ నిశ్చేష్టుడైవున్న తాంత్రికుడు చిరునవ్వు నవ్వి, చేతులు చాచి, గుప్పెళ్ళు మూసి తెరుస్తూ, తలను అటూ యిటూ రకరకాలుగా తిప్పసాగాడు. ఆ వింతప్రవర్తనకు ఆశ్చర్యపోతూ, కాళీవర్మ కొలను నీటిలో దిగబోతున్నంతలో, వెనకవైపునుంచి, "యువకుడా, జాగ్రత్త! తాంత్రికుడు సైగచేస్తున్నది, మూగ రాక్షసుడికి!" అన్న స్త్రీ కంఠం వినిపించింది.

కాళీవర్మ చప్పున వెనుదిరిగాడు. రాక్షసుడు ఉగ్రదండుణ్ణి పోలినవాడొకడు భుజాల మీదినుంచి ఒక యువతిని కిందికి దించి, అడవి ఏనుగులా ఒకసారి ఘీంకరించి, రాతిగద పైకెత్తి వేగంగా కాళీవర్మకేసి వచ్చాడు. కాళీవర్మ మెరుపువేగంతో రాక్షసుడి దారి నుంచి పక్కకు తప్పుకున్నాడు. రాక్షసుడు కొలను ఒడ్డునున్న బురదలో కాలుజారి, నీటిలో బోర్లాపడిపోయాడు. వాడి చేతిలో వున్న రాతిగద ఒడ్డున పడిపోయింది.

రాక్షసుడు యీసారి మరింత పెద్దగా ఘీంకరించి, మోచేతులను నేలకు ఊతంగాపెట్టి లేవబోతున్నంతలో, కాళీవర్మ ఛెంగున ముందుకు దూకి, రాతిగద తీసుకుని, వాడి తలమీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు రాక్షసుడు భీకరంగా ఒక్క అరుపు అరిచి, ప్రాణం కడబట్టి, నీటి ఒడ్డున శవంలా పడిపోయాడు.

కాళీవర్మ, ఎటు పారిపోవటమా అని దిక్కులు చూస్తున్న తాంత్రిక మిథ్యా

మిత్రుడి కేసి ఓమారు చూసి, రాక్షసుడు తెచ్చిన యువతితో, "నువ్వేగదా, సూర్య భూపతి కుమార్తె కాంచనలతవు?" అన్నాడు.

ఆ యువతి అవునన్నట్టు తల వూపి, "తాంత్రికుడి యిద్దరు సేవకులూ చచ్చి నట్టున్నది! వాణ్ణి ప్రాణాలతో వదలరాదు. నా దగ్గిర ఆయుధం లేదు. నీ కత్తి నాకు యిచ్చి, మూగరాక్షసుడి రాతిగద నువ్వు తీసుకో. ఈ దుర్మార్గుణ్ణి వేటాడదాం," అన్నది.



కాళీవర్మ ఆ మాటలకు పరమానందం చెంది, కత్తిని కాంచనలతకు యిచ్చి, రాతిగదను భుజానపెట్టుకుని, కొలనునీట దిగి, తాంత్రికుడి కేసి పోబోతున్నంతలో, రాజు జితకేతుడు యిద్దరు సైనికులతో అక్కడికి వచ్చి, "కాళీవర్మా, యిది మొసళ్ళకొలను. వెంటనే ఒడ్డుకురా! ఈ తాంత్రికుణ్ణి వేటాడేందుకు నా సైనికులూ, నగర తలారీ, రాక్షసుడు ఉగ్రదండుడూ వస్తున్నారు." అని ఆశ్చర్య పోతూ దిక్కులు చూస్తున్న కాంచన లతను సమీపించి, "అమ్మా, నువు నా దత్తుకుమార్తెవు! ఆ కారణంగా, నాకు నచ్చిన యువకుడికి, నిన్నిచ్చి వివాహం చేసే హక్కు నాకున్నది, అవునా?" అన్నాడు.

కాంచనలత సిగ్గుపడుతూ, తల దించుకునేంతలో అక్కడికి సామంతు సూర్య భూపతితో పాటు ఎలుగుబంటు మీద భల్లూకపాదుడూ, భల్లూకమాంత్రికుడూ, తలారీ, ఉగ్రదండుడూ వచ్చారు.

సూర్యభూపతి కన్నీళ్ళు పెడుతూ, తన కుమార్తెను సమీపించి, "అమ్మా, నిన్ను తిరిగి ప్రాణాలతో కళ్ళచూస్తాననుకోలేదు." అని కాళీవర్మతో, "కాళీవర్మా, నువ్వు మహావీరుడివి, సందేహం లేదు," అన్నాడు.

రాజు జితకేతుడు నవ్వుతూ, కాళీవర్మ చేయిపట్టుకుని, అతణ్ణి కాంచనలత దగ్గిరకు తీసుకువచ్చి, "నా దత్తు

కుమార్తె కాంచనలతకూ, యీ క్షత్రియ యువకుడు కాళీవర్మకూ, యిదే మీ అందరి సమక్షంలోనూ పాణిగ్రహణం చేస్తున్నాను. నా తదనంతరం యితడే చంద్రశిలానగరానికి రాజు!'' అన్నాడు.

అందరూ హర్షధ్వానాలు చేశారు. అంతలో కొలను నుంచి ఒక చావుకేక విని పించింది. అందరూ అటు చూసేసరికి, ఒక పెద్ద మొసలితో తాంత్రిక మిథ్యా మిశ్రుడు చావుబతుకుల పోరాటం చేస్తు న్నాడు. అది చూసి భల్లూకమాంత్రికుడు ఉత్సాహంగా మంత్రదండాన్ని పైకెత్తి ఊపుతూ, ''భల్లూకపాదగురో! భల్లూ కేశ్వరీదేవికి యిక మీరే ప్రధాన పూజా రులు! మీ విరోధి మొసలికి ఆహారం అయిపోతున్నాడు,'' అన్నాడు.

అందరూ చూస్తూండగానే మొసలి, తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణి నోటకరుచు కుని కొలను నీట మునిగిపోయింది. రాక్షసుడు ఉగ్రదండుడు, నీటి ఒడ్డుకు పోయి, ప్రాణం కడబట్టి పడివున్న కాల దండ రాక్షసుణ్ణి కూర్చొబెట్టి, ''అన్నా! ఇంతకాలంగా నిన్ను హింసపెట్టిన తాంత్రి కుడు మొసలికి ఎర అయిపోయాడు, ఇక లే!'' అంటూ వీపున గట్టిగా చరిచాడు.

రాక్షసుడు కాలదండుడు చప్పునలేచి నిలబడి, రెండు చేతులతో గొంతు గట్టిగా పట్టుకుని, కొలను కేసి చూస్తూ కీచు మంటూ అరిచి, ''తమ్ముడూ, ఉగ్ర దండా, ఆ తాంత్రికుడు చచ్చాడా? వాడు తినిపించిన విషాలతో, వాడంటే పుట్టిన భయంతో, యింతకాలంగా నేను మూగవాణ్ణయిపోయాను. ఇంత రాక్షసు ణ్ణయిన నన్ను ఎదిరించి, మూర్ఛ పోగొట్టిన ఆ మహావీరు డెక్కడ?'' అంటూ పెద్ద అంగలు వేస్తూపోయి, కాళీవర్మనూ, పక్కనే నిలబడి వున్న కాంచనలతనూ ఎత్తి, భుజాల మీద కూర్చొబెట్టుకున్నాడు.

భల్లూకమాంత్రికుడితోపాటు అందరూ బ్రహ్మానందపడిపోతూ, హర్షధ్వానాలు చేశారు. — (అయిపోయింది)

